## సఖియా నాతో రా...

ఆడియో రిలీజ్ ఫంక్షన్‌లో...



నవవిధ నాయికలు ఆర్తీ అగర్వాల్, త్రిష, శ్రియ, రిచా, కిరణ్ రాథోడ్, అనిత, అదితి అగర్వాల్, నౌహిద్, శ్రీదేవిలతో తరుణ్

హాసం
హాస్య- సంగీత పత్రిక

# ఇవీ సంగతులు
75

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**
'సఖియా' నాతోరా..
చిత్రంలో తరుణ్



## హాస్యం











## సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో

సినిమా పాటల ప్రత్యేకం




పాత పాటల ప్రత్యేకం
45వ పేజి నుండి50 వ పేజి వరకు





'హాసం' అక్టోబరు 1-15 సంచికలో ప్రచురింపబడిన నా జోక్‌కి గాను మీరు పంపిన 'కాంప్లిమెంటరీ కాపీ' మరియు "గౌరి సి.డి" అందినవి. గతంలో మీరు 'పల్లకి' వారపత్రికలో 'మినీపల్లకి' నిర్వహించేటప్పుడు నేను ఆ శీర్షికలలో పాల్గొనే వాడిని. మళ్లీ మీ ఆధ్వర్యంలోనే వస్తున్న ఈ మీ(మా) హాసంకు నేను రెగ్యులర్ పాఠకుడిని. నా వృత్తిలో ఉన్న బిజీ కారణంగా రచనా ప్రవృత్తిని కొనసాగించలేక పోయేవాణ్ణి. అయితే మన 'హాసం' పత్రిక కోసం సరదాగా ఖాళీసమయాల్లో కొన్ని శీర్షికలలో పాల్గొందామనుకుంటున్నాను. ఆ విధంగా నన్ను తిరిగి 'హాసం' పురిగొల్పిందనడంలో సందేహం లేదు.

**-మడగల గోవిందరావు(లెక్చరర్ ఇన్ కామర్స్) అనకాపల్లి.**

'హాసం' పత్రికతో రెండు సంవత్సరాల అనుబంధం నాకు. "హాసం"ను చూడకపోతే ఏదో వెలితిగా అనిపిస్తుంది. "హాసం"లో అన్ని అంశాలు నాకు నచ్చుతాయి. ముఖ్యంగా ఈమధ్యే మొదలైన పులగం చిన్నారాయణగారు అందిస్తున్న 'జంధ్యామారుతం' ఎంతో బాగుంటోంది. ప్రతీపాత్రకు, ప్రతిసన్నివేశ చిత్రీకరణకు 'జంధ్యాల' గారు తీసుకునే శ్రద్ధను గూర్చి చదువుతుంటే అంతటి వ్యక్తి మనమధ్యలేక పోవటం ఎంతో బాధ కలుగుతుంది. ఇదే తరహాలో కె.విశ్వనాథ్, బాపు, దాసరినారాయణరావు, కె.రాఘవేంద్రరావుల చిత్రాల విశేషాలను కూడా అందిస్తారని ఆశిస్తున్నాము. 'రావి కొండలరావు'గారి హ్యూమరథం కూడా నాకు ఎంతో నచ్చుతుంది. ఏ ఒక్క వర్గానికో పరిమితం కాకుండా అన్నివర్గాల పాఠకులను అలరిస్తున్న 'హాసం'కు అభినందనలు.

**-కొవ్వూరి జగాశ్రీనివాసరెడ్డి, కొంకుదురు.**

ముచ్చటగా మూడు సంవత్సరాలు పూర్తి చేసుకుని ముందుకు సాగుతున్న 'హాసం'కు నా అభినందనలు. 73వ పత్రిక సంపాదకీయంలో, మీరు వ్రాసినట్లుగా సమాజంలో సమతుల్యాన్ని కాపాడాలంటే లలిత కళల అవసరం ఎంతైనా ఉన్నది. గతంలో యన్.టి.రామారావుగారు, ఘంటసాలగారు తదితరులు సమాజంలో ఏ సమస్యలు వచ్చినా ప్రజల మధ్యకు వెళ్ళి, కళారూపాలు ప్రదర్శించి వారికి ఆత్మధైర్యాన్ని చేకూర్చేవారు. వార్ని ఆదర్శంగా తీసుకుని సినిమా కళాకారులు ముందుకు వస్తారని, 'హాసం' వారిని రప్పిస్తుందని ఆశిస్తున్నాను.

**-ముత్యాల భాస్కరరావు, రామరాజులంక.**

పక్షపాతం లేకుండా ప్రతి పత్రికనూ సంగీత సాహిత్యాభిమానులకు వసందైన విందు భోజనంగా అందిస్తున్న హాస్యాన్న దాత - వైవిధ్య భరితమైన శీర్షికలతో ప్రతిపూట విలువైన జరీ అద్దకాలతో పల్లెల్లో కళ్ళాపి చల్లిన ప్రాంగణం మీద అందమైన యువతులు దిద్దిన రంగవల్లిలా ప్రతి సంచికా ప్రత్యేక సంచికలా రాగఝరులు స్రవించే విపంచిలా మాకందిస్తున్న సంగీత సాహిత్యమర్మజ్ఞులు - శ్రీరాజాగారికి, 'హాసం' సిబ్బందికి దసరా పండుగ శుభాకాంక్షలు!

**-ఇలపావులూరి మురళీమోహనరావు, హైద్రాబాద్.**

16-31 హాసం చాలా బాగుంది. మాకిష్టమైన పాటలు పడమటి సంధ్యారాగం, సప్తపది గురించినవి పబ్లిష్ చేసినందుకు మీకు మా అభినందనలు, ముఖ్యంగా 'ఎడిటర్ పేజి' చాలా బాగుంది. సలహాలు ఇవ్వడం గొప్పకాదు. మంచి సలహాలు ఇవ్వడం, అవి అందరికీ ఆమోదయోగ్యంగా వుండేలా వుండాలి. ఈ విషయం గురించి బాగా చెప్పారు. ఒక్కో మనిషి ఆలోచన ఒక్కోరకంగా వుంటుంది. అట్లాగే మాకు ఇష్టమైన పాటలు 'పదహారేళ్ళ వయస్సు', 'వసంత కోకిల' సిన్మాలవి కూడా పబ్లిష్ చేయండి ప్లీజ్. ఇవి మాకుఇష్టమైన పత్రికలో మాత్రమే చూడగలం. ఇది మా ఫ్రెండ్స్ అందరి కోరిక.

**-కోట శ్రీదేవి, శృంగవరపుకోట.**

'హాసం' 16-31 అక్టోబరు సంచికకు నాగార్జున ముఖచిత్రం హైలైట్‌గా నిలుస్తుంది. "అన్నమయ్య పద భావ దర్శనమ్"లో గరిమెళ్ళ వారి వివరణ ఆ శీర్షిక పేరును ప్రతిబింబిస్తూ సాగింది. "తాతాధిత్తై తధిగిణతోం' హాస్య భరితంగా సాగుతోంది. వాగ్దానంలోని హరికథను 'రాజా' గారు చక్కగా విశ్లేషించారు. యస్.పి.శైలజ గురించి ఉన్నది ఉన్నట్లుగా రాసిన జానకిబాలకు అభినందనలు. శైలజ వాటిని దీవెనలుగా తీసుకోవాలి. ప్రతి సంచికనూ దాచుకుని బైండు చేసుకుని రిఫరెన్స్ బుక్‌గా మలుస్తున్నందుకు మీకు రుణపడిపోతున్నాం.

**-కె. లక్ష్మీ చంద్ర నరేష్, హైదరాబాద్.**

"మీరజాలగలడా పాట గురించి నా వివరణలను సహృదయంతో ప్రచురించి నందుకు ధన్యవాదాలు. నేను పంపిన జిరాక్సు కాపీద్వారా స్థానం వారి 'మీరజాలగలడా"పాట నేపథ్యాన్ని ఆంధ్రుల కందరికీ అందించిన మీ స్నేహభావానికి నా హృదయపూర్వక అభినందనలు.

**-డా॥ పురుషోత్తమాచార్య, నల్గొండ.**

'హాసం' పత్రిక విజయపథంలో మూడేళ్లు పూర్తిచేసుకోవడం ఎంతో సంతోషదాయకం. అక్టోబర్ 16-31సంచికలో 'ఆ పాత మధురం' శీర్షికన, "వాగ్దానం" చిత్రంలో మహాకవి శ్రీ శ్రీ కలం నుండి జాలువారిన ప్రామాణిక గీతం "శ్రీ నగజాతనయం"(హరికథ) విశ్లేషణ, పద్మశ్రీ స్థానం వారి అజరామరగీతం "మీరజాలగలడా" పుట్టుపూర్వోత్తరాలు. అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం శీర్షికన 'సాహిర్ లూధియాన్వీ "ప్యాసా" చిత్ర గీతి సాహిత్య రచన వ్యాసం. శ్రీ "రసాలూరి" తెలుగేతర బాషా గీతాలకు అందించిన మధుర సంగీత వ్యాసాలు చాలా ఉన్నంతగా ఉన్నాయి.

**-యన్.సారంగపాణి, అనంతపురం.**

హాసం 16-31 అక్టోబరు 2004 సంచికలో 'హ్యూమర్ బాక్స్' శీర్షికన నా జోక్స్ ప్రచురింపబడినందులకుగాను మీరు పంపిన 'స్మార్ట్ రీమిక్స్ సి.డి. చాలా అడ్వాన్స్‌గా అంటే 14.10.04 తేదినే అందినది. సరిగ్గా ఒక సంవత్సరం క్రితం నుండి నేను 'హాసం' చదువుతున్నాను. ప్రతి సంచికలోనూ ఏదో ఒక కొత్త శీర్షికను ప్రవేశపెట్టి, పాఠకులతో ఆసక్తిని రేకెత్తించి, వారిని 'హాసం' కోసం ఎదురు చూసేలా చేయడం నిజంగా అభినందనీయం. ఇటీవల మీరు ప్రవేశపెట్టిన 'అన్నమయ్య పదభావదర్శనమ్, పలకరిస్తే పద్యం చాలా బావున్నాయి. 'హాసం' ఇలాగే 'నవనవోన్మేషం'గా ఉండాలని ఆకాంక్షిస్తున్నాను.

**-ఎమ్.అంజిరెడ్డి, ఒంగోలు**

'వాగ్దానం'లోని 'శ్రీనగజాతనయం' హరికథ గురించి బాగా వ్యాఖ్యానించారు. నిజమే సినిమాలలో పెద్దింటి భాగవతార బాణీకే ఎక్కువ మక్కువ. చాలా బాగా వ్రాశారు. ఈ శ్రీనగజాతనయం శ్లోకం కూడ పెద్దింటివారిదీ- ఈ విషయం వారే స్వయంగా చెప్పారు. ఈ సంవత్సరం పెద్దింటి వారి శతజయంతి సంవత్సరం. వారి పూర్తిపేరు శ్రీమాన్‌పెద్దింటి దీక్షిత దాస భగవతార్. సంస్కృత భాషలో కూడా వారి హరికథలు జగత్ప్రసిద్ధమైనాయి. '93 వ సంవత్సరం వరకూ నర్సాపురం పట్టణంలో ఏ కళాకారుడు అడుగుపెట్టినా దీక్షితదాసుగారి ఆశీస్సులు తీసుకుని వెళ్ళాల్సిందే! దాసుగార్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణను ఇచ్చి గౌరవించింది. సినీరంగంలో ఎవరికీ తెలియని ఆ మహానుభావుని పేరును అందరికీ తెలిసే విధంగా 'దీక్షితదాస' శతజయంతి సందర్భంగా ఈపాటకు మీరిచ్చిన వ్యాఖ్యానం -శతవసంతాలకి నివాళిగా భావిస్తూ మీకు.నమోవాకాలర్పిస్తున్నా!

**-చక్రావధానుల... నరసాపురం.**

సంపుటి: 4 సంచిక:03

**1 - 15 నవంబరు 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్

**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్

**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ

**డా॥ కె.వి.రావు**

**జె.మధుసూదన శర్మ**

మేనేజర్

**పి.గిరి**

చీఫ్ లే-అవుట్ డిజైనర్

**జి.రాజేష్**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య - సంగీత పత్రిక

75

తెలుగునాట పుస్తకాల వ్యాప్తికి ఎంతో కృషి చేసిన వ్యక్తి ఈసెన్‌బర్గ్. ఫోర్డ్ ఫౌండేషన్ తరఫున మద్రాసులో పనిచేస్తూ సదరన్ లాంగ్వేజ్ బుక్ ట్రస్టు, ఎమెస్కో వారి ఇంటింటా గ్రంథాలయం స్కీముల ద్వారా ఆయన సామాన్యులలో పఠనాసక్తి పెంపొందించడానికి ఎంతో శ్రమించారు. ఆయన బాపుగారికి చెప్పేవారట - 'నువ్వు బొమ్మ వేసినపుడు ఎక్కడో అక్కడ పుస్తకాన్ని చూపించు. పాత్రల చేతిలోనో, టీపాయ్ మీదనో, వెనక అద్దాల బీరువాలోనో పుస్తకాలు కనబడాలి. అప్పుడే పుస్తకాలపైకి పాఠకుడి దృష్టి పోతుంది. ఆసక్తి పెరుగుతుంది. అభిరుచి మెరుగుపడుతుంది." అని. బాపు తన బొమ్మలలో దాన్ని అమలు చేశారు.

అభిరుచిగల కొందరు సినీనిర్మాతలు, దర్శకులు తమ చిత్రాలలోని దృశ్యాలలో ఏదో ఒక ఘట్టంలో పుస్తకాలను, పత్రికలను చూపిస్తూ ఆ ఒరవడిని కొనసాగిస్తున్నారు. పత్రికలు చదివే వారికంటె సినిమాలు చూసేవారే ఎక్కువ కాబట్టి ఈ ప్రక్రియద్వారా మరింత ఎక్కువమందికి ఆ సందేశం చేరుతుంది. తద్వారా పత్రికాపఠనం పట్ల ప్రజలకు ఆసక్తి కలుగుతుంది. ఆ చూపించే పత్రికలు కూడా మంచి అభిరుచిని ప్రోత్సహించేవి అయితే బాగుండునని దర్శకనిర్మాతలు అనుకోవడం సహజం.

ఇటీవల అలా ఎంచుకునే పత్రికలలో 'హాసం' ఉండటం సంతోషజనకం. ఈ మధ్య నాలుగు సినిమాలలో 'హాసం' ప్రస్తావన వచ్చింది. కృష్ణవంశీ తీసిన 'ఖడ్గం' సినిమాలో ఒక అసిస్టెంటు డైరక్టర్ పట్టుకున్న స్క్రిప్ట్ ఫైళ్లతో 'హాసం' కనబడుతుంది. పవన్‌కల్యాణ్ తాజా చిత్రం 'గుడుంబాశంకర్'లో ఓ బుక్‌స్టాల్‌లో కనబడుతుంది. 'దొంగ-దొంగది'లో ఓ పాత్రతో 'హాసం'లో మీ కవితలు చదివానని హీరో చెప్పడం జరుగుతుంది. సీనియర్ నిర్మాత పూర్ణచంద్రరావు శివనాగేశ్వరరావు దర్శకత్వంలో నిర్మించిన హాస్యభరితచిత్రం 'మిస్టర్ అండ్ మిసెస్ శైలజా కృష్ణమూర్తి'లో అయితే ఒక రైలుప్రయాణికుడు 'హాసం' చదువుతూ జోక్స్ ఎంజాయ్ చేస్తున్నట్లు నాలుగైదుసార్లు చూపించడం జరిగింది.

ఇవి మా అభ్యర్థనపై చొప్పించినవి కావు. పత్రిక పట్ల సదభిప్రాయం ఏర్పరచుకున్న సదరు దర్శకనిర్మాతలు సందర్భం కుదిరినపుడు తమంతట తాముగా చూపించినవి! వారందరికీ మా కృతజ్ఞతలు.

'హాసం' పత్రికకు సినిమా పరిశ్రమ అందిస్తున్న సహకారానికి తాజా తార్కాణం ఈ సంచికలోనే చూడవచ్చు. కె.విశ్వనాథ్ గారి 'స్వరాభిషేకం' ఆడియో వెలువడిందనగానే ఎంతోమంది సంగీతాభిమానులనుంచి 'హాసం'లో ఆ సినిమా పాటల సాహిత్యానికై ఎదురుచూస్తున్నామని ఫోన్‌కాల్స్ వచ్చాయి. కానీ క్లిష్టమైన స్వరాలతో కూడిన ఆ పాటలకు అక్షరరూపం ఇవ్వడం అంత తేలికైన పని కాదు. అందుకు పత్రికా సిబ్బందితో బాటు ఆరుగురు బయటివారి సహాయం కూడా తీసుకోవలసి వచ్చింది.

అందులో అయిదుగురు సినిమా పరిశ్రమకు సంబంధించినవారే! చిత్రాన్ని సమర్పిస్తున్న హరిగోపాలకృష్ణమూర్తి, గాయని శైలజ, గాయని సునీత, సంగీతదర్శకుడు విద్యాసాగర్‌తో బాటు తమిళలిపిలో స్వరాలు రాసి ఇచ్చిన ఆయన వాద్యబృందంలోని ఫ్లూటిస్టు కూడా సహకరించారు. వీరందరూ ఓ పత్రికకై సమయాన్ని, శక్తిని వెచ్చించడానికి కారణం - 'హాసం'లో ప్రచురితమయితే తమ కృషి సంగీతాభిమానులకు నేరుగా చేరుతుందనే నమ్మకం!

సమాచారాన్ని సాధ్యమైనంత నిర్దుష్టంగా అందించడానికి 'హాసం' తీసుకుంటున్న శ్రద్ధ, పడుతున్న శ్రమ వారికి తెలుసు కనుకనే 'హాసం'ని ఇంతగా ఆదరించడం జరుగుతోందని భావిస్తున్నాం.

శ్రమకు తగిన గుర్తింపుగానే దీనిని మేం అనుకుంటున్నాం. ఆదరణ, నమ్మకం రెండూ, రెండు రైలు పట్టాల వంటివి. ఈ రెండూ దృఢంగా ఉన్నంతవరకూ 'హాసం' పయనం నిరాటంకంగా, సునాయాసంగా సాగిపోతుంది. గమ్యం సుదూరమైనా లక్ష్యం చెక్కు చెదరకుండా ఉంటుంది.





# ఇండెంటింగ్ ఆఫీసర్

- బి.వి.వి.శారదా ప్రసాద్

'ఏదోయ్ ప్రకాశరావ్, తెచ్చావా' చేయిముందుకు చాపుతూ అడిగాడు సిగరాజు.

"అయ్యో, తేలేదుసార్. మధ్యాహ్నం లంచ్ కెళ్ళినపుడు మర్చిపోకుండా తెస్తాను" అంటూ సంజాయిషీ యిచ్చుకుని, యిటు తిరిగి, నుదురు కొట్టుకుంటూ 'ఖర్మ' అనుకున్నాడు ప్రకాశరావ్ స్వగతంగా.

"పోనీ, నేనూ మీ యింటికి రానా నీతో ?" నములుతున్న కిళ్లీని ఒక బుగ్గ నుండి మరో బుగ్గలోకి తోస్తూ అడిగాడు సిగరాజు.

"అయ్యయ్యో ఎంత మాటసార్... మర్చిపోను, తెస్తాను".

"మర్చిపోకు మరి మా అమ్మాయి తెగ గోల చేస్తోంది లెక్కలు చేసుకుందుకు కాయితాల్లేవని".

ప్రకాశరావ్‌ని తెమ్మని సిగరాజు అడిగినవి పాత సంవత్సరాల ఖాళీ డైరీలు. ఓ రోజున పొరపాటున నోరు జారాడతను 'యింట్లో నాలు గైదు డైరీలు పడున్నాయని.' మరుక్షణం యిండెంటు వచ్చేసింది సిగరాజు నుండి.

సెక్షను హెడ్ సిగరాజుకు అవసరాలు లెక్కకు మించినవి. అవసరాలన్నవి అందరికీ వుంటాయి. ఏ వస్తువు కావాలన్నా బజార్లకీ, షాపులకీ పరుగులు పెడతారందరూ. కానీ సిగరాజు అవసరాలు తీర్చుకునే దారేవేరు. కూర్చున్న చోటునుండి కదలకుండానే అతని అవసరాలు తీరిపోతూ వుంటాయి. ప్రతీక్షణం ఆయన బుర్రలో ఒక అవసరం. అది తీర్చేమనిషి రూపం పక్కపక్కనే

మెదలుతుంటాయి. అంతేకాదు, ఒక్కోసారి 'మా యింట్లో యిది వేన్నట్టగా పడుందీ' అని ఎవరయినా అనటమే తరువాయి, సిగరాజు బుర్రలో నెట్‌వర్క్ ఫ్లాష్‌లా పనిచేసి 'తన' యింట్లో అవసరాన్ని అతనికి గుర్తుచేస్తూ వుంటుంది. దాంతో అవతలి వాళ్లకి యిండెంటు పడిపోతూ వుంటుంది.

"సార్, డీ.ఎమ్. గారు పిలుస్తున్నారు" అటెండరు రామసామివచ్చి చెప్పాడు సిగరాజుకి.

"వస్తాను కాని, నే చెప్పిన పనేం జేశావ్? ఎన్ని సార్లు చెప్పాలి తమరికి? నాలుగు కొవ్వొత్తులు, కలరా వుండల ప్యాకెట్టు యింటికి పట్టుకెళ్లాలి యివ్వరా బాబూ అని మొన్న అడిగానా, నిన్న సాయంత్రం మరోమారు అడిగానా. యిచ్చావా నువ్వు?" ఖయ్యిమన్నాడు సిగరాజు.

"పనిలో పడి యాద మరిచాను సార్. యిప్పుడే తెచ్చిస్తా" తల గోక్కుంటూ అన్నాడు రామసామి.

"అలాగే ఓడోనిల్ కూడా రెండు తెచ్చివ్వు. నిన్ననే కొన్నట్టున్నారు డీ.ఎమ్. కోసం" మరో యిండెంటు పడిందతనికి!



"సార్, సార్, అయ్యగారికి అయ్యన్నీ లెక్కే సార్. తక్కువైతే మాటొస్తది" గాభరాగా అన్నాడు రామసామి.

"జారి నీట్లో పడిపోయాయని చెప్పవోయ్ శుంఠా" వుపాయం కూడా తనే చెపుతూ కుర్చీలోంచి లేచాడు సిగరాజు.

ఆ రోజుకి రెండు అవసరాలు తీరాయి సిగరాజుకి.

* * *

ఆఫీసులో అందరూ దీక్షగా పనిలో మునిగిపోయివున్నారు. సిగరాజు తలెత్తి చూశాడు గోవర్ధనం వంక. "ఔనోయి గోవర్ధనం, మీ యింటికి రంగులేయిస్తున్నావేమిటోయ్! పొద్దుట ఆఫీసు కొస్తూ చూశాను"

"ఔన్సార్, నాలుగు సంవత్సరాలకు తీరింది, అనుకున్నపని" రంగులేశాక మెరిసే యిల్లు కళ్లలో మెదిలి హుషారుగా అన్నాడు గోవర్ధనం.

అందరూ ఆ ప్రశ్న విన్నారు గాని, యిండెంటు పెట్టేందుకు ఏవిధంగానూ సంబంధంలేని టావిక్కని అనిపించి తలలెత్తకుండా ఎవరివని వాళ్లు చేసేసుకుంటున్నారు. కానీ, సిగరాజు గొంతు వెంటనే వినిపించటంతో అందరూ ఆశ్చర్యంగా చూశారతని వంక.

"నాలుగు రంగులూ కాగితం మీద రాసి నీకిస్తాను, అట్టిపెట్టుకో. ఆ నాలుగూ ఒక్కోటీ పావులీటరు కావాలోయ్. మిగిల్చి యిస్తావో, మిగిలితే యిస్తావో నాకు తెలీదు. రేపు ఎల్లుండ్లో పట్రా" అన్నాడు సిగరాజు గడగడా.

"అలాగే..".."సార్' అన్న చివరిపదం మింగిన గుటకల్తో పాటు గొంతులోకి దిగిపోయింది గోవర్ధనానికి. కళ్లుపెద్దవి చేసి, కనుబొమ్మ లెగరేస్తూ ఒకళ్ల నొకళ్లు చూసుకున్నారు మిగిలిన స్టాఫంతా.

* * *

ఎవరికీ కనిపించకుండా ఆరోజు మధ్యాహ్నం అందరి నెత్తినా తిరుగాడుతున్న 'గ్రహాలు' సిగరాజుకి అనుకూలించి, గుప్తాకి ప్రతికూలించటం వల్ల అతను అనుకోని ఆపదలో పడిపోయాడా రోజు.

"నిన్న పొద్దుట లేచి ఎవడి ముఖం చూశానో గుర్తులేదుకాని, మూడు వందల యిరవై రూపాయలు ఫ్రీగా వచ్చి పడ్డాయి" క్యాంటిన్‌లో నుంచుని టీతాగుతూ చాలా హుషారుగా చెప్తున్నాడు గుప్తా, పక్కనున్న పద్మరాజుతో.

"దొరికాయా?'

"దొరకటంకాదు. యింట్లో నల్లగుడ్డ గొడుగులు మూడుండగా, పువ్వుల గొడుగు కొనమని మా అమ్మాయి గొడవచేస్తే షాపుకెళ్లాం. ఎనభై రూపాయలు చెప్పాడు షాపుతను. నేను వంద నోటిస్తే నాలుగొందల యిరవై తిరిగిచ్చాడు".

"అదెలా ?"

"నా ముందు ఒకాయన అయిదొందల నోటిచ్చాడు కౌంటర్‌లో, నేను వందిచ్చాను. అయిదొందల నోటు యిచ్చినాయన మరొక అయిటం ధర అడుగుతున్నాడు. ఒకేసారి రెండునోట్లూ అందుకున్న షాపతను కన్ఫ్యూజ య్యాడు. నాకు నాలుగొందల యిరవై యిచ్చేశాడు. బయటకు పరిగెట్టుకొచ్చి, మధ్య తరగతి మనిషికి దేవుడిచ్చిన ప్రసాదం అనుకుని కళ్లద్దుకుని జేబులో పెట్టుకున్నాను" అన్నాడతను.

అంతావిని పద్మరాజు ఏదో అనబోతుండగా వాళ్లిద్దరి వెనక నించి సిగరాజు గొంతు వినపడింది. "అయితే గుప్తా, ఆ మూడు గొడుగుల్లో మొదటిది ఏ సంవత్సరంలో కొన్నావ్?"

"అదాసార్, ఓ మూడేళ్లు...,అంటే.. తొంభై తొమ్మిదిలో కొనుంటాను సార్".

"రేప్పొద్దున వచ్చేటప్పుడు ఆ తొంభై తొమ్మిదిలో కొన్న గొడుగు పట్రా. వాడుకుని ఎండలు, వానలు తగ్గాక తిరిగిచ్చేస్తా" సమాధానం కూడా విననట్టుగా అక్కడి నుండి నడిచెళ్లిపోయాడు సిగరాజు.

"ఈ రోజు పొద్దుట ఎవరి ముఖం చూశావో గుర్తుందా?" నవ్వుతూ అడిగాడు పద్మరాజు, ఏడుపు ముఖం పెట్టిన గుప్తాని.

"అదిసరే, ఎండలు వానలు తగ్గాక గొడుగు తిరిగిస్తానంటాడేవిటి బాసు?" అడిగాడు గుప్తా.

"అర్థం కాలేదా? ఎండలు, వానలు

ఆగిపోయేదెప్పుడూ? ఈ యుగాంతానికి! అప్పటి వరకూ ఆయన నీ గొడుగు వాడుకుంటా నంటున్నాడు" పకపకమని నవ్వుతూ బయలు దేరాడు పద్మరాజు.

* * *

"ఏమిటయ్యా శివకామేశ్వర్రావ్ యివాళ ఫైలుమీద అక్షరాలు ఏమిటిలా వంకర్లు టింకర్లుగా రాశావ్ ?" అడిగాడు సిగరాజు.

"యిటు చూడండి సార్... యిందుకు" అంటూ వెనక దాచుకున్న కుడి చేతిని ముందుకు తీసి చూపించాడు శివకామేశ్వర్రావ్.

"అరె, చిటికెనవేలు బొటనవేలంత లావయ్యింది.. ఏమయ్యిందేవిటి?" అడిగాడు సిగరాజు.

"నిన్న సాయంత్రం పరుపు కోసం యింట్లో అటకెక్కాను సార్, "

"ఎక్కితే ?!" "పరుపు లాగుతుంటే క్యారం బోర్డు మీదపడి వేలు చితికింది సార్"

వెంటనే మాట్లాడలేదు సిగరాజు. అతని కంప్యూటర్ బుర్రలో రెండు బల్బులు ఆన్, ఆఫ్ అయ్యాయి. వెంటనే అడిగాడు -




"క్యారం బోర్డు అటక మీద ఎందుకుంది? మీ పిల్లలు ఆడరా?"

ఆ ప్రశ్నలోని పాయింటు శివకామేశ్వర్రావ్‌కి అర్థం అయి కంగారుపడినా స్మార్ట్‌గా ఆలోచించి అన్నాడు- "పిల్లలు పెద్దాళ్లైపోయారు సార్. అంతే కాక దానికి కాయిన్స్ లేవు, తలో దిక్కునా పడిపోయాయి. వుత్త బోర్డు ఎందుకూ పనికిరాదు కద్సార్".

సన్నగా నవ్వాడు సిగరాజు. "ఒకాయన బోర్డు విరిగిపోయిందని కాయిన్స్ నాకిచ్చేస్తే జాగ్రత్త పెట్టా. అంచేత ఓ పన్జెయ్యి. సాయంత్రం యింటికెళ్లగానే, క్యారం బోర్డు దింపి, దులిపి, శుభ్రంగా గుడ్డపెట్టి తుడిచి మా యింటికి పంపించు. పిల్లలు ఆడుకుని సరదా తీరాక పంపించేస్తా" అన్నాడు.

వెనక్కి తిరుగుతూ 'ఎంతటి ఘటికుడివయ్యా మహానుభావా' అనుకున్నాడు శివకామేశ్వర్రావ్ మనసులో.

ఆరోజుకు సిగరాజు యిండెంటు ఖాతా క్లోజయ్యింది.

* * *




యిద్దరు కలిసి మోసుకొస్తున్న ఆక్వేరియం తొట్టెను గుమ్మంలో చూస్తూనే లేచి గబగబా ఎదురెళ్లాడు సిగరాజు. జాగ్రత్తగా మూలనున్న బల్లమీద పెట్టించి ఆఫీసులో అందరి వంకా గర్వంగా చూశాడతను. "బాగుంది కదోయ్ గాజు తొట్టె".

"బ్రహ్మాండంగా వుంది సార్, ఎంతక్కొన్నారు?" కొన్నది కాదని తెలిసే అడిగాడు విశ్వం, 'దాత' పేరు తెలుసుకుందామని.

"కొందామనే అనుకున్నానోయ్. కానీ మన డీ.ఎమ్. గారు కొనొద్దన్నారు" అన్నాడు సిగరాజు.

"అసలేం జరిగింది చెప్పండి సార్" మళ్లీ అడిగాడు విశ్వం.

"మొన్న సాయంత్రం ఫైల్సు మీద సంతకాలకని డీ.ఎమ్.గారి యింటికెళ్ళాను. అప్పుడు చూశాను హాల్లో దక్షిణం మూలపెట్టివున్న ఈ అక్వేరియంని! 'ఆ దిశ తప్పుసార్, వాస్తు ప్రకారం అది వుత్తరంవేపు వుండాల'ని చెప్పాను. కానీ వుత్తరం గోడంతా పెద్ద షెల్ఫ్ వుంది. ఆ క్షణంలోనే చెప్పాను మా యింట్లో వుత్తరం దిశ ఖాళీగా వుందని. ఆక్వేరియం కొనాలని చూస్తున్నానని. అందుకు...యిదిగో.. యిదీ యిలా మొహమాట పెట్టేశారు నన్ను డీఎమ్.గారు" అన్నాడు సిగరాజు కథ ముగిస్తూ.

ఆ క్షణంలో అతని కళ్లకి చుట్టూ వున్న స్టాఫంతా తలలూపుతున్న గొర్రెల్లా కనిపించారు.

* * *

సిగరాజు ఆరోజు లీవుపెట్టాడని తెలిసి అందరూ కలిసి ఓపథకం రచించారు. డీఎమ్ సంతకం కోసం అన్నట్టు ఒక్కొక్కరూ ఒక్కొక్కఫైలు పట్టుకుని ఒకరి తర్వాత మరొకరుగా ఆయన గదిలో చేరారు. అందర్నీ చూసిన డీ.ఎమ్ గారికి విషయం ఏదో వుందని అర్థం అయింది.

ఒకరు పల్లవి, ఒకరు చరణం చొప్పున వలుకుతూ కథనంతా వినిపించారు. వంతులవారీగా పడుతున్న యిండెంట్ల గురించి చెప్పుకున్నారు. అదే అదనుగా లెక్క తక్కువయిన ఓడోనిల్ ప్యాకెట్ల గురించి కూడా ఆయన చెవిలో వూదేశాడు రామస్వామి. అంతా విన్నాక అందరికీ కలిపి ఓ చక్కటి వుపాయం చెప్పి వదిలారు డీ.ఎమ్‌గారు.

మర్నాటి పొద్దుటనించే అమలులోకి వచ్చేసింది ఆ వుపాయం.

శంకరం పాలిథీన్ కవరొకటి తెచ్చి, సిగరాజుకి నమస్కారం పెడుతూ ఆయన బల్ల మీద పెట్టాడు.

"యిదేమిటీ? " అడిగాడు సిగరాజు.

"మా పాప నైన్త్‌లోకి వచ్చింది సార్. దానివి ఎయిత్ క్లాసు టెక్స్‌స్టు పుస్తకాలు"

"యివెందుకోయ్, అడక్కుండానే తెచ్చావ్?" ఆనందంతో ఆప్యాయంగా సంచిని పట్టుకు నిమురుతూ అడిగాడు సిగరాజు.

"వుంచండిసార్,నాకెలాను పనికిరావివి" అంటూ తన సీట్లో కెళ్ళిపోయాడు శంకరం.

అతనన్న ఆ ఆఖరిమాట సిగరాజుకు కొంచెం బాధగా అనిపించినా, పుస్తకాలు ఫ్రీగా వచ్చి పడ్డా యన్న తృప్తి ఆ బాధని కప్పేసింది.

సిగరాజుకు అడక్కుండానే నైవేద్యం పెట్టే వంతు ఆరోజు విశ్వానిది. ఆ రోజుకు దీపావళి పండుగవచ్చి వెళ్లి రెండు రోజులయింది.

'అన్నిపెట్టెల్లో సగం సగమే మిగిలాయి సార్, ఎందులోనూ నిండుగా లేవు" అంటూ పాలిథీన్ సంచి మూతి విప్పి చూపించాడు విశ్వం. అది సన్మానమో, అవమానమో తేల్చుకోలేక పోయాడు సిగరాజు. అన్ని పెట్టెల్లోనూ రెండు కాకరవత్తులు, ఒక పాము బిళ్ల, ఆరు అగ్గిపుల్లలు యిలా... ముష్టివాడికి వేసినట్టుంది!

సదరు పథకాన్ని అందరికంటే పరమ కంగారుగా అమలు పరిచాడు జగన్నాథం. అతని వంతు వచ్చిన రోజున పొద్దుటే సిగరాజు బల్ల దగ్గర జేరి సంచిలోంచి ఒక అట్టపెట్టె తీశాడు. పెట్టెమీద రెడ్ క్రాస్ గుర్తువుంది. చూడగానే హాస్పిటల్ సామాన్లని అర్థం అయింది. మూతతీసి ఒక్కొక్కటి చూపించి మొదలెట్టాడు - "సార్ యిది కాటన్ బండిల్, కొత్తది! డెట్టాల్ బాటిల్, ఒక్కసారే వాడింది. యివి క్రోసిన్ మాత్రలు. యిది కాఫ్‌సిరప్, యింకా సగం మిగిలుంది. యివి డిస్పోజబుల్ సిరంజ్‌లు కాని యివి ఆఖరికి అయిదే మిగిలాయి సార్" అంటూ మూత మూసి, పెట్టెను సిగరాజు ముందుకి తోశాడు.

"మిగిలాయంటున్నావ్ యింతకీ ఎవరు వాడారివి?" ఏదో అపశకునపు అనుమానం మనసును పీకేస్తుండగా అడిగాడు సిగరాజు.

"మా అత్తగారు".

"మరి ఆవిడనే వాడుకోమను"

"వాడినంతకాలం వాడింది సార్. యికపై మీలాంటి వారు వాడుకుంటే ఆవిడ ఆత్మకి తృప్తి కలుగుతుంది" అన్నారు జగన్నాథం.

"ఆత్మ తృప్తేమిటి? బ్రతికి లేరా?"

"రోగంతో మంచాన పడ్డారు ఆరునెలలు. పోయి నెలయిందిసార్" అన్నాడతను విచారంగా.

"జగన్నాథం, యిదేమయినా బాగుందయ్యా నీకు?" సగం కోసం,సగం వుక్రోషం కలిపి గొంతు పట్టేస్తుండగా అన్నాడు సిగరాజు.

"చచ్చిపోయినావిడ వాడినవి. మా యింట్లో ఎవరూ వాడరూ, ఎలాగూ బయట పారేసేవే. అందుకే తెచ్చి మీకిచ్చాను " చెప్పి, ఒక్కక్షణం ఆగి తన సీట్లోకి వెళ్లిపోయాడు జగన్నాథం, విలాసంగా స్కూటరు తాళాలు వేలుకి చుట్టి ఊపుకుంటూ.

'నా బలహీనత కనిపెట్టేశాక, ఎంత బలం వచ్చింది వీళ్లకి' వంచిన తల ఎత్తకుండానే లోలోపల మండిపడ్డాడు సిగరాజు.

ఆరోజు రాత్రి నిద్ర పట్టలేదు సిగరాజుకి. ఆఫీసులో అందరి చేష్టలు శృతిమించి రాగాన పడుతున్నాయి. డీ.ఎమ్.తో చెప్పి ఒక్కొకళ్ల తోకలూ కోయించాలనుకున్నాడు.

మర్నాడు అడుగుపెడుతూనే సీట్లో కూర్చోకుండా డీఎమ్ గారి రూములో కెళ్లాడు సిగరాజు. అతను వెళ్లిన రెండు నిమిషాలకు ఆ రూమ్‌లోకి యితరులెవ్వరూ రాకూడదని సంకేతం యిచ్చే ఎర్రబల్బు వెలిగింది.

దాదాపు నలభైనిమిషాల తరువాత బయట కొచ్చాడు సిగరాజు. భగవద్గీతను ప్రతిపదార్థ తాత్పర్యాలతో సహా ఔపోసన పట్టేసిన వైరాగ్యం అతని కళ్ళలో కనిపిస్తోంది.

వేదాంతసారాన్ని మథించి మనసులో యిముడ్చుకున్నట్టు ముఖం ప్రశాంతంగా మారి పోయింది. ఏసుక్రీస్తు తన అనుచరులవేపు నిర్మలంగా చూస్తూన్నట్టు స్టాఫందరి వేపూ అరమోడ్పు కళ్లతో చూస్తూ వెళ్లి తన సీట్లో కూర్చున్నాడు సిగరాజు.

"సార్ ఒకసారి మీరడిగారు చూడండి" అంటూ చేతిలో సంచితో సీట్లో నుంచి లేవబోతున్న శర్మని, 'వద్దు' కూర్చో' అంటూ సౌంజ్ఞ చేసి వారించి కూర్చోబెట్టాడు సిగరాజు.

అరగంట గడిచింది, గంట గడిచింది, పూట గడిచింది.. అయినా సిగరాజు నుండి ఒక్క యిండెంటు రాలేదు. మౌనంగా ప్రశాంతంగా కూర్చుని పని చేసుకుపోతున్న సిగరాజుని చూసి ఆశ్చర్యపోయారందరూ. అయిదవ్వగానే తలవంచుకుని బయటకెళ్లి పోయాడు సిగరాజు.

ఆ తరువాత సదరు అవలక్షణం తొలగి పోయిన సిగరాజు మచ్చ మాసిపోయిన చంద్రుడిలా, అందరికీ ఆప్తుడిగా మారిపోయాడు. ●

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటీ జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

16

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

గత సంచికలో పౌరాణికాల వైపు నుండి కృష్ణతులాభారం కవర్ చేశాము. నేను చేసిన పౌరాణికాల్లో మంచిసంగీతం గలవి, భక్తిరస ప్రధానమైనవి .... 'నాగులచవితి', 'సతీఅనసూయ'.... ఇలా చాలా ఉన్నాయి. వీటిలో శివభక్తి మీద బాగా తీసింది 'ఉషా పరిణయం'. దర్శకుడు కడారు నాగభూషణం గారు... కన్నాంబ గారి భర్త... రాజరాజేశ్వరి బ్యానర్ మీద తీశారు. అప్పటికే నేను ఆ బ్యానర్‌లో ఇంకో సినిమా కూడా చేశాను. 'ధర్మమేజయం' నా మొదటి సినిమా ఆ బ్యానర్‌లో. 'ఉషాపరిణయం' రెండోది. ఇందులో కాంతారావు గారు హీరో.

'ఉషాపరిణయం' ఇంచుమించు శశిరేఖాపరిణయం లాగానే ఉంటుంది. ఉషని అనిరుద్ధుడు పెళ్లి చేసుకోవడం అనేది మెయిన్ సబ్జెక్ట్. ఇందులో పాటలు కూడా నాకు బాగా నచ్చాయి. సాలూరి హనుమంతరావు గారు మ్యూజిక్. ఇందులో నాకు ఎక్కువగా క్లాసికల్ డ్యాన్స్ పాటలు పెట్టారు.

ఈ సినిమాలోని పాటల్లో నాకు బాగా నచ్చింది... 'న్యాయమిదేనా చందురుడా...' అనే పాట. ఈ విరహ గీతంలో కొన్ని పదాలున్నాయి... 'అల్లన గురునతిని అంటిన ద్రోహివి... త్రుళ్లెదవెందుకు తుంటరి' అని తిడుతుంది. అంటే విరహంతో ఉన్న కన్యను ఆ వెన్నెల మరీ రెచ్చగొడుతోందన్నమాట. అంచేత చందురుణ్ణి నిందిస్తూ పాడుతుంది.

ఆ రకంగా - 'వెన్నెల మంటల వేగించకురా నీ వన్నె తరగిపోనూ... ఎందుకు ఇలా వేధిస్తున్నావ్?' అని తిడుతూ అందులో ఆఖర్న 'ధూర్తుడా' అన్న పదం ఒకటి ఉపయోగించారు. అది నిజంగా ఎంత గొప్ప ఎక్స్‌ప్రెషన్ అంటే.. ఇప్పుడున్న జనరేషన్‌కు అసలు ధూర్తుడా అన్న పదానికి మీనింగ్ తెలుసా అని. ధూర్తుడా అని తిట్టడం .. చాలా గొప్ప థాట్. సుశీల కూడా చాలా బాగా పాడింది.

ఆ చిత్రంలో ఫొటోగ్రఫీ కూడా చాలా బావుంటుంది. నేను చాలా అందంగా కనబడతాను. నేను అన్ని పిక్చర్స్‌లో సన్నగానే కనిపిస్తాను. కానీ ఈ సినిమాలో ఆ డ్రస్సుల మూలంగా లావుగా, చబ్బీగా, ముద్దుగా...

**చిత్రం : ఉషాపరిణయం     సంగీతం: సాలూరి హనుమంతరావు     గానం : సుశీల**

న్యాయమిదేనా -చందురుడా!
న్యాయమిదేనా -చందురుడా!
అసహాయను నను - అలయింతువురా ॥న్యాయ॥
వెన్నెల వెదజల్లి - విరహిణులా!
వెన్నెల వెదజల్లి - విరహిణులా!
నిటు వేధింతువు - పగ సాధింతువు నీ ॥న్యాయ॥
పాల కడలికీ పాపాయివికద -జాలీ, కరుణ లేదా
పాల కడలికీ పాపాయివికద -జాలీ, కరుణ లేదా
చాలు చాలు నా జోలికి రాకుర - ఎందుకు నాతో వాదా నీ ॥న్యాయ॥
అల్లన గురుసతినంటిన ద్రోహివి -త్రుళ్ళెద వెందుకు తుంటరీ
చల్లని రాజన చెల్లదు నిన్ను - జాబిల్లీ ఓ మాయలమల్లీ ॥న్యాయ॥
వెన్నెల మంటల వేగించకురా - నీ వన్నె తరిగిపోనూ
కన్నుగానవా రాహువువేగ - కబళించును నీ మేను ధూర్తుడా!
పో పో తొందరగాను ॥న్యాయ॥





బుగ్గలు బాగా వచ్చినట్టు కనిపిస్తాను. దీంట్లో ఇంకొక పాట మాయా ఉషగా వస్తుంది. ఉష ఫ్రెండు (సూర్యకళ నటించిందా పాత్ర) రేలంగిని ఉషగా మారుస్తుంది... తన ఫ్రెండ్ రేలంగిని అలా మార్చినప్పుడు చాలా అద్భుతమైన పెర్ఫార్మెన్స్.

ఈ సినిమాలో రేలంగి గారికి కొన్ని మేనరిజమ్స్ ఉంటాయి. వేళ్లు కొట్టుకోవడం, చేతులు ఊపటం... అవన్నీ స్టడీ చేసి.. ఆయన్నుంచి నేను ఉషగా మారటం వల్ల మళ్లీ అదే యాక్షన్ కంటిన్యూ చేసేదాన్ని. ఆ సినిమాలో నేను చాలాసార్లు మాయా ఉషగా కనిపిస్తాను. కొన్ని చోట్ల నేనేమో మాయాఉష... మాటేమో రేలంగి గారి వాయిస్. డబ్బింగ్‌లో....! అదొక మంచి వెరైటీ క్యారెక్టర్.

అలాగే ఈ సినిమాలో ఉషని తన బావను పెళ్లి చేసుకోమని బలవంతంగా పంపిస్తారు. అక్కడ ఆ బావను ఏడిపిస్తూ పాడుతుంది. 'నిన్నే వలచితినోయ్ ఓ బావా' అని జమునారాణి గారు చాలా అద్భుతంగా పాడారు. అందులో సాహిత్యం. 'ముద్దరాలని ముద్దుగ వస్తే..' అని చెప్పేసి ఉంటుంది. మాయా ఉషగా నటించడానికి ఎక్కువ స్కోప్ ఉన్నపాట ఇది.

ఈ సినిమాలో ముఖ్యంగా చెప్పుకోవల్సింది క్లాసికల్ డ్యాన్సులు. పసుమర్తి కృష్ణమూర్తి గారు చాలా గొప్పగా చేయించారు. ఆయన అంటే హైలెట్ క్లాసికల్ డాన్సులే కదా. అసలు డ్యాన్సేరాని నాచేత అంత గొప్పగా భరతనాట్యం చేయించారంటే అది ఆయన గొప్పతనం. ఇటీవలనే ఆయన పోయారట.

**చిత్రం: ఉషాపరిణయం**

**సంగీతం: సాలూరి హనుమంతరావు గానం : ఘంటసాల, లీల**

అనిరుద్ధుడు :మన ప్రేమగాధా అమరకథ
మన ప్రేమగాధా అమరకథ
అనుపమమై మించి అలరారుకాదా
అనుపమమై మించి అలరారుకాదా ॥మన॥
ఉష : ఫలియించె నానోము కలనిజమాయె
ఫలియించె నానోము కలనిజమాయె
పొలుమారు నా ప్రేమ
ఎంత వింత ఓ మనోహర ॥మన॥
అనిరుద్ధుడు :మన అనురాగాలు మధుర వినోదాలు
మన అనురాగాలు మధుర వినోదాలు
చిగిరించి పుష్పించె
ఈ విధాన ఓ మనోహరి ॥మన॥
పరవశమై ప్రేమగానంబు చేసీ
తేలుదమానందవారాశీ
ఉష : పదముల మువ్వలు
కదలి ఘల్లుమన
ముదమున నాట్యమొనర్చెదనే
మదనుడలరి విరివానగురియగా ॥మన॥













ఈ సినిమాలో డ్యూయెట్‌లు ఓ మూడు నాలుగున్నా క్లాసికల్ డ్యాన్స్ చెయ్యడానికి ఎక్కువ స్కోప్ ఉండి మంచి క్లాసిక్‌గా ఉన్న పాట 'మన ప్రేమగాధా అమరకథ' అనే పాట.

ఈ సినిమా షూటింగ్ సమయంలో ఓ చిన్న సంఘటన జరిగింది. పౌరాణికం అంటేనే ఈ గంతా, బొంతా, డ్రస్సులు, హెయిర్ డ్రస్సులు... ఇవన్నీ తగిలించుకుని వెళ్లేటప్పటికే రోజూ పదిన్నర అయ్యేది. బిగినింగ్‌లో ఇలా నాలుగైదు రోజులు జరిగింది. 5, 6 రోజులు తర్వాత నాగభూషణం గారు అప్‌సెట్ అయిపోయారు. ఆయనే డైరెక్షన్ కదా. ఓ రోజు పన్నెండున్నర అయింది. అందులో సెట్‌లో అందరూ ఉన్నారు. నేనేం చేయను... హెవీ హెయిర్ డ్రస్సింగ్... నా తప్పు కాదు. సరే వెళ్లాను.

అప్పట్లో హెయిర్ డ్రెస్సింగ్ అంతా జోసఫిన్ అనే ఆవిడ చేసేది. వెళ్లేటప్పటికి ఆయన అందరి ముందు కొంచెం కఠినంగా "ఏమ్మా... ఏంటిది...? పన్నెండున్నర... షూటింగ్ చేయమంటారా... ప్యాకప్ చేయమంటారా? ఏంటీ రావడం" అన్నారు. అందరి ముందూ ఆయన అలా అరిచేటప్పటికి నాకు చాలా పౌరుషం వచ్చింది.

వెంటనే రిటార్ట్ చేశాను. 'ఏవండీ రోజూ పదిన్నర, పదకొండు వరకూ హెయిర్ డ్రస్సర్ రావట్లేదు... మీరు నా తప్పు అయినట్టు మాట్లాడుతున్నారేంటి... నేను ఆరుగంటలకే వచ్చి మేకప్ వేసుకుంటున్నాను. మరి మీ వాళ్లు మీ హెయిర్ డ్రెస్సర్‌ను పదకొండున్నర, పన్నెండు గంటలకు తీసుకువస్తే నేనేం చేయను? ఆవిడెమో ఈ హెయిర్‌ను రోలర్స్‌లా చుట్టి, దానికి స్ప్రే చేసి, బ్లోయర్ వేసి .... ఆరిన తర్వాత లాగితే రింగులుగా



**చిత్రం: ఉషాపరిణయం**
**సంగీతం: సాలూరి హనుమంతరావు**
**గానం : జమునారాణి**

నిన్నేవలచితినోయ్ ఓ బావా
నిన్నే పిలిచితినోయ్ ॥నిన్నే॥
నే చిన్ననాటనే నా మనంబున
నీ అందాలే నిలిపితినోయీ ॥నిన్నే॥
ముద్దరాల నీవద్దకు చేరి
ముద్దుముద్దుగా ముందుకువస్తే
ముద్దు ముద్దు ముద్దు
ముద్దరాల నీ ముద్దారాల నీ
ముద్దరాల నీవద్దకు చేరి
ముద్దుముద్దుగా ముందుకువస్తే
అద్దిరబావా అలాగ తిప్పేవు
అద్దములాంటి ముద్దుమోము దుర్
అద్దములాంటి ము ద్దు మో ము మరి
నిన్నేవలచితినోయ్ ఓ బావా
నిన్నే పిలిచితినోయ్
కూరిమితో నను చేరదీయక
దూర దూరముగ పోతావేమి
కూరిమితో నను చేరదీయక
దూర దూరముగ పోతావేమి
కోరికతీరగ కోలాటాలు
కోరికతీరగ కోలాటాలు
ఆడుదమా యిటు రారా బావా
నిన్నేవలచితినోయ్ ఓ బావా
నిన్నే పిలిచితినోయ్ ఓ బావా ఓ బావా ...










వస్తుంది. అది చాలా టైమ్ పట్టే హెయిర్‌డ్రెస్సింగ్. మీ హెయిర్ డ్రెస్సర్‌ను తొందరగా తీసుకురండి. నాదేం లేటులేదు" అని కొంచెం గట్టిగానే మాట్లాడాను.

నేను సామాన్యంగా ఆరున్నర, ఏడు గంటలకల్లా మేకప్ వేసుకుని రెడీ అయి కూర్చుంటాను. సోషల్ అయితే వితిన్ ఒన్ అవర్ లో రెడీ అయిపోతాను. పౌరాణికం అయితే మరికొంచెం టైమ్ పడుతుంది. జోసఫిన్... ఒక్కతే ఉండేది ఆ రోజుల్లో...! ఆవిడ గురించి గంటలు గంటలు వెయిట్ చేయవలసి వచ్చేది. ఒక్కోసారి షూటింగ్ కూడా పోస్ట్ పోన్ చేసుకునేవాళ్లు. ఆవిడ అంత బిజీ! అందరికీ ఆవిడే కావాలి. పైగా పదిమంది పైనే ఉన్నారు హీరోయిన్లు... అంజలీగారు, భానుమతి గారు, సావిత్రి... వీళ్లందరికీ చేసి వచ్చేది.

నిజంగా జీవితంలో నేనెప్పుడూ డ్రామాలా చేయలేదు కానీ... ఆయనకు వాస్తవం తెలియటం కోసం నెక్స్ట్ డే ఏం చేశానంటే.. డ్రస్ చేసేసుకుని, నగలు వేసేసుకుని మొత్తం అంతా రెడీ అయిపోయాను. అయితే హెయిర్ డ్రస్సింగ్ కాకుండా తలమీద పెట్టుకునే ఆభరణాలు లేకుండా జుట్టు విరబోసుకుని అలాగే షూటింగ్ స్పాట్‌కు వెళ్లిపోయాను.

అంతే... నాగభూషణంగారు చూశారు... 'ఏమ్మా హెయిర్ డ్రస్సర్ ఏదీ... ఇంకా రాలేదా...'అన్నారు.

"లేదండీ... జోసెఫిన్ ఇంకా రాలేదు. బోరుగా ఉందని ఇక్కడకు వచ్చి కూర్చున్నాను' అన్నాను. అప్పటికి 10 అవుతోంది. ఇక చూడండి.. నేను కూర్చున్నంత సేపు ఆయన పడ్డ టెన్షన్ ఇంతా అంతా కాదు. నిమిషనిముషానికి ఆ ప్రొడక్షన్ బాయ్స్‌ని, మేనేజర్స్‌ని పిలవటం, 'జోసఫిన్ ఇంకా రాలేదా ఇంకా రాలేదా...' అని అడగటం.

ఆయన మాత్రం ఏం చేస్తారు, దాదాపు గంటన్నర కూర్చున్నాను.. ఆయనింక భరించలేక 'అమ్మా నువ్వు చేసుకోలేవా..'అన్నారు. 'సరేలెండి... నేనెక్కడ చేసుకోగలను. ఇదేమన్నా సోషల్ పిక్చరా... రెండు జళ్లు వేసుకురావటానికి, పౌరాణికం..' అని నవ్వేసి కూర్చున్నాను. కాస్సేపటికి ఆయనకు పూర్తిగా అర్థం అయింది. అయ్యో అనవసరంగా చిన్న పిల్లను కోప్పడ్డాను.. అనుకుని 'అమ్మా రేపు కొంచెం ఎర్లీగా వస్తారా' అన్నారు.

'సార్ నేను ఎర్లీగానే వస్తున్నాను... గంటా, గంటన్నరలో నా మేకప్, డ్రెస్సింగ్ అయిపోతుంది. టిఫిన్ కూడా తినేసి రెడీగా ఉంటాను. నాకు లేట్ అయ్యేదల్లా హెయిర్ డ్రెస్సింగ్ ఒక్కటే. పోనీ ఇంకెవరైనా ఉంటే పిలిపించండి నాకేమీ అభ్యంతరం లేదు' అని చెప్పా. ఆ తరువాత నుండి ఆ పిక్చర్ అయ్యేంత వరకూ ఎన్ని గంటలకు వచ్చినా మాట్లాడేవారు కాదు.

ఇలాగే ఎం.జి.రామచంద్రన్‌తో ఓ తమిళ్ పిక్చర్... అది ఆయనతో రెండో పిక్చర్. అంతకుముందు 'తాయిమగళ్ కట్టియత్తాళి'

అని సోషల్ పిక్చర్. తరువాతిది ఈ జానపదం. షూటింగ్ మూడు రోజులే జరిగింది. తరువాత పిక్చరే ఆగిపోయింది. దానికి హెయిర్ డ్రెస్సింగ్ కూడా ఈ జోసెఫినే. హెయిర్ డ్రెస్సింగ్ అయి జానపద డ్రస్సులు వేసుకుని సెట్లోకి వెళ్లేటప్పటికి పదకొండు అయ్యింది. దాంతో ఎం.జి.ఆర్.కి కోపం వచ్చి 'ఎన్నా ఇప్పడియా వర్రదు..'(ఇంత లేటా) అదీ ఇదీ అన్నారు. నాకు కోపం వచ్చి 'నీంగ యార్ పేసరతుకు' (మీరెవరు నన్ను అడగటానికి) అన్నాను. అందరూ స్టన్ అయిపోయారు. "ఏంటిరా ఇది... ఈవిడ ఇలా మాట్లాడుతుంది" అని. పక్కన ప్రొడక్షన్ అతను ఉండి.. 'అది కాదు సార్... ఇలా హెయిర్ డ్రెస్సింగ్ వల్ల ప్రాబ్లెమ్' అని చెప్పారు.

ఇది ఎందుకు చెబ్తున్నానంటే నాకు బాధ్యత తెలుసు. ఏవీయం కానీ, విజయా కానీ, రామానాయుడు గారి పిక్చర్లు కానీ... ఇలా నేను ఏ బ్యానర్‌లో చేసినా రెండు మూడు సినిమాలు కంటిన్యూగా చేస్తూనే ఉంటాను. నిజంగా నేను ట్రబుల్ పెట్టేదాన్నే అయితే నాకు మరోసారి అవకాశం రాదు కదా. ఎందుకంటున్నానంటే.. నేను చేయని తప్పుకి నన్ను ఎవరైనా పాయింట్ అవుట్ చేస్తే దాన్ని నేను వెంటనే ఖండిస్తాను. ప్రాక్టికల్‌గా ఇదీ అని చూపిస్తాను. నా జీవితంలో ఫస్ట్ టైమ్ అలా ప్రాక్టికల్‌గా చేసి చూపించాను.

ఇంకోటి చెప్పవలసింది ఏమిటంటే - ఈ 'ఉషాపరిణయం' పిక్చర్ నిన్న వేసుకుని చూస్తుంటే నాకు చాలా ఆనందం కలిగింది. అందులో నూరిబాబుగారు నారదుడు, రఘురామయ్య గారు కృష్ణుడు. చూస్తుంటే తన్మయత్వం కలిగింది. నిజంగా అలాంటి కళాకారులు, అద్భుతంగా పాడేటటువంటి వాళ్లను మనం మళ్లీ వింటామా, కంటామా అనిపించింది. అదొకటి నిజంగా అదృష్టం.

అలాగే ఎస్వీ రంగారావు గారు ఇందులో బాణాసురుడు. నా అదృష్టం ఏమిటంటే మహా గొప్ప నటుల మధ్య చిన్న వయసులోనే నేను యాక్ట్ చేయటం వల్ల అబ్జర్వేషన్ పెరిగింది నాకు. ఇప్పుడంటే యాక్టింగ్ స్కూల్సు వచ్చాయి. ఫండమెంటల్సన్నా వెళ్లి నేర్చుకుంటున్నారు. ఆ రోజుల్లో రంగారావుగారు, కన్నాంబలాంటి పెద్దపెద్దస్టార్సు యాక్ట్ చేస్తున్నప్పుడు సెట్‌లో నుండి బయటకు వెళ్లేదాన్ని కాదు.

ఓసారి జలుబు పట్టి చాలా రోజులు వదలలేదు. అప్పుడు డాక్టర్ రాజారావు గారు చెప్పారు..' వీలైనంత బయట కూర్చో అమ్మా... డస్ట్ ఎలర్జీఉంది నీకు' అని. అప్పట్నించీ బయట కూర్చునేదాన్ని.. కానీ... ఇలాంటి యాక్టర్లు ఉన్నప్పుడు డెఫినెట్‌గా వాళ్లను అబ్జర్వ్ చేస్తూ ఉండేదాన్ని. రంగారావుగారు, నూరిబాబుగారు, రఘురామయ్యగారు.. వీళ్లందరి మధ్య నేను యాక్ట్‌చేయటం నా అదృష్టం.

అప్పటికి ప్లేబాక్, డబ్బింగ్ వచ్చింది కనక పద్యాలు అవీ సెట్లో రికార్డు చేయలేదు.

ఈ మహానటీనటుల గురించి మాట్లాడుతున్నప్పుడు...ఒకటి చెప్పి తీరాలి. ప్రభుత్వం ఇచ్చే నంది అవార్డుల్ని మహానటీనటుల పేరన ఇస్తే బాగుంటుందని నా అభిప్రాయం. కానీ ఆ థాట్ వచ్చిన తర్వాత నాకేమనిపించిందంటే గవర్నమెంట్ ఇవ్వకపోయినా - సినిమా పరిశ్రమ ద్వారా మేమంతా పైకి వచ్చాం. మాకు అన్నం పెట్టింది ఈ పరిశ్రమ. మమ్మల్ని నటీనటులుగా దిద్దింది ఈ సినీ పరిశ్రమ కాబట్టి.. ఇప్పుడు వచ్చే నటీమణులకు జమున చారిటబుల్ ట్రస్ట్ పేరన నంది అవార్డ్సులో ఉత్తమనటికి గోల్డ్‌మెడల్ ఇస్తే బాగుంటుందన్న థాట్ వచ్చింది. రెండు సంవత్సరాల క్రితమే నంది అవార్డ్సు ఫంక్షన్‌లో ఎనౌన్స్ చేశాను. అది వాళ్లకి ఈ సంవత్సరం కుదరచ్చు అనుకుంటున్నాను. ఇది ఎందుకు ఇస్తున్నామంటే పాపం ఆ రోజుల్లో అంటే ఈ అవార్డులు అవీ లేవు... అంచేత ఏదైనా శాశ్వతంగా కొన్ని మంచి పనులు వారి పేరన చేద్దామన్న థాట్ ఆ తరం వాళ్లకి ఆ రోజుల్లో రాలేదేమో అనిపిస్తుంది. ఇప్పుడంటే పబ్లిసిటి వాల్యూ తెలిసి ఇప్పుడున్న వాళ్లు వారి పేరు నిలబడేటట్లు మంచి పనులు కూడా చేస్తున్నారు. అందుకని కొంత తెలుగు మాట్లాడే అమ్మాయికి ఇస్తే బాగుంటుందన్న అభిప్రాయం నాకు ఉంది. కానీ అది క్లాజ్‌గా నేను చెప్పలేదు. ఎందువల్లనంటే ఇప్పుడు ఉన్న ఆర్టిస్ట్‌ల్లో ఎక్కువ మంది నాన్ తెలుగు వాళ్లే కాబట్టి మనం దానికి చేసేదేమీ లేదు. కానీ నా పేరన శాశ్వతంగా నంది అవార్డుల్లో ఉత్తమనటి అవార్డు ఉంటే బావుంటుందని అనౌన్స్ చేశాను.

నేనూ నా పాటలు



శ్రీమతి జమునకు నచ్చిన మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో...

2004వ సం॥ నవంబరు 9వ తేదీ నుండి జరిగే (తిరుచానూర్‌లోని)
అలమేల్మంగ తాయార్ల బ్రహ్మోత్సవం సందర్భంగా ఈ సంకీర్తన...





# అన్నమయ్య పద భావ దర్శనమ్ 3



నిర్వహణ
జి.బాలకృష్ణప్రసాద్

సంపుటం-18; సంకీర్తనం
టి.టి.డి.వారి "వెంకటాద్రి వెన్నెల"
క్యాసెట్, సి.డి.లోనిది
సంగీత కూర్పు : శ్రీ నేదునూరి కృష్ణమూర్తి
గానం : జి.బాలకృష్ణప్రసాద్, యస్.పి.శైలజ
(టి.టి.డి.వారి "పలుకుతేనెల తల్లి" క్యాసెట్‌లో
ఎన్.సి.శ్రీదేవితో కూడా జి.బాలకృష్ణ ప్రసాద్
పాడటం జరిగింది.)

## పరమాత్ముడైన

పరమాత్ముడైన హరిపట్టపురాణివి నీవు
ధర మము విచారించ తగు నీకు అమ్మా ॥
కమలజు గన్న తల్లి కాముని గన్న తల్లి
అమరుల గన్న తల్లి ఆదిమలక్ష్మి!
విమలపు నీ పతికి విన్నపము జేసి మమ్ము
నెమకి ఏలితి దయ నీకే తగునమ్మా ॥
కామధేను తోబుట్టుగ కల్పకము తోబుట్టుగ
దోమటి చల్లనిచంద్రు తోబుట్టుగ
నీ మగని పంపునను నిజసిరు లిచ్చితివి
నేమపు వితరణము నీకే తగునమ్మా ॥
పాలజలధికన్యవు పద్మాసనివి నీవు
పాలఁ బండే వేంకటపతిదేవివి
ఏలిన ఇతని బంట్లకు ఇహపరాలిచ్చి, మా
పాలగలిగితివి సంబంధము మేలమ్మ! ॥

తాత్పర్యం :

1. ఓయమ్మా! అలమేలు మంగమ్మా! నీవు సాక్షాత్పరమాత్ముడైన శ్రీహరి యొక్క పట్టపురాణివి. ఈ లోకంలో మా బాగోగులను విచారించటానికి నీవే తగినదానవు.

2. నీవు సామాన్యురాలవు కావు. సకల చరాచర సృష్టికి కర్తయైన బ్రహ్మదేవునికే కన్నతల్లివి. అంతేనా! జీవసృష్టికి ఆధారమైన కామస్పందనలు కలిగించే మన్మథునికి కన్నతల్లివి. దేవతల కన్నతల్లివి. ఓ జగన్మాతా ! పావనమూర్తియైన నీ పతిదేవునికి విన్నవించి అతని అనుగ్రహపాత్రులను చేయటానికి గాను అర్హులను వెదకి ఏలిన దయాసామర్థ్యము నీకే తగును.

3.అమృతంకోసం క్షీరసాగరాన్ని చిలికినప్పుడు ఉద్భవించిన మహామహిమాన్వితములైన-కామధేనువు (కోరినవన్నీ ఈయగల దివ్యమైన గోవు)కి, కల్పకవృక్షం(కోరిన కోరికలు తీర్చే దేవలోకవృక్షం)కి, దేవతలకు ఆహారమైన అమృతకిరణుడు చల్లని చంద్రునికి తోడబుట్టినదానవు నీవు. వాటన్నిటికీ(వారందరికీ) ఆయా దివ్యశక్తులు నీ భర్తయైన శ్రీహరి ఆజ్ఞానుసారం నీ వనుగ్రహించినవే. విచక్షణతో కూడిన ఈ వితరణం (ప్రదాన గుణం) నీకు మాత్రమే తగునమ్మా!

4. నీవు పాల సముద్రుని కూతురవు. అమలమైన పద్మము ఆసనముగా గల దానవు. ఆ పాల సముద్రంలోనే పవళించే శ్రీవెంకటపతి (శ్రీమన్నారాయణుని) దేవేరివి. ఆ స్వామి భక్తి సామ్రాజ్యాన్ని ఏలిన శ్రీవారిదాసులకు ఇహపరములను ప్రసాదించి మాకు దక్కినదానవు.

నీకు మాకు గల ఈ సంబంధము ఎంతో గొప్పది (అది అట్లే కొనసాగుగాక అని భావం).

(శ్రీలక్ష్మి పురుషకారిణి. భక్తులను అనుగ్రహించమని తన పతియైన శ్రీహరికి బోధించి ఆ స్వామి ద్వారా ఆ దాసులను అనుగ్రహించగలిగిన శక్తి ఆమెకే వున్నది. అందుకే అన్నమయ్య ఆ సంబంధాన్ని గుర్తుచేస్తూ, ఆమె శక్తిని సంస్తుతి జేస్తున్నాడు ఈ పాటలో.)

**ధర = భూమి (ధరన్ = భూలోకమునందు అని ఈ పాటలో గ్రహించాలి)**
**కమలజు = పద్మము నుండి పుట్టిన బ్రహ్మదేవుని**
**కాముని = మన్మథుని**
**అమరుల = దేవతలను**
**విమలపు = ఏ లోపమూ, మాలిన్యమూలేని స్వచ్ఛమైన**
**నెమకి = వెదకి; పరిశీలించి**
**నేమపు వితరణము = యోగ్యత, అయోగ్యతలను గుర్తించి సక్రమంగా చేసే దానము**
**పాలజలధి = పాల సముద్రము**
**పద్మాసని = పద్మము ఆసనముగా గల స్త్రీమూర్తి**
**పాలఁబండే = పాలలో (పాలసముద్రముపై) పడుకొనేటటువంటి**
**దోమటి = అన్నము**

"దోమటి" అన్న పదం పలు సందర్భాలలో అన్నమయ్య సంకీర్తనలలో కనిపిస్తుంది.

ఉదా॥ 1. దోమటి దొడుకు, 2. దోమటి రతులలో, 3. గొల్లదోమటి చేసిరి గొల్లెతలందరు, 4.దోమటి నింతెరగరా 5. దోమటి కర్మలు చేసి తుదకెక్కేవాడను గాను 6. మెఱసి మీ యిక్కువలు మించేను దోమటై - మొదలైనవి. పై సందర్భాలలో "అన్నము" అన్న అర్థం పొసగదు, పరిశీలించి చూస్తే- ఆనందం కలిగించేటట్లు; ఉల్లాసం కలిగించేటట్లు; సుఖమైన; విశిష్టమైన వంటి అర్థాలు ఆయా సందర్భాలలో అనుకూలంగా వున్నట్లు నాకనిపిస్తుంది.

## గాయకులకు (పాఠకులకు) సూచనలు

**'హరిపట్టపురాణి' అని కలిపి పాడటం శ్రేష్ఠం.**
**'విచారించ' అనే పదం 'విచారిన్చ' అన్నట్లు పలకాలి. అలాగే-**
**చంద్రు = చన్ద్రు ॥ పంపు = పమ్పు ॥ పండే = పణ్డే ॥**
**వేంకట = వేఙ్కట ॥ బంట్లకు = బణ్ట్లకు ॥ సంబంధము = సమ్బన్ధము**
**అని ధ్వనించేటట్లు పలకాలి.**

'అన్నమయ్య పదభావదర్శనమ్' పేరుని సూచించిన పదముగ్గురిలో బహుమతులు పొందబోయే వారి పేర్లు వచ్చే సంచికలో... మరొక మంచి కబురుతో...

**అప్త వాక్యం**



"బాలకిషన్ (మా ఇంట్లో అందరం అలాగే పిలుస్తుంటాం) వందలకొద్ది అన్నమాచార్య సంకీర్తనలను స్వరపరచడం, అవన్నీ బాగా ప్రచారం పొందడం నాకు చాలాచాలా ఆనందం కలిగించే విషయం. వాడు ట్యూన్ చేసిన అన్నమయ్య పాటలు ఎన్నో నేను పాడాను. ఎన్నో కచేరీలు, రికార్డింగ్‌లు కలిసి చేశాం. అన్నింటిలోనూ వాడిది ప్రత్యేకమైన బాణీ, అది నాకు చాలా ఇష్టం. మేము కలిసి చెన్నై, ఢిల్లీ, బొంబాయి వంటి ప్రసిద్ధ నగరాలలో అన్నమాచార్య సంకీర్తనలు పాడాం. ప్రతిచోట వాడికి ప్రత్యేకమైన అభిమానుల బృందం ఉండేది. అన్నమయ్య పాటలు వింటే వాడి నోట్లోంచే వినాలి అంటుండేవారు. నా అభిప్రాయమూ అదే. లేకపోతే సినిమాలలో పాడకుండా అన్నమయ్య పాటలకే అంకితమైపోయి తిరుపతిలోనే నివసించడమేమిటి? అది భగవదేచ్ఛ, అంతే. ఆ వెంకటేశ్వరుడికి ఆశ తీరక అన్నమయ్యను బాలకిషన్‌గా పుట్టించి మళ్ళీ వాడి ద్వారా ఆ పాటలు విని ఆనందిస్తున్నాడని నేననుకుంటున్నాను. ఆ మాట చాలా మంది నాదగ్గరన్నారు. అది విన్నప్పుడల్లా నేను పొంగిపోతుంటాను. బాలకిషన్ మా వాడు అని చెప్పుకోవడం నాకు గర్వకారణం."

**- శ్రీమతి ఎస్.జానకి, సినీ నేపథ్య గాయని**




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



### "ఆహో చక్రపాణీ!"

విజయ సారథులలో ఒకరైన చక్రపాణిగారు పనిలేకపోతే, తుండుగుడ్డ భుజాన వేసుకుని స్టూడియో (విజయవాహిని) అంతా తిరుగుతూ వుండేవారు. ఎక్కడైనా షూటింగులు జరుగుతూ వుంటే, అదెవరిదని కనుక్కుని, తనకి బాగా తెలిసినవారుంటే ఆ ఫ్లోర్‌లో ప్రవేశించి, కాస్సేపు కూచునేవారు. చక్రపాణిగారు రాగానే అందరూ- కాలేజ్ ప్రిన్సిపాలో, హెడ్మాస్టరో వస్తే కంగారు పడినట్టు - కంగారు పడిపోయేవారు, కొందరు కిందపడిపోయేవారు. కొందరు ఆనందపడ పోయేవారు. అదంతా చూస్తూ చక్రపాణిగారు "ఎందుకూ - మీ పని మీరు చేసుకోండి" అని, దృశ్యం వగైరాలు భోగట్టా చేసి ఒకషాటు చూసి, ఆ నిర్మాతో ఇంకొకరో ఆ సినిమా కథ, నటీనటులు ఆ వివరాలు చెబుతూ వుంటే -తుండుగుడ్డ భుజాన వేసుకుని నిశ్శబ్దంగా నిష్క్రమించేవారు. కొండొకచో, మరీ తెలిసినవాళ్ల షూటింగ్‌యితే, ఓ సలహా పారేసేవారు. 'ఇద్దరుమిత్రులు' షూటింగ్‌లో అలాంటిదే జరిగింది. చక్రపాణిగారు సెట్లోకి వెళ్లేసరికి నాగేశ్వరరావుగారు నిశ్శబ్దంగా మేడమీదికి చూస్తూ అటూఇటూ తిరుగుతున్న 'సైలెంట్ షాట్' తీస్తున్నారు. ఒక రిహార్సలు అయిన తర్వాత, 'నాగేస్సర్రావు! ఊరికే అలా తిరగడం కన్న ఈల కొడుతూ తిరగొచ్చుగదా" అని ఓ సలహా విసిరారు - చక్రపాణి.

"కాదండి. ఇది సీరియస్ సీను, ఆత్రుతగా వుండాలి" అన్నారు నాగేశ్వరరావుగారు.

"సీరియస్సా? అయితే ఈలొద్దులే, బాగోదు, అట్టాగే తిరుగు!'' అని తుండుగుడ్డ సవరించుకుంటూ, బయట కొచ్చేశారు.

చక్రపాణిగారికి తోచనప్పుడు, వాళ్ల థియేటర్లోనే ఏదైనా సినిమా చూసేవారు. విజయాలాబ్‌లో విడుదలకి సిద్ధమవుతున్న సినిమాలేవైనా వున్నాయా అని అడిగి, ఆ ప్రింటు తెప్పించి, ప్రొజెక్ట్ చెయ్యమనేవారు. నాగిరెడ్డిగారి వెనకాల మేనేజర్లో, అకౌంటెంట్లో ఎవరో ఎప్పుడూ వుండేవారు గాని, చక్రపాణి గారి వెంట ఎవరూ వుండేవారు కాదు ఒక్కరే తిరగేవారు. అలాగే, సినిమా చూడడం కూడా ఒక్కరే కూచుని చూసేవారు. ఆయన చిత్రం చూసే పద్ధతి చిత్రంగా వుండేది. మొదటి రెండు మూడు రీళ్లయిన తర్వాత, ఆయనకి కొన్ని పాత్రలూ కొంత కథ అర్థమయ్యేవి. అక్కడికి ఆపి, "ఆరో రీలు వెయ్యి" అనేవారు - ఆపరేటర్‌తో. ఆరులో జరిగిన సన్నివేశాల వల్ల - ఏడో రీలులో ఈకథ ఇలా జరుగుతుంది కాబోలు అని వూహించుకుని, 'ఇప్పుడు పదివెయ్యి' అనేవారు. ఆయన అనుకున్నది కాకుండా వదోరీల్లో కథ మరోమలుపు తిరిగి వుంటే "పది ఆపు ఇపుడు నాలుగు వెయ్యి" అని ఆర్డరిచ్చేవారు. నాలుగో రీలు దృశ్యాన్ని పదో రీలు దృశ్యాల్నీ అధ్యయనం చేసినట్టు అన్వయించుకుని "పదమూడో రీలు వెయ్యి'' అనేవారు ఆ రీలు క్లైమ్యాక్స్‌కి దారిచూపిస్తుందని.ఆ రీలు ఏం దారిచూపిస్తుందో గాని, ఆయన మాత్రం ఆ రీలు నడుస్తూండగానే బయట దారిపట్టేవారు. థియేటర్లో ఎవరూ లేకుండా ఆ సినిమా కుర్చీలకి మాత్రం ప్రదర్శితమైయేది. కాస్సేపటికి ఆపరేటర్ గమనించి, నాలిక్కరుచుకుని, ప్రొజెక్షన్ ఆపి, తలుపులు తెరిచేవాడు. ఆయన సినిమా చూసేవిధానం అలా 'చిత్రంగా' కాకుండా విచిత్రంగా కూడా వుండేది. అందుకే ఆయనతో కలిసి ఎవ్వరూ సినిమా చూసేవారు కాదు!

* * *

### "హే చక్రపాణీ?"

చక్రపాణిగారనగానే, ఇంకో చక్రపాణి గుర్తొచ్చారు - నటుడు తరుణ్ తండ్రి అని చెబితే నేటివారికి ఇంకా బాగా అర్థమవుతుంది. ఈ చక్రపాణి చాలా చిత్రాల్లో ముఖ్యపాత్రలు ధరించారు. "ఓటుకి విలువివ్వండి'' అన్న సినిమాలో ఆయన శ్రీమహావిష్ణువు. (ఈ సినిమాకి ముందుగా 'ఓటుకి విలువలేదు' అని పేరు పెడితే, సెన్సార్ వాళ్లు అభ్యంతరం చెప్పారు. పోస్టర్లు కూడా ప్రింటయి పోయాయి. ఛాంబర్‌లో టైటిల్ రిజిస్టర్ చేసినప్పుడే అభ్యంతరం పెట్టవలసింది" అని నిర్మాతలు వాదించినా ప్రయోజనం లేకపోయింది) దేవతలందరూ విష్ణుమూర్తితో మొరపెట్టుకోడానికి వెళతారు -ఒక దృశ్యంలో. ఆ దేవతల్లో నేను అగ్నిదేవుణ్ణి. చిట్టిబాబు, దమ్ ఇంకా కొందరు కమేడియన్లూ దేవతాపాత్రధారులు. వీళ్లంతా "హే పరమాత్మ .. పరంధామ.... విష్ణుదేవా!.. రక్షించు రక్షించు.." అంటూ, వైకుంఠంలో ప్రవేశించాలి. అదీ షాటు. రెండు మూడు రిహార్సిల్సు అయినాయి. టేక్ లో అందరూ ఉన్నమాటలే చెబుతూ వెళ్తూ వుంటే నేను "పరంధామా!...చక్రపాణీ..." అని అరుస్తూ వెళ్తూ వుంటే - చిట్టిబాబు ఒక్కసారి ఆగిపోయి "కట్...కట్ సార్..బావ (అంటేనేను) చక్రపాణీ, చక్రపాణీ అని పిలుస్తున్నాడు సార్..... అసలు పేరుతో " అని సీరియస్‌గా డైరెక్టరు వేజెళ్ల సత్యనారాయణతో ఫిర్యాదు చేశాడు.

నేను నవ్వేశాను. "చక్రపాణీ! అని, ఆయన పేరుతో పిలవలేదుసార్. చక్రపాణి అన్నా శ్రీమహావిష్ణువే కదా" అన్నాను. డైరెక్టరు కూడా నవ్వి'' అయినా అంతమందిలో ఏం



వినిపిస్తుంది? పైగా డబ్బింగ్ వుంది కదా....దాని కోసం కంగారు పడిపోయి కట్ చెప్పకు " అన్నారు -చిట్టిబాబుతో - " రెడీ ఫర్ టేక్" అని కేకపెట్టి. మేము టేక్‌కి సిద్ధం అవుతూవుండగా చిట్టిబాబు నా చెవిలో " ఏమైనా, మళ్లీ 'చక్రపాణీ' అనకు బావా! నవ్వొచ్చేస్తుంది నాకు! ప్లీజ్ " అన్నాడు

## (వి)చిత్రనళీయం !

"చిత్రనళీయం"పేరుతో నలదమయంతుల కథ నాటకంగా ఆడేవారు. అయితే, కృష్ణరాయభారం, ఉద్యోగవిజయాలు, పాదుకా పట్టాభిషేకం, సతీసావిత్రీ నాటకాల్లాగా "చిత్రనళీయం" అంత పాప్యులర్ కాలేదు. 1938లో అదే పేరుతో సినిమా వచ్చింది. మాధవపెద్ది వెంకట్రామయ్య, శ్రీరంజని ముఖ్యపాత్రలు ధరించారు. ఆ సినిమా ఏమీ ఆడలేదు.




'నలదమయంతి' పాటల పుస్తకం కవర్‌పేజీపై భానుమతి, కెంపరాజ్

1957లో కెంపరాజ్ (కన్నడ నటుడు, నిర్మాత) ఆయనే హీరోగా, దర్శకుడిగా 'నలదయమంతి' పేరుతో 'చిత్రనళీయం' తీశారు. భానుమతి దమయంతి. అదీ -ఉహూఁ నడవలేదు!

1963లో 'నర్తనశాల' విడుదలయ్యాక, రాజ్యం పిక్చర్స్‌వారు మళ్లీ పౌరాణికం తియ్యాలనుకుంటే, నలదమయంతుల కథ బాగుంటుందనీ రామారావు నలుడి పాత్రనీ, బి.సరోజాదేవి దమయంతి పాత్రనీ ధరిస్తే - ఇహ చెప్పేదేవుందనీ- కథలో మంచి సెంటిమెంటుందనీ మళ్లీ 'హరిశ్చంద్ర' లాగా హిట్టు అవుతుందనీ అనుకుంటూ వుండగా, శ్రేయోభిలాషులు చరిత్ర తవ్వారు.

ఆ తవ్వకంలో కొన్ని 'సత్యాలు'బయట పెట్టారు. "చిత్రనళీయం నాటకంగా ఎక్కువ కాలం బతక్కపోవడానికీ, వచ్చిన రెండు సినిమాలు ఫ్లాపులు కావడానికీ కారణాలు ఏమనుకుంటున్నారు? - ఆ కథలో శని వున్నాడు! శని లేకుండా ఆ కథలేదు. అంచేత శని వుండితీరాలి! శని వుండటంతో ఇంకేముంది? నాటకానికీ, సినిమాలకీ శని పట్టింది. ఆ శనే అశనిపాతమై సినిమాల్ని కదలనీయకుండా నిలవేశాడు!



'శకుంతల'లో ఎన్టీఆర్, బి.సరోజాదేవి

అంచేత ఆ కథ జోలికి ఎవరు వెళ్లినా శనిప్రభావాన్ని భరించవలసిందే, అంచేత రామారావుని పెట్టినా సరోజాదేవిని పెట్టినా ఆ కథ విజయం సాధించదు కనక ఆ కథ మాటే ఆలోచించకండి !" అని సలహాలు ఇవ్వడంతో ఆ నిర్మాతలు మళ్లీ ఆ మాట ఎత్తలేదు. అనుకున్న రామారావు, సరోజాదేవి లతో 'శకుంతల' తీశారు రాజ్యం పిక్చర్స్‌వారు. "దీనికి ముందుగా, శని కథని అనుకోడం వల్లనే - 'శకుంతల' కీ, ఆ గతే పట్టింది!" అని కూడా తేల్చారు ఆ సినీ పండితులు!

బతిమాలాడుతున్నట్టు. "అలాగే లేరా" అన్నానేను అభయహస్తం ఇస్తున్నట్టు.

ఆ సినిమా షూటింగ్‌లోనే దుర్వార్త - ఇందిరాగాంధీని షూట్ చేశారని. ఎక్కడి వాళ్లక్కడ స్తంభించిపోయారు. షూటింగుల్లేవు, టిఫిన్లు లేవు, భోజనాలులేవు. బయటంతా అల్లకల్లోలం; అల్లరి కల్లోలం. "గొడవలు జరుగుతున్నాయి వెళ్లకండి" అన్నా ఎలాగో వెళ్లిపోవాలని, సొంతకార్లోనూ కంపెనీ కార్లలోనూ బయల్దేరిన వాళ్లు బయల్దేరారు. నేను కూడా పెద్ద హీరోలాగా, నాకార్లో ఇద్దరు ముగ్గురు మగవాళ్లని కలుపుకుని, సందుల్లోంచీ గొందుల్లోంచీ డ్రైవ్‌చేస్తున్నాను. ఎవరెక్కడవున్నారో తెలీదు, ఎక్కడికి వెళ్ళారో తెలీదు! పొద్దున పదకొండు గంటలకి బయల్దేరిన మాకారు, రాత్రి పదకొండు గంటలకి -(ఆఫ్టరాల్ ఎవియమ్ స్టూడియో నుంచి, 8,9 కిలోమీటర్లు) భయంతో చెమట్లు పట్టి, వణికి పోతూ ఇల్లుచేరితే, డైరెక్టర్ పరివారం రాత్రంతా "పొట్టచేత్తో వట్టుకుని" న్యాడియెలో వుండిపోయార్ట!

* * *

### కారుతెచ్చిన తంటా

నేను 'విజయచిత్ర' లో పనిచేస్తూ సినిమాల్లో వేస్తున్నప్పుడు -ఆఫీసు వాళ్లు స్కూటర్ ఇచ్చినా కారు వుంటే షికారుకి బావుంటుందికదా అని, 'రెండో చేతి కారు' కొందామనుకున్నాను.

ఒక మిత్రుడు తనికి, సెకెండ్‌హాండ్ కార్లు అమ్మే షాపు వోనరు తెలుసునని తీసుకెళ్లాడు. 'కారు చూపులు' అయినాయి. కట్న కానుకలూ అయినాయి. నిశ్చితార్థం కూడా అయిపోయింది. కారుని అత్తవారింటికి పంపడానికి సుముహూర్తం కూడా నిశ్చయమైపోయింది. ఆ సంతోషంలో నా మిత్రుడు "పద ! స్వీటుతో సహా మంచి టిఫిన్ తిందాం" అని, నేను ఎందుకంటున్నా వినకుండా, బలవంతంచేసి కారులో షాపుకి దగ్గర్లోవున్న కాఫీ షాపుకి తీసుకెళ్లాడు.

షాపేమిటి -పెద్ద హోటలు. దానిపేరు 'స్వాగత్' మద్రాసు రాయపేటలో వుంది. "నా జోక్యంతో పనులన్నీ చక్కగా అయిపోయాయి. ఐయామ్ హేపీ, సరదాగా ఈ చిన్న పార్టీ -అంతే" అని స్వీట్లు హాట్లూ ఏమేం కావాలో అన్నీ అడిగి - ఆర్డరిచ్చాడు. కబుర్లు చెప్పుకుంటూ తిన్నాం. తాగడానికి వచ్చేవేళకి, "నాకు కాఫీ వద్దు, నువ్వుతాగు" అని ఆర్డరిచ్చి "నాకు అర్జెంటుగా పనుంది, వెళ్ళాలి" అని ఆ మిత్రుడు చరాచరా జారుకున్నాడు.

బేరర్ బిల్లు తెచ్చి నా చేతిలో పెట్టాడు. చూశాను. స్వాగత్ హోటల్‌కి నన్ను స్వాగతించిన వాడూ లేడు! నా జేబులో కుబేరుడూ లేడు ! ఎక్కడుంటుంది? ఉన్నదంతా ఊడ్చి కారుకి అడ్వాన్స్ ఇచ్చేస్తే! బిల్లు అరవైరూపాయిలకి పైనే - పెద్దహోటల్‌కదా !.. పర్సులో పదిహేనుకంటే ఎక్కువ లేదు. తెల్లబట్టలు వేసుకున్న బేరరు, నా తెల్లమొహం కనిపెట్టినట్టున్నాడు, కదలడే.

వేళ్లతో టేబులు మీద తబలా కొడుతూ కూచున్నాను శ్వేత వస్త్ర ధారిని చూడకుండా! ఏం చెప్పాలి? మేనేజరు తో మాట్లాడాలా? ఇతన్నే అప్పు అడగాలా? అనుకుంటూ వుంటే - రాధాకృష్ణ గారు ఛట్టున గుర్తొచ్చారు. ఆయన అదే హోటల్లో రూము తీసుకుని సినిమా స్క్రిప్టు రాస్తున్నారు- నాకు తెలుసు. ఆయన అప్పుడు ఆపద్బాంధవుడు! ఈ సైంధవుణ్ణి వదిలించుకోడానికి, ఇతని ముందే ఆయన రూముకి ఫోన్ చేసి మాట్లాడి, " ఆ రూమ్‌లో వుంటాను- బిల్లు కలెక్ట్ చేసుకో" మన్నాను దర్జాగా. భమిడిపాటి వారి రూముకి వెళ్లి , "మీ కథ ఆపి, నా కథ వినండి" అని కాసేపు కారుమబ్బులు కాయించిన కారుకథంతా చెప్పి నూరురూపాయిలు అప్పుగాగాని, చేబదులుగా గాని ఇమ్మని అర్థించగా, ఆయన ఒకటే నవ్వు! "ఎవడండీ బాబూ ఆ మిత్రుడు ?" అని నవ్వుతూనే, "ఎందుకూ -నా రూమ్ అకౌంట్‌లో వేయిద్దాం లెండి" అన్నారు రాధాకృష్ణగారు. "అతనెవడో నాకు తగిలించి, ఇరికించినదానికి మీ కెందుకు మధ్య? " అని ఎంత వాదించినా వినలేదు ఆయన. కిందకి ఫోన్‌చేసి, ఆ బిల్లు సంగతి చెప్పి తన అకౌంట్‌లో వెయ్యమని చెప్పి -మళ్లీ నవ్వారు.

"మీరేం కంగారు పడకండి. మిమ్మల్ని ఇరికించి పారిపోయిన మిత్రుడూ 'మధ్య'వాడు కాడు; నేనుకానూ, మీరు కారు ! మీరూ, కారూ బాగుంటే చాలు. ఈ బిల్లు ఇంకో మధ్యవాడు చెల్లించుకుంటాడు. మా ప్రొడ్యూసర్ కట్టుకుంటాడు. ఏం భయంలేదు" అన్నారు నవ్వుతూనే రాధాకృష్ణగారు . ఎవరికేది ప్రాప్తమో ఎవరూ చెప్పగలరు ? ఏం సంబంధంలేని ఆ నిర్మాతకి ప్రాప్తమైంది నా బిల్లు!

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-27402993

**బృందగానం**

**రచన , సంగీతం** : కీ॥శే॥ మంచాళ జగన్నాథరావు
**రాగం** : హంసధ్వని
**తాళం** : చతురశ్రగతి (కర్ణాటక సం॥)
కహరువా (హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : సరిగప నిస
**అవరోహణ** : సనిప గరిస

షడ్జము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, పంచమం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

**29**వ మేళకర్తయగు శంకరాభరణం యొక్క జన్యరాగం హంసధ్వని. శ్రీముత్తుస్వామి దీక్షితుల వారి తండ్రి రామస్వామి దీక్షితులు యీ రాగాన్ని సృష్టించినట్లు చెబుతారు. ఇది చాలా ప్రసిద్ధి చెందిన రాగం.

హంసధ్వని రాగంలో ఎందరో వాగ్గేయకారులు కీర్తనలను రచించారు. వాటిలో "వాతాపిగణపతిం భజేహం" (ముత్తుస్వామి దీక్షితులు), "రఘునాయకా! నీ పాదయుగ రాజీవముల నే విడజాల" (త్యాగరాజు), "వందేనిశమహం వారణవదనం" (మైసూర్ వాసుదేవాచార్), "శరణు సిద్ధివినాయక! శరణు విద్యాప్రదాయకా" (పురందరదాసు), "పాహిప్రభోగణరాజా! మాంపాహి ప్రభో సదా శివాత్మజా", "వరివరి నీపాదమే భావన -పరమకృపావన" (బాలమురళీకృష్ణ) మొదలగు కీర్తనలు బహుళప్రచారము పొందినవి.

హిందుస్తాని విద్వాంసులు కూడా యీ రాగాన్ని స్వీకరించి యిదే పేరుతో రాగాన్ని పాడుతారు. ఈరాగానికి చతుశృతి దైవతం కూడా చేరి "శంకరా" అనే పేరుతో మరియొక రాగం హిందుస్తాని సంగీతంలో పిలువబడుతున్నది. (శంకరా 'యొక్క ఆరోహణ : సగపనిదస, అవరోహణ : సనిదపగపరిగరిస). లలిత

### మంచి తనానికి మారుపేరుగాట

ప॥ మంచితనానికి మారుపేరుగా
మనమెపుడుండాలి - మనమెపుడుండాలి
మన భేదాలను మరచి ఏకమై
మనమెపు దుండాలి - మనమెపు దుండాలి॥

చ॥ కమ్మని మాటలు పలికే ద్రోహుల
కథ కట్టించాలి - ఆ కథ కట్టించాలి
తిమ్మిని బెమ్మిగ చేసే ఘనులను
తుదముట్టించాలి -మరి తుదముట్టించాలి ॥మంచి॥

చ॥ అందరి సుఖము మనదనుకుంటే
ఉంది సుఖం మనకు - మరి ఉంది సుఖం మనకు
ముందడుగేసి ఎలుగెత్తి ఇది
చాటాలందరికి -యిది చాటాలందరికి ॥మంచి॥

చ॥ ధనమున్న వారు కొనగలరు కొన్ని
అన్నీ కొనగలరా -మరి అన్నీ కొనగలరా
మనసిచ్చి మంచి కొనిపెంచి దాని
ఘనతను చాటాలి - ఆ ఘనతను చాటాలి ॥మంచి॥





సంగీతంలో బాగా పాప్యులర్ యీ రాగం. ఆకాశవాణి లోను, చలన చిత్రాలలోనూ ఎంతో మంది స్వరకర్తలు యీ రాగంలో సుమధుర గీతాలను మనకు అందించారు.

శ్రీపాలగుమ్మి విశ్వనాథంగారు యీ రాగంలో కృష్ణశాస్త్రి గారి 'తరలిరారమ్మా గౌతమీ మంజీర ఓ నాగావళి', "ఒత్తండి జీవన శంఖము ఎత్తండి రీవిగ శీర్షము" అనే గీతాలకు మధురమైన బాణీలు కూర్చారు. కోపల్లె శివరాం రచించిన "కొమ్మరో విరిరెమ్మరో" అనే గీతానికి హంసధ్వని రాగంలో "త్రిపథ" (అల్లసాని పెద్దన గారి "మనుచరిత్ర" కు రేడియో అనుసరణ) అనే సంగీత రూపకంలో ఆ పాటకు బాణీని కూర్చాను. భక్తికి, ఆనందానికి, వీరరసానికి అనువైన రాగంగా హంసధ్వనిని చెప్పవచ్చు.

సమాజ శ్రేయస్సును ఆకాంక్షించియే మానవుడు జీవించాలి. తనతోటి వారికి స్నేహహస్తాన్ని అందించాలి. స్వార్థము, సంకుచిత మనస్తత్వము విడనాడాలి. "సొంత లాభం కొంత మానుకు పొరుగు వాడికి తోడు పడవోయ్" అని, "అన్నదమ్ముల వలెను జాతులు మతములన్నీ మెలగవలెనోయ్" అన్నాడు మహాకవి గురజాడ. కనుక అందరి యెడ సోదర భావంతో కలిసి మెలిసి సమాజశ్రేయస్సుకై, దేశ ప్రగతికై పాటుపడాలి మానవుడు. మంచితనమే అతనికి మహితధనం, అదే ఘనం. సమాజంలో వుండే మాలిన్యాన్ని పోగొట్టి మానవత్వపు విలువల్ని పెంపొందించడానికి అందరూ పాటుపడాలి అనే యీ సందేశాన్ని కీ॥శే॥మంచాళజగన్నాథరావుగారు వారి గేయం ద్వారా అందించారు. హంసధ్వని రాగంలో మనోజ్ఞమైన బాణీని కూర్చి ఆకాశవాణిలో యీరాగాన్ని బృందగీతంగా పాడించారు. ●

## హంసధ్వని రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. శ్రీరఘురాం జయరఘురాం | శాంతినివాసం | పి.బి. శ్రీనివాస్, పి. సుశీల | ఘంటసాల |
| 2. తరలిరాద తనే వసంతం | రుద్రవీణ | యస్.పి. బాలసుబ్రహ్మణ్యం | ఇళయరాజా |
| 3. జయశంభోశివ శంకరా | పల్నాటియుద్ధం | భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| **హిందీ** | | | |
| 1. జా తోసే నహీఁ బోలూఁకన్హయ్యా | పరివార్ | లత, మన్నాడే | సలిల్ చౌధురి |

## హిందీ సినీ సంగీతంలో మైలురాళ్లు-మజిలీలు

### 1965

శంకర్ - జైకిషన్‌ల జంట విడిపోయి ఎవరికి వారు పెద్ద నిర్మాణ సంస్థలకు సంగీతం ఇవ్వటం ప్రారంభించారు. రామానంద్‌సాగర్ నిర్మించిన 'ఆర్జూ' చిత్రం కోసం జైకిషన్ పెద్ద మొత్తంలో (5 లక్షలు రూపాయలు) వసూలు చేయటం ఓ విశేషం. ఆ చిత్రంలోని 'ఏ ఫూలోం కి రాణి, బహారోం కి మలికా...'(రఫీ) పాట హిట్ గీతంగా నిలిచింది. (అయితే ఈ గీతం 'లీడర్' చిత్రం కోసం నౌషాద్ స్వరపరిచిన 'హమీ సే మొహబ్బత్...'ను పోలి ఉండటం విమర్శలకు దారితీసింది.) 'బేదర్దీ బాల్‌మా తుఝ్‌కో మేరా మన్...'(లతా), 'అజీ రూఠ్ కర్ అబ్ కహాఁ..' (లతా), 'అజీ హమ్‌సే బచ్‌కర్ కహాఁ..'(రఫీ), 'ఛల్‌కే తేరీ ఆంఖోం సే...' (రఫీ) పాటలు హిట్ అయ్యి జైకిషన్‌కు మంచి పేరు తీసుకువస్తే, ఇదే చిత్రం కోసం శంకర్ కంపోజ్ చేసిన 'జబ్ ఇష్క్ కహీఁ హొ జాతా హై తబ్ ఐసీ హాలత్ హోతీ హై...' (ఆశా, ముబారక్ బేగం) పాట కూడా హిట్ అయింది. ఈ ఒక్క పాట కోసమే రామానంద్ సాగర్ జైకిషన్‌తో సమానంగా శంకర్‌కు 5 లక్షలు ఇవ్వటం మరో విశేషం.


'ఆర్జూ'లో ఓ సన్నివేశం

శంకర్ - జైకిషన్ పేరు మీద వచ్చిన మ్యూజికల్స్‌లో 'గుమ్‌నామ్', 'జాన్‌వర్' ఉన్నాయి.

'గుమ్‌నామ్' లో మెహమూద్ కోసం రఫీ పాడిన 'హమ్ కాలే హై తో క్యా హువా దిల్‌వాలే హైఁ...' పాట సూపర్‌హిట్ అయ్యింది. ఇదే ట్యూన్‌తో తెలుగులో జంధ్యాల దర్శకత్వంలో నిర్మితమైన 'రెండు జెళ్ళ సీత' చిత్రంలో 'నా షోలాపూర్ చెప్పులు పోయాయి...' పాట చేస్తే, ఆ తరువాత సురేష్ ప్రొడక్షన్స్ సంస్థ 'నీకునేను నాకు నువ్వు' చిత్రంలో 'పెళ్లాడే తీరాలన్నారు మా నాన్నారు..'గా చేశారు. ఓ ప్రైవేట్ ఆల్బమ్‌కు ఇదే ట్యూన్‌తో రఫీ ఓ ఇంగ్లీషు పాట పాడారు.


మెహమూద్

'గుమ్‌నామ్ హై కోయీ, బద్‌నామ్ హై కోయీ....'(లతా), 'ఇస్ దునియా మేఁ జీనా హో తో సున్ లో మేరీ బాత్..(లతా), 'జాన్ పెహచాన్ హో, జీనా ఆసాన్ హో..'(రఫీ) పాటలు ఈ చిత్రంలో మరికొన్ని హిట్ గీతాలు.

'జాన్‌వర్' చిత్రం శంకర్-జైకిషన్, షమ్మీకపూర్‌ల కాంబినేషన్‌లో మరో మ్యూజికల్‌గా హిట్ గా నిలిచింది. 'లాల్ ఛడీ మైదాన్ ఖడీ..'(రఫీ), 'మేరీ మొహబ్బత్ జవాఁ రహేగీ..'(రఫీ), 'తుమ్ సే అచ్ఛా కౌన్ హై...'(రఫీ), 'మేరే సంగ్ గా గున్ గునా..'(సుమన్ కళ్యాణ్‌పూర్) పాటలు హిట్ అయ్యాయి.


అనిల్ బిశ్వాస్

మోతీలాల్ తీసిన 'ఛోటీ ఛోటీ బాతేఁ' చిత్రానికై అనిల్‌బిశ్వాస్ అందించిన స్వరాలు అందరినీ ఆకట్టుకున్నాయి. ఈ చిత్రానికి గీత రచయిత శైలేంద్ర. ఈ చిత్రం తరువాత అనిల్‌బిశ్వాస్ సినిమాలకు సంగీతాన్నందించటం మానేసి ఢిల్లీ ఆలిండియా రేడియోలో జాయిన్ అయ్యారు.

- (వచ్చే సంచికలో మరికొంత)

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు

**గాయత్రి, హైదరాబాద్**

ప్ర ॥ బాపుగారి "భాగవతం" లో 'కిష్టప్పా.....కిష్టప్పా' అంటూ కృష్ణుడి ఫ్రెండ్స్ 'ముస్తాఫా... ముస్తాఫా....' పాట వరసలో పాడుకుంటుంటే 'ఇదేంటీ....పురాణాల్లో ఏ.ఆర్.రెహమాన్ ట్యూన్ పెట్టారు?' అనుకున్నాం.. మీకు బాధనిపించలేదా? కామెంట్ ప్లీజ్....

జ ॥ అసలు కృష్ణుడి ఫ్రెండ్సులో అలా పాడిందెవరనుకుంటున్నారు? అతనే ఏ.ఆర్. రెహమాన్.... ద్వాపర యుగంలో ఆనాడు తాను కట్టిన ట్యూన్‌ని 'కలియుగం'లో మళ్ళీ మనకి 'ముస్తాఫా', 'ముస్తాఫా', పాట రూపంలో అందించడానికి ఏ.ఆర్.రెహమాన్‌గా పుట్టాడు. ఈ దేవ రహస్యం తెలీకే మీరు బాధపడ్డారు. తెలిసుంటే (ఖుషిలో పవన్‌కళ్యాణ్ లాగ) ఎంత ఉల్లాసంగా ఉండేవారో ఎంత ఆనందంగా ఉండేవారో.

**బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.**

ప్ర ॥ ముందు చూపంటే ?

జ ॥ ప్రయాణాల్లో ఎమర్జెన్సీ డోర్ దగ్గర కూర్చోవడం.

**యం.అంజిరెడ్డి, ఒంగోలు**

ప్ర ॥ అలవాటు తప్పని ఆర్టీసి డ్రైవర్?

జ ॥ స్వంత పని కోసం స్కూటర్ మీద వెళుతూ కూడా డిపో కెళ్ళి నంతకం చేసి మరీ పోయేవాడు.



ప్ర ॥ కొత్తగా డ్యూటీలో చేరిన ఆటో డ్రైవర్ ?

జ ॥ ఉదయాన్నే మార్నింగ్ వాక్‌కు వెళుతున్న వాళ్లని చూసి "ఆహా! భలే గిరాకీ తగిలింది' అని ఆనందపడే వాడు.

## డబుల్ రోల్



తప్పిపోయిన వాళ్ల అబ్బాయి **కనిగిరి** బస్టాండులో **కనిపించాడట**

**రావు** గారింటి కోళాయిలో నీళ్లే **రావు**.

బాబాయ్ **గారు** ! ఊరికే అలా కం**గారు** పడకండి.

అలా **మీసం** మెలేసి గొప్పలు పోకండి సార్ **మీ** **సంగతి** నాకు తెలియదా!

**- రాయచోటి కృష్ణమూర్తి, డోంబివిలి (వెస్ట్) మహారాష్ట్ర**

## ఈ రూటే వేరు




వైపర్స్ - పర్సు ఎందుకు

వెలాసిటి - ఖరీదైన పట్టణం

బీట్‌రూట్ - వేరుదెబ్బ

**-వి. మంజురాణి, హైదరాబాద్**



## చిలిపి లిపి




| | |
|---|---|
| GO P LOW లు DO | - గోపీలోలుడు |
| వా U None THE ను Do | - వాయునందనుడు |
| GONE GAY U DO | - గాంగేయుడు |
| PAN-చాలి | - పాంచాలి |
| C ఖన్ D | - శిఖండి |
| V దురు Do | - విదురుడు |
| COW రవ SAY న | - కౌరవసేన |

**-తాళాభక్తుల లక్ష్మీ ప్రసాద్, విశాఖపట్నం.**

## పేరు - రిపేరు



ప్రియతమా - ప్రియనేస్తమా - ప్రేమంటే - రెండుగుండెల చప్పుడు
బావొచ్చాడు - ప్రియమైన శ్రీవారు - అగ్గిమీద గుగ్గిలం
హలోబ్రదర్ - ఒక చిన్నమాట - జీవితం - -ఆశల సందడి

**- శివాల శ్రీనివాసరావు, అముదాలవలస**

భారతీయుడు - ఒక్కడు చాలు - దేశద్రోహులు - అంతం

**- యు.విజయశేఖరరెడ్డి, హైదరాబాద్**

## పేరడీ పెరేడ్



అయ్యయ్యో సెల్లు బిల్లూ వచ్చెనే
అయ్యయ్యో గుండె గుభిల్లూ ఆయెనే
జీతం పూర్తిగ మింగింది, అప్పుతో రెట్టింపయ్యింది
బిల్లుకు తోడు సర్వీస్‌టాక్స్‌తో తడిసి మోపెడైపాయిందీ ॥అయ్యయ్యో॥
ఆ మహా మహా బిల్‌క్లింటన్‌కైనా తప్పదోయి భాయి
బిల్ బాధ తప్పదోయిభాయి
మరి నువ్ చెప్పలేదు భాయి
అది నా తప్పుకాదు భాయి
తెలివితక్కువగ 'రోమింగ్' కోసం పాట్లు పడితిపోయి
బాబూ ఊరడిల్లవోయీ ॥అయ్యయ్యో॥
ఉత్తరాలనే నమ్ముకునుంటే హాయిగా వుండేది
ఎన్నో విషయాల్ తెలిసేవి
పైగా పైకం మిగిలేది
ముందు చూపుతో వ్యవహరించితే లాభం ఉండేది
మనకు అంతటి బుద్ధేదీ... ॥అయ్యయ్యో॥
పల్సురేట్లూ దైవాధీనం
టారిఫ్ మారవచ్చు
మళ్ళీ ఆశ పెట్టవచ్చు
ఇంకా ఎవడు నమ్మిచచ్చు
ఉంటాడెవడో వెర్రిపుచ్చు
ఛాన్సుతగిలితే ఈసారైనా
మనకు కుదరవచ్చు
పోతే.....?
రగులుతుంది చిచ్చూ
బతుకు రొచ్చు రొచ్చు రొచ్చూ
(కులగోత్రాలు చిత్రంలోని "అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయెనే" పాటకు పేరడీగా..)

**-మామిడి మహేంద్ర, పూణే**

## చిలిపి కవిత



ఆకాశంలో సూర్యుడు
చండ ప్రచండంగా
తన ప్రతాపం చూపిస్తుంటే
నువ్వే గుర్తుకు వస్తావు !
చిరుజల్లు జడివానగ మారి
కుండపోతగా కురుస్తుంటే
నీవు మరింత గుర్తుకు వస్తావు
ఎప్పుడో నా నుంచి తీసుకున్న
నా "గొడుగు"
ఇప్పటికయినా తిరిగిచ్చేయ్ తల్లీ!!!

**-రాయచోటి కృష్ణమూర్తి, డొంబివిలి(వెస్ట్), మహారాష్ట్ర.**

## షార్ట్‌కట్స్




| | |
|---|---|
| అవసరాల ఆచార్యులు | - అ ఆ |
| ఇప్పిలి ఈశ్వరయ్య | - ఇ ఈ |
| ఉప్పల ఊర్మిళ | - ఉ ఊ |
| ఎలమంచిలి ఏడుకొండల ఐశ్వర్య | - ఎ ఏ ఐ |

**-ఎన్.బి. క్రిస్ట్, విద్యానగర్, హైదరాబాద్.**

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన **మామిడి మహేంద్ర (పూణే)** గారికి సోహన్ మ్యూజిక్ వారు 'సామ్రాట్ రీమిక్స్' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.



# జంధ్యా మారుతం




(10)

'ధనం మూలం ఇదం జగత్
'డబ్బుకు లోకం దాసోహం'
'మనీ మేక్స్ మెనీ థింగ్స్'... ఇత్యాది సూక్తులన్నీ పెద్దల ద్వారా వందల సార్లు వినివుంటాం. డబ్బు చేసే ఇంద్రజాలాన్ని దేవుడు కూడా రాయలేని గొప్ప స్క్రీన్‌ప్లేగా అభివర్ణించాలి. అసలు (లేదా వడ్డీ) విషయానికొస్తే డబ్బు సంపాదించడంలో కష్టముందో లేదో తెలీదుగానీ, 'మనీ'ని విచ్చలవిడిగా ఖర్చు పెట్టడంలో మాత్రం మెనీ మెనీ కష్టాలున్నాయి. అవేంటో జంధ్యాల తెరకెక్కించి చూపించి మరీ మనల్ని నవ్వించారు.

## 'మనీ' తో 'మెనీ' కష్టాలుపడ్డ బాబాయ్ అబ్బాయ్




మనలో కొందరికి పాతకాలం నాటి బ్లాక్ అండ్ వైట్ సినిమా 'వద్దంటే డబ్బు' గుర్తుండే వుంటుంది. ఓ మరాఠీ రచన ఆధారంగా రూపొందిన ఈ చిత్రాన్ని తొలి టాకీ చిత్రం 'భక్తప్రహ్లాద' ను రూపొందించిన హెచ్.యం.రెడ్డి, వై.ఆర్.స్వామి దర్శకత్వంలో నిర్మించారు. ఇందులో ఎన్టిఆర్, పేకేటి శివరామ్‌లు మంచి మిత్రులు. ఎన్టిఆర్, జానకి ప్రేమించుకుంటారు. పేదవాడయిన ఎన్టిఆర్‌ని తన అల్లుడిగా చేసుకోవడానికి ఇష్టపడని జానకి తండ్రి రాజనాల వరపరీక్ష పెడతాడు.

అదేమిటంటే తన అల్లుడు తన తాహతుకు తగ్గట్టుగా ఖర్చుచేయడం నేర్చుకోవాలంటూ కొంత సొమ్మునిచ్చి నిర్ణీత సమయంలోనే ఆ డబ్బుని ఖర్చు చేయాలని షరతు విధిస్తాడు. డబ్బు ఖర్చు చేయడం ఓ లెక్కా అనుకుని ఎన్టీఆర్, శివరామ్‌లు సరేనంటారు. డబ్బు ఖర్చు పెట్టేకొద్దీ వారికి రాబడి వస్తూనే ఉంటుంది. వద్దనుకున్నా వస్తున్న డబ్బు తన ప్రేమను ఎక్కడ బలితీసుకుంటుందోనని భయపడ్డాడు ఎన్టిఆర్. చివరకు ఓడిపోయానని అంగీకరిస్తాడు. అతనిలోని నిజాయితీ నచ్చి రాజనాల తన కూతురునిచ్చి పెళ్ళి చేస్తాడు.

ఈ పాయింట్‌నే బేస్ చేసుకుని తనదైన శైలిలో మనసారా హాయిగా నవ్వుకునేలా ప్రేక్షకుల ముందుంచారు జంధ్యాల. ప్రముఖ కార్టూనిస్ట్ జయదేవ్ క్రియేట్ చేసిన కార్టూన్ సిరీస్‌ల్లో ఒకటైన 'బాబాయ్ అబ్బాయ్' ఆ రోజుల్లో బాగా పాపులర్ అయ్యింది. అదే స్ఫూర్తితో జంధ్యాల ఈ సినిమాకి టైటిల్‌గా పెట్టుకున్నారు.

ఈ సమయంలో రజనీకాంత్ సినిమాని ప్రస్తావించటం అసందర్భం కాదు. ఇదే కాన్సెప్ట్‌తో ఆ మధ్య 'అరుణాచలం' అనే సినిమా తీశారు. అందులో రజనీకాంత్ డబ్బు ఖర్చు పెట్టడం కోసం నానారకాల ఇబ్బందులు పడతాడు.

ఇక 'బాబాయ్ అబ్బాయ్' విషయాని కొద్దాం. ఇందులో 'అబ్బాయ్' అని పిలవబడే బాలకృష్ణ పాత్ర పేరు బాలసుబ్రహ్మణ్యం. ఈ అబ్బాయిగారు పెళ్ళికాని బ్రహ్మచారి అయితే, ఆ బాబాయ్‌గారు.. అదేనండి మన సుత్తివీరభద్రరావు పెళ్ళయిన బ్రహ్మచారి.

ఈ బాబాయ్ అబ్బాయ్‌లు ఒకరికొకరు బంధువులు కాదు. స్నేహితులు అంతకన్నా కాదు. అసలు వీరిద్దరి కలయిక భలే తమాషాగా జరుగుతుంది. అబ్బాయిగారు తన భవిష్యత్తు తెలుసుకుందామని చిలక జ్యోతిష్యుని ముందు కూర్చుంటే ఆ చిలక కాస్తా ఎగిరిపోతుంది. బాబాయ్‌కి కడుపులో తేడాగా అనిపించి గత్యంతరం లేని పరిస్థితుల్లో 'టు లెట్'(టాయిలెట్ కాదు) బోర్డ్ వున్న ఇంట్లో దూరి ఇంటి ఓనర్‌కి ఎక్కువ అద్దె ఆశ చూపించి నిర్విఘ్నంగా తన బాధ తీర్చుకుంటాడు. అటు అబ్బాయ్‌ని చిలక జ్యోతిష్యుడు, ఇటు బాబాయ్‌ని ఇంటి ఓనరు ఫుట్‌బాల్ ఆడుకుంటున్న ఆ అశుభ సమయంలో వీళ్ళిద్దరి కలయిక జరుగుతుంది. అగ్నికి వాయువు తోడయినట్టు బాబాయ్‌కి అబ్బాయ్ జత కుదిరారు. అక్కణ్ణుంచి వీళ్ళ పొట్టపాట్లు చూసన్తాంటే నవ్వి నవ్వి మనకు పొట్ట చెక్కలవుతుంది.

దారుణంగా పెరిగిపోయిన రుణాను బంధాలను తెంచుకోవడం కోసం వీళ్ళు పడే తిప్పలు చెప్పనలవి కాదు. ఉదాహరణగా ఓ తమాషా ఇన్సిడెంట్‌ను గురించి చెప్పుకుందాం. అప్పులవాళ్ళ బాధలు పడలేక బాబాయ్ ఓ ఉచిత సలహా (సలహాని ఎవరూ అప్పు ఇవ్వరు. ఇచ్చినా తీసుకోరు) పారేస్తాడు. అదేమిటంటే తాను, అబ్బాయ్ కలిసి ఓ బ్రహ్మాండమైన నాటకం ఆడేస్తారుట. జనం విరగబడి చూస్తారుట. కనకవర్షం కురిపిస్తారుట. అలా అందరి అప్పు తీర్చేస్తారుట. ఐడియా రుచిగా వుందని రుణదాతలంతా లొట్టలేసుకుంటూ వెళ్ళిపోతారు.

ఇంతకీ ఆ నాటకం ఏమిటంటే **'సీతారామ సంగ్రామం'**! 'సీతారామ జననం', 'సీతారామకళ్యాణం', 'రామాంజనేయ యుద్ధం' గురించి తెలుసుగానీ ఇదెక్కడి 'రామాయణం'రా బాబు అంటే, అదే వెరైటీ



అంటాడు బాబాయ్. ఐడియా చెప్పడమే కాదు సీతగా ఆడవేషం వేసుకుని వేదిక మీద 'లేడి వేట.. లేడి వేట...' అంటూ తెగ హొయలొలకబోస్తాడు. అబ్బాయ్ రాముడు వేషం వేస్తాడు. ఈ సీతారామ సంగ్రామానికి

# పాటలు

రచన : వేటూరి సుందరరామమూర్తి

---

**లేడి లేడి**

అభినయం :బాలకృష్ణ, వీరభద్రరావు, కోటశ్రీనివాసరావు, శ్రీలక్ష్మి, రాళ్ళపల్లి, నిర్మలమ్మ, పావలా శ్యామల, జిత్ మోహన్‌మిత్రా తదితరులు

---

**తెలుసా నీకు తెలుసా**

అభినయం : బాలకృష్ణ, అనితారెడ్డి

---

**నీ రూపు పారాణీ దీపం**

**కనుచూపు కళ్యాణీ రాగం**

అభినయం : బాలకృష్ణ, అనితారెడ్డి

---

**సొమ్ము పెంచకు బాబాయో**

**సొమ్ము సిల్లకు అబ్బాయో**

అభినయం : బాలకృష్ణ, వీరభద్రరావు

---

**ఓ ప్రియా ఒంటరి రాత్రిలా**

అభినయం : బాలకృష్ణ, అనితారెడ్డి



జనం కురిపించింది కనకవర్షం కాదు రాళ్ళవర్షం...! 'తర్రై -నా తర్రై' అనేది ఇందులో వీరభద్రరావు ఊతపదం. 'తర్రై' అంటే అరవంలో 'ఇస్తా' అని అర్థమట.

ఈ 'బాబాయ్ అబ్బాయ్'లకి అప్పులిచ్చి వసూళ్ళ కోసం నానా తిప్పలు పడే బ్యాచ్‌లో జిత్‌మోహన్ మిత్రా తో పాటు శ్రీనివాసరావు అనే కొత్త ఆర్టిస్ట్ కనిపిస్తారు. రెండు, మూడు సీన్లు గమనించగానే అతగాడు ఎవరో ఇప్పటి



ప్రేక్షకులు ఇట్టే గుర్తుపట్టేస్తారు. ఆయనే ప్రముఖ నటుడు కోట శ్రీనివాసరావు. ఈ సినిమా టైటిల్స్‌లో ఆయన పేరు శ్రీనివాసరావు అని వుంటుందే తప్ప కోట అని ఎక్కడా రాసి వుండదు.

కోటతోపాటు మరో ఇద్దరు సుప్రసిద్ధ నటులు కూడా మీకిందులో కనిపిస్తారు. ఒకరేమో రాజేంద్రప్రసాద్, ఇంకొకరేమో వైజాగ్‌ప్రసాద్.

'నువ్వు-నేను' -చిత్రం ద్వారా ప్రతినాయకుడిగా మంచి ప్రాచుర్యం పొందిన వైజాగ్ ప్రసాద్ ఇందులో 'అకితాబ్ బుచ్చన్'గా కామెడీని పండించే ఎస్.ఐ.గా కనిపిస్తారు. నటునిగా వైజాగ్‌ప్రసాద్‌కిదే తొలిచిత్రం. హిందుస్థాన్ షిప్‌యార్డ్‌లో కంప్యూటర్ సెక్షన్‌లో పనిచేస్తున్న ఈయన అనుకోకుండా ఈ సినిమాతో వెండితెరకు పరిచయమయ్యారు. ఈ సినిమా గురించి ఆయన్ని కదిపితే బోలెడన్ని ముచ్చట్లు చెప్పుకొచ్చారు -

''నేను మొదట నాటకప్రియుడ్ని. ఒకే రంగస్థలం మీద నేను, జంధ్యాలగారు పోటాపోటీగా నాటకాలు ప్రదర్శించేవాళ్లం. జంధ్యాల ట్రూపు 'సంధ్యారాగంలో శంఖారావం' నాటకం, 'బహుకృత వేషం' నాటిక ప్రదర్శిస్తే, మా 'విజయ భారతి నటసమాఖ్య' వాళ్లు 'గరీబీ హఠావో' నాటిక , 'మననున్న మనిషి' నాటకం వేసేవాళ్లం. అలా మా ఇద్దరికీ పరిచయం వుంది.

'' 'బాబాయ్ అబ్బాయ్' సినిమా తీస్తున్నప్పుడు 'బుల్లెట్ డ్రైవింగ్' తెలిసిన మంచి పర్సనాలిటీ వున్న ఆర్టిస్ట్ కావాలని ఎంక్వైరీ చేశారు జంధ్యాల. ఆయనకి సన్నిహితుడైన బాబన్న నన్ను ఆయన దగ్గరికి తీసుకెళ్లాడు. అలా

## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| అబ్బాయ్(బాల) | : బాలకృష్ణ |
| కృష్ణవేణి | : అనితారెడ్డి (నూతన పరిచయం) |
| బాబాయ్ | : వీరభద్రరావు |
| ప్రసాదరావు | : వేలు |
| గోదావరి | : నిర్మలమ్మ |
| ప్రసాదరావు భార్య | : రాధాకుమారి |
| అరుణ | : శ్రీలక్ష్మి |
| అరుణతల్లి | : కాకినాడ శ్యామల |
| సుందరి | : శ్యామలా(పావలా) |
| టాక్సీడ్రైవర్ | : రాజేంద్రప్రసాద్ |
| కుక్కుటేశ్వరరావు | : పొట్టిప్రసాద్ |
| జంబులింగం | : సత్తిబాబు |
| సర్వర్ | : థమ్ |
| సర్వర్‌టీమ్ | : కె.కె.శర్మ, చిట్టిబాబు, విన్నకోట విజయరామ్ |
| అప్పులవాడు | : జిత్‌మోహన్ మిత్ర |
| 'చేతిలో చిప్ప'ప్రేక్షకుడు | : చిడతల అప్పారావు |
| ఎస్.ఐ.శ్యామసుందర్ (అకితాబ్‌బుచ్చన్) | : ప్రసాదరావు (వైజాగ్) |
| ఛోటా (వస్తాద్) | : రాజు |
| సేట్‌జీ | : కోట శ్రీనివాసరావు |

మరియు

రాంబాబు, రావూజీ, మల్లాది, భాను, గణేశ్వరరావు, ప్రకాశరావు, తాతబాబు, రాజు (మాస్టర్) , వీరభద్రరావు, డా॥దివాకర్, వేణు గోపరాజు, ప్రసాద్ (బాబు)



రిలీజ్
8 - 2 -1985
నిర్మాణప్రాంతాలు
వైజాగ్ తదితర ప్రదేశాలు

ఈ సినిమాతో నా వెండితెర యాత్ర మొదలయ్యింది. మొదటి రోజే ఎలాంటి బెరుకులేకుండా నటించడంతో జంధ్యాల గారి దగ్గరనుండి మంచి మార్కులు కొట్టేశాను. ఆ ఆనందంతో బుల్లెట్ మీద సిటీలోకి వెళ్తున్నాను. నా ముందు జంధ్యాల గారు కారులో వెళ్తున్నారు. చినవాల్తేరు జంక్షన్ దగ్గర్లోని ఆర్.టి.సి.డిపో దగ్గర ఓ డ్రైవర్ సైకిల్‌మీద వస్తూ జంధ్యాల గారి కారు క్రింద పడబోయి దురదృష్టవశాత్తు నా బుల్లెట్ కింద పడ్డాడు. వెంటనే అతను గుండెపట్టుకుని పడిపోవడంతో, నా గుండెలు జారిపోయాయి.

ఈ యాక్సిడెంట్ చూసి జంధ్యాల గారు కారు వెనక్కి తిప్పుకుని వచ్చారు. అతన్ని వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్లారు. ఇక తను బతకటం కష్టమే అనుకుంటున్నారు. నాకు ఒకటే



వణుకు. గొంతు దాహంతో పిడచకట్టుకుపోయినా కూడా మంచినీళ్లు తాగాలనిపించలేదు. ఈ యాక్సిడెంట్ మూలంగా మధ్యాహ్నం షూటింగ్ కూడా కేన్సిల్ చేసేశారు జంధ్యాలగారు. నాలుగు గంటల సమయంలో అతను సేఫ్ అని తెలిసి నాతో పాటు యూనిట్ వాళ్లందరూ ఊపిరి పీల్చుకున్నారు. అక్కడితో ఈ కథ అయిపోలేదు. అసలు ట్విస్ట్ తర్వాత మొదలైంది.

నేను నడిపిన బుల్లెట్ ఓ సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌ది. సెలవు మీద వెళ్తూ షూటింగ్‌కిచ్చారు దాన్ని. ఎవరో పోలీస్ రిపోర్ట్ ఇవ్వడంతో పోలీసులు వేట మొదలు పెట్టారు. మూడ్రోజులు తర్వాత... నేను, బాలకృష్ణగారు, రామకృష్ణా బీచ్ దగ్గర షాట్‌గ్యాప్‌లో మాట్లాడుకుంటున్నాం. ఓ హెడ్ కానిస్టేబుల్ నా దగ్గరకొచ్చి, 'మీరేనా ఈ బండి నడిపింది' అనడిగాడు. నేను 'అవున'న్నాను. 'వెంటనే మా ఎస్పైగారిని కలవండి. కేసు తప్పించుకు తిరుగుదామనుకుంటున్నారా?' అని అతను దబాయించబోతుంటే, బాలకృష్ణ గారు అడ్డుపడి,



'జరిగిందేదో జరిగిపోయింది. అతను ప్రాణాలతో బయటపడ్డాడు. హాస్పటల్ ఖర్చులు కూడా మేమే పెట్టుకున్నాం. ఇంకెందుకీ కేసులు' అంటూ అతని మీద కోప్పడి సర్దిచెప్పి పంపించేశారు. ఇదండీ నా తొలి సినిమా తాలూకు అనుభవాల చిట్టా" అంటూ వివరించారాయన.

వైజాగ్‌ప్రసాద్ పూర్తిపేరు కొర్లాం పార్వతీ వరప్రసాద్‌రావు. ఈ సినిమా టైటిల్స్‌లో కె.పి.వి.ప్రసాదరావు అని ఉంటుంది. ఈయనకి 'వైజాగ్ ప్రసాద్' అని పేరు పెట్టింది కూడా జంధ్యాలే. 'మొగుడు పెళ్లాలు' సినిమా టైటిల్స్‌లో ఈయన పేరు అలాగే వేశారు. అయితే ఈయన 'నువ్వు -నేను' వరకూ కూడా కెపివి ప్రసాదరావు పేరునే కంటిన్యూ చేశారు గానీ, అందరూ 'వైజాగ్‌ప్రసాద్' అని పిలుస్తుండటంతో జంధ్యాలగారిని మనసులో తలుచుకుని ఇక ఆ పేరుకే ఫిక్స్ అయిపోయారు.

ఈ సినిమా నిమిత్తం ఆయన 516 రూపాయల పారితోషికమందుకున్నారు. ఈ సినిమా తర్వాత జంధ్యాల దర్శకత్వంలో 'మొగుడు పెళ్లాలు', 'ప్రేమ ఎంత మధురం', 'అఆ ఇఈ' చిత్రాల్లో కూడా నటించడం జరిగింది.

బాలకృష్ణ తాను సినిమా డైరెక్టర్‌నని, కొండమీద కెమెరా వుందని, మిమ్మల్ని చిత్రీకరిస్తామని అబద్ధమాడితే నమ్మేసి, 'అకితాబ్ బుచ్చన్'గా ఊహించేసుకుంటూ బైక్ మీద కూర్చొని ఫోజు కొడుతున్న ఈ ఎన్.ఐ. శ్యామసుందర్‌ని(అకితాబ్ బుచ్చన్) చూసి, తన టాక్సీ ఆపి పలకరించిన డ్రైవర్ మరెవరో కాదు నటుడు రాజేంద్రప్రసాద్! వేరే షూటింగ్ నిమిత్తం వైజాగ్‌లోనే వుండటంతో సరదాగా అతనితో ఈ చిన్న పాత్ర చేయించారు జంధ్యాల. ఈ ఒక్క సీన్‌లో మాత్రమే కనబడే ఈ పాత్రకి వేరే ఎవరో డబ్బింగ్ చెప్పారు. జంధ్యాల దర్శకత్వంలో రాజేంద్రప్రసాద్ నటించిన తొలి సినిమా ఇదే. ఈ సినిమా రిలీజైన ఏడాదికే రాజేంద్రప్రసాద్ హీరోగా జంధ్యాల 'రెండురెళ్ళు ఆరు' సినిమా రూపొందించారు.

ఇందులో సుత్తివేలుది విచిత్రమైన



పాత్ర. ఈయన గారు మహా బి.పి. మనిషి. ఎవరైన ఎదురు చెప్పినా, సలహాలిచ్చినా కోపం నషాళానికి ఎక్కుతుంది. బైటివాళ్ళమీద తన కోపం ప్రదర్శిస్తే బాగోదు కనుక, ఛోటా అనే ఓ మోటా పర్సన్‌ని అసిస్టెంట్‌గా పెట్టుకుని అతన్ని చితకబాదుతూ కోపాన్ని కంట్రోల్ చేసుకుంటుంటాడు. ఈ చితకబాదుడు వ్యవహారం కూడా రోజుకి మూడుసార్లు మాత్రమే. డోసు పెరిగితే ఆ ఛోటా రివర్స్‌లో వేలుని ఉతికి ఆరేస్తుంటాడు.

చాలామందికి తెలీని విషయం ఒకటుంది. ఈ సినిమాలో 'బాబాయ్' పాత్రకి తొలుత సుత్తివేలుని అనుకున్నారు. "వరుసగా ఎక్కువ రోజులు డేట్స్ అడిగారు. నాలుగైదు సినిమాలకి కమిట్‌మెంట్స్ వున్నాయి. అలా డేట్స్ కుదరక బాబాయ్ పాత్ర చేజారిపోయింది. చివరికి వీరభద్రరావు గారు ఆ పాత్రను పోషించారు. జంధ్యాల గారికి ఆ వేషం వేయలేదని నా మీద కోపం వచ్చినట్టుంది. అందుకే ఇందులో నాకు కోపిష్టి పాత్రనిచ్చారు. ఆవేశమొస్తే కొట్టడానికి అసిస్టెంట్‌ని పెట్టారు" అని గుర్తు చేసుకున్నారు సుత్తివేలు.

వైజాగ్ సముద్రానికి ఎదురుగా వున్న 'ఓషన్‌వ్యూ ఇన్' హోటల్‌లో ప్రముఖ

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| బేనర్ | : | ఉషోదయా మూవీస్ |
| పాటలు | : | వేటూరి సుందరరామ్మూర్తి |
| నేపథ్యగానం | : | బాలు, జానకి, రమేష్, అనితారెడ్డి, శ్రీనివాసచక్రవర్తి |
| సంగీతం | : | చక్రవర్తి |
| సహాయకులు | : | కృష్ణ-చక్ర |
| మేకప్ | : | ఎ.సి.రాజు,హరి, సత్యం |
| హెయిర్‌డ్రస్సర్ | : | చైనా సుబ్బారావు |
| కాస్ట్యూమ్స్ | : | కొండయ్య |
| అసోసియేట్ ఎడిటర్ | : | ఎస్. సత్తిబాబు |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : | మాణిక్యం, చిరంజీవి, రాంబాబు |
| అకౌంటెంట్ | : | నాగేంద్రరావు |
| పొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ | : | ఎ.పి. స్వామి, జయబాబు |
| స్టిల్స్ | : | రాజశేఖర్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : | సింధూర్ |
| పబ్లిసిటీ ఇన్‌ఛార్జ్ | : | నరసింహం |
| రికార్డ్స్ | : | సప్తస్వర్ |
| డైలాగ్ రికార్డింగ్ | : | శేఖర్ |
| రికార్డింగ్ -రీ- రికార్డింగ్ | : | ఏ.ఆర్. స్వామినాథన్ |
| అవుట్‌డోర్ యూనిట్ | : | శ్రీసారథి స్టూడియోస్, హైదరాబాద్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : | బి.ఎస్.నిష్టల, బత్తుల రామకృష్ణ |
| అసిస్టెంట్స్ డైరెక్టర్ | : | జె. పుల్లారావు |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : | దివాకర్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : | వై. ప్రకాష్ |
| ఎడిటింగ్ | : | భాస్కరరాజు |
| కళ | : | భాస్కరరాజు |
| సహాయకుడు | : | రామచంద్రసింగ్ |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : | ఎస్.గోపాలరెడ్డి |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : | కె. కృష్ణకుమార్ రెడ్డి |
| నిర్మాత | : | ఎస్.సుధాకర్‌రెడ్డి |
| రచన - దర్శకత్వం | : | జంధ్యాల |

అ : తెలుసా.... నీకు తెలుసా....
ప్రేమంటే ఒకే మనిషి నివసించే భువనమని
ఒకే మురళి పలికే గోకులమని
ఒకే కెరటముప్పొంగే యమున అని
అదే అదే నా జీవమని గానమని... మౌనమని ॥తెలుసా॥
అ : శీతగాలి వీచినపుడు లేత ఎండలా
ఆ : ఎండ కన్ను సోకినప్పుడు మంచు కొండలా
అ : ఆదుకునే వెచ్చని మమత
ఆ : ఆవిరయే చల్లని ఎడద
అ : ఒకటే శ్రుతి.. ఒకటే లయ.. ఒకటే స్వరము
ఆ : ఉన్న రాగమొకటే అదే అదే అనురాగమని
ఆ : మౌనయోగమని ప్రేమదీపమని... ॥తెలుసా॥
ఆ : శరత్కాల నదులలోని తేట నీటిలా...
అ : పుష్య మాస సుమదళాల తేనె వాకలా
ఆ : సుప్రసన్న సుందరకవితా
అ : సుప్రభాత మరంద గుళిక
ఆ : ఒక పార్వతి ఒక శ్రీసతి ఒక సరస్వతీ
అ : ఉన్న మంత్రమొకటే అదే అదే మమకారము
ఆ : సృష్టికారణం బ్రహ్మకు జననం ॥తెలుసా॥

# 'బాబాయ్ -అబ్బాయ్ 'లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్

- హోటల్ సర్వర్ :అక్కడ ఇద్దరున్నారే. ఇవన్నీ వాళ్లకే. ఒకడు... పది గ్రామాల్ని దత్తత తీసుకుని కడుపులో దాచుకున్నట్టు, ఇంకొకడు.. కడుపులో శరణార్థుల శిబిరం పెట్టినట్టు, తెగ మేస్తున్నారు. ఏం చెప్పమంటారు నా బాధ.
- బాలకృష్ణ : బాబాయ్ ! దోసె మాత్రం మహా గొప్పగా వుంది. అడవిరాముడే అనుకో.
  వీరభద్రరావు : అబ్బాయ్ ! వడ శంకరాభరణమే.
  సర్వర్ : (మరిన్ని టిఫిన్ ప్లేట్లతో వస్తూ...) వేటగాడిని , కొండవీటి సింహాన్ని , ప్రేమాభిషేకాన్ని, ఖైదీనీ కూడా తెచ్చాను.
- బాలకృష్ణ:అత్తయ్యగారూ... హైదరాబాద్ నుండి ఆ మధ్య మా ఫ్రెండ్ ఒకడు ఇక్కడకు వచ్చాడు.... మీరు చూశారా...?
  వీరభద్రరావు:చూశార్లేబ్బాయ్... ముందు వాళ్లకు విషయం చెప్పేయ్...
  బాలకృష్ణ: వాడు ఇక్కడకు వచ్చినప్పుడు మన సుందరిని చూశాడు... ఊరు వెళ్లిన దగ్గర్నుండీ మంచం ఎక్కాడంట.
  వీరభద్రరావు: దడుసుకుని అనుకునేరు... ప్రేమలో పడి..
  శ్యామల : అమ్మో... ఏంటో నాకు సిగ్గేస్తున్నట్టుగా ఉందే...
  నిర్మలమ్మ: అవునమ్మో... ఇది సిగ్గే.. నువ్ ఊరుకో....
- వీరభద్రరావు : అమ్మాయి ఫోటో ఒకటి తీసి ఇవ్వండి. వాళ్ల ఊళ్లో మంకీ ఎగ్జిబిషన్ ఒకటి జరుగుతుందట. అక్కడ కనీసం ఫోటో అయినా పెట్టాలని తాపత్రయ పడుతున్నాడు.
  నిర్మలమ్మ: అలాగే బాబూ... ఇప్పుడే తీయిస్తా.
- వీరభద్రరావు : "శ్రీకృష్ణదేవరాయలు వంటి మహారాజు, కళాహృదయుడు తన మహామంత్రికి 'అప్పాజీ' అని పేరు పెట్టుకున్నాడంటే... అప్పు ఎంత విలువైనదో గ్రహించండి. ఇంగ్లీష్‌లో కూడా 'డౌన్' కంటే 'అప్' ఉన్నతమైనదా, కాదా?
- వీరభద్రరావు : మిత్రులారా.... నా ఆంతరంగిక అప్పాజీల్లారా...
- వీరభద్రరావు : వద్దూ... జాలర్ల గాలం హుక్కులాగా అలా లుక్కివ్వకు. ఇప్పటికే ఒళ్లంతా వాచింది.. అలా చూస్తే వాంతి అయ్యి లోపలకూడా పూస్తుంది.
- అనితా రెడ్డి : ఏం చేస్తుంటారు మీరు
  బాలకృష్ణ: భోంచేస్తుంటాను, నిద్రపోతుంటాను.
  అనితా రెడ్డి : ఇంతకి ఏం చదువుకున్నారు?
  బాలకృష్ణ: కప్‌ని తిరగేస్తే మీకేం అర్థమవుతుంది.?
  అనితా రెడ్డి : ఓ... పియుసి నా.
- వేలు : ఏమిటోయ్ నీ పేరు బాలా? బ్యాటా?
- సేట్: పైకి వెళ్లి చూద్దాం పదండి. క్షవర కళ్యాణం చేద్దాం.
  శ్యామల : అమ్మో ! 'కళ్యాణం' అంటున్నారే నాకు సిగ్గేస్తుంది బాబు.
- వీరభద్రరావు : అసలు మన భారతదేశానికి తల మీద మంచు కొండలు ఉండటంతో కాస్తో కూస్తో రంగు తేలతారు కానీ... అత్తయ్య గారూ... అసలు నలుపు ఎంత అందమని... కృష్ణుడు నల్లగా ఉండడూ...
  నిర్మలమ్మ: ఏమిటో... ఎండలో కూర్చోవద్దే అంటే కూర్చుంటుంది.... చిన్నప్పుడు పచ్చగా మెరిసిపోతూ ఉండేది.
  వీరభద్రరావు : ఆఁ... ఏం మెరుపోలెండి... అదేమన్నా శాశ్వతమా... గాంధీ గారు తర్వాత గాంధీ గారంతటి వాడు లూథర్‌కింగ్ నల్లగా ఉండడా... ఆఫ్రికన్ నల్లగా ఉండడా.... చింపాజీ నల్లగా ఉండదా....
  నిర్మలమ్మ: మరే ఉన్నమాట అన్నావ్...నీ నోట్లో కిలో పంచదార కుక్కాలి.
  వీరభద్రరావు : మన సుందరి గారి ఫోటో ఒకటి తీయించండి. ది బార్బేరియన్స్ అని.. ది అగ్లియస్ట్ అని అమెరికాలో రెండు పోటీలు జరుగుతాయి. మన సుందరి గారు ఫోటో పెట్టి పంపించామంటే అక్కడి జడ్జీలు దడుసుకుని చస్తారు... ప్రైజు ఇచ్చి తీరతారు...
  నిర్మలమ్మ: బాబూ... అదెప్పుడో కాస్త కనుక్కో..
- వీరభద్రరావు: మీరు వైద్యుడా...?
  భూతవైద్యుడు : అవునండీ.. భూత వైద్యుడునండీ...
  వీరభద్రరావు : ఆహాహా... అప్పిచ్చువాడు వైద్యుడు అన్న సుమతీ శతకకారుడు ఎంత గొప్పవాడండీ...
  భూతవైద్యుడు : ఇంతకీ మీరు...
  వీరభద్రరావు: దేశభక్తి వీరభద్రాన్ని... ఒక భారత పౌరుడిగా దేశభక్తి కలిగిఉండటం తప్పంటారా...
  భూతవైద్యుడు : అబ్బెబ్బె... తప్పెలా అవుతుందండీ...
  వీరభద్రరావు: అన్నారా.... అయితే దొరికిపోయారన్నమాటే... నా తర్రై..
  భూతవైద్యుడు : ఆటో.. ఆపు...
  వీరభద్రరావు: వద్దు బాబూ... మాక్కాస్త పని ఉంది నువ్వు వెళ్లు... వెళ్లు.. ఆటోలకేముందండీ.. అరక్షణానికొకటి వస్తుంది. మన భారతదేశం చేసిన పనే మనమూ చేయటం తప్పుకాదుకదా...మన దేశం అహింసను పాటిస్తే మనమూ పాటిస్తాం... మన దేశం క్రమశిక్షణ పాటిస్తే మనమూ అనుసరిస్తాం... ఇప్పుడు మన దేశం ఏం చేస్తోంది...? పరాయి దేశాలనుంచీ వీర లెవల్లో అప్పులు చేస్తోంది. ఆగండి... ఆగండి... ఈ ఏడాది ప్రపంచబ్యాంకుకు హెచ్చు మొత్తంలో బాకీ ఉన్న దేశాల్లో మొదటిది భారతదేశం అయితే రెండోది బెల్జియం. అంచేత అప్పు చేయటం తప్పు చేయటం కాదు. అసలా మాటకొస్తే అప్పు చేయటం భారతీయుడి జన్మహక్కు. ప్రథమ కర్తవ్యమూనూ...
  భూతవైద్యుడు : ఆటో.. ఆటో....
  వీరభద్రరావు : అవును అది ఆటోయే... టాక్సీ కాదు... ఆటో నువ్వు వెళ్లు... మీరు భూత వైద్యుడు కదా... పంచభూతాలు ఏమిటో చెప్పండి..
  భూతవైద్యుడు : అయ్యో... పంచభూతాల సంగతి నాకు తెలియదు కానీ... ఇప్పుడు నాకు ఫొంటే భూతం ఒక్కటే కన్పిస్తుంది.
  వీరభద్రరావు : నీ సెన్సాఫ్ హ్యూమర్‌కి నిప్పెట్ట... బూతు జోకులు వేయకండి మాస్టారు.. అసలు పంచభూతాలు ఏమిటి? పృథివ్యాపస్తేజోవాయురాకాశః... పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశం... అలా అప్పు అనేది మన పవిత్ర పంచభూతాల జాబితాలో ఉంది. ఏషియాడ్‌లో మన గుర్తు గున్న ఏనుగు పేరు ఏమిటి?..... అప్పు... మన వైజాగ్‌లో ఉన్న సింహాచలం దేవుడి పేరు ఏమిటి?... సింహాద్రి అప్పన్న ...
  భూతవైద్యుడు : ఆటో... ఆగు.. ఇతను వెళ్లిపొమ్మంటాడు... అయినా వెళ్లొద్దు... అమ్మమ్మ... ఇంకో గంటసేపు నేను ఇక్కడే ఉంటే... నేనే వేరే భూతవైద్యుడి దగ్గరకు వెళ్లి దడుపు మంత్రం పెట్టించుకోవాల్సి ఉంటుంది. ఇదిగో నాయనా... నా దగ్గర ఉన్న మొత్తం సొమ్ము ఇచ్చేస్తున్నాను... నన్ను వదిలేయ్ ...
- వేలు : ఈ డబ్బుకో తమాషా గుణం వుంది. వంద రూపాయలు వున్నవాడు ఖర్చుపెడితే వందా పోతుంది. అదే లక్షరూపాయలు వున్నవాడు ఖర్చుపెడితే ఏదో ఒక రూపంలో డబ్బు వస్తూనే వుంటుంది.
- వేలు : డబ్బు పెరిగినా, జబ్బు పెరిగినా ఆ తేడా ముఖంలోనే తెలుస్తుంది.
- రేసుల్లో పెట్టిన డబ్బు... గోడకు కొట్టిన సున్నం తిరిగిరావు.... చెట్టు పెరిగేకొలదీ గాలి తాకిడి ఎక్కువవుతుందయ్యా...
- వీరభద్రరావు : నా జబ్బంత లేదు... వాడు జబ్బరా!



తారాగణమంతా మకాం చేశారు. ఈ హోటల్‌లోనే సుత్తివేలుని ఉతికి ఆరేసి దండానికి వేలాడదీసే సీన్ తీసారు. ఆ హోటల్ ఆవరణలో కొబ్బరిచెట్లు చాలా వున్నాయి. అక్కడే ఈ సీన్ తీశారు. నా వంటి నిండా నవారు చుట్టేసి చేతులకు తాళ్ళు కట్టి దండానికి వేలాడదీసారు. ఆ షాట్ చేస్తున్నంతసేపు ఏసుప్రభువులా ఫీలయ్యాను. నవారు వంటికి బిగుసుకుపోయి నేను నరకయాతన అనుభవించాను'' అని చెప్పారు సుత్తివేలు ఆ సంఘటన గురించి.

వేలు దగ్గర తన్నులు తినే అసిస్టెంట్‌గా నటించిన బడావ్యక్తి పేరు 'రాజు'. వైజాగ్ షిప్‌యార్డ్‌లో డ్రైవర్‌గా పనిచేసే ఇతన్ని అందరూ 'దిబ్బరాజు' అని ముద్దుగా పిలుచుకుంటారు. నటన మీద ఆసక్తి లేకుండానే నటుడైపోయాడు రాజు. 'ముద్దమందారం'లో ప్రదీప్, పూర్ణిమ పారిపోతూ ఓ కారు ఎక్కుతారు. ఆ కారుడ్రైవర్‌గా కీచుగొంతుతో మాట్లాడిన వ్యక్తే ఈ 'రాజు.' 'బాబాయ్ అబ్బాయ్'లో వేలు అసిస్టెంట్‌గా భారీ పర్సనాల్టీ కావాలనుకున్నప్పుడు జంధ్యాలకు ఈ రాజే గుర్తుకొచ్చాడు సుమండీ.

సినిమా చూస్తే చాలు ఘొల్లున ఏడుస్తూ ఇంటికి వచ్చి తల్లితో పాటు తిరిగి ఏడ్చే శ్రీలక్ష్మి

## కథాంశం

అతివృష్టి వల్ల అనాథగా మారిన 'బాల' అనే అబ్బాయ్, అనావృష్టి వల్ల బికారిగా మారిన బాబాయ్‌లు ఆకలి పుణ్యమా అంటూ స్నేహితులుగా మారతారు. ఉద్యోగాల్లేక తిండికి నానా ఇబ్బందులు పడుతుంటారు. దాంతో జనాల్ని తెలివిగా బురిడీ కొట్టేస్తూ బ్రతికేస్తుంటారు. ఓ యాక్సిడెంట్ మూలంగా బాలకి కృష్ణవేణి అనే సంపన్నురాలితో పరిచయం అవుతుంది. ఆ పరిచయం కాస్తా ప్రణయంగా మారుతుంది. తన కూతురితో పెళ్ళి జరగాలంటే తాను పెట్టే పరీక్షలో నెగ్గాలంటాడు కృష్ణవేణి తండ్రి ప్రసాదరావు. ఓ పాతిక లక్షల్ని నెలరోజుల్లోగా దానం చెయ్యకుండా, ధ్వంసం చేయకుండా న్యాయమార్గంలో ఖర్చు పెట్టాలని షరతులు విధిస్తాడు. డబ్బు సంపాదించడం కష్టంగానీ ఖర్చుపెట్టడం ఎంతసేపు? అని పందెం వేస్తాడు బాల. పాతిక లక్షలు ఖర్చుపెట్టడానికి బాబాయ్, అబ్బాయ్‌లు నానా అవస్థలు పడతారు.ఎంత ఖర్చు పెడితే అంతకు రెట్టింపై తిరిగి వచ్చేస్తూ వుంటుంది. ఈలోగా దూరపు బంధువులెవరో పోయి ఆస్తి కూడా కలిసొచ్చేస్తుంది. వీటన్నిటితో బాలకు పిచ్చెక్కిపోతుంది. డబ్బుని, సౌకర్యాలని భరించలేక పోతాడు. పందెంలో ఓడిపోయానని చెప్పటానికి నిశ్చయించుకుంటాడు. అటువంటి సమయంలో ప్రసాదరావు వచ్చి 'నువ్వు మోసగాడివే అయితే నేనిచ్చిన డబ్బుతో పారిపోయేవాడివి. అలా కాకుండా సక్రమైన మార్గంలో ఖర్చుపెట్టడానికి ప్రయత్నించావు. ఇక్కడే నువ్వు నాకు నచ్చావు. మా అమ్మాయినీ, ఆస్తినీ జాగ్రత్తగా చూసుకోగలవనే నమ్మకాన్ని నాలో కలిగించావు' అంటూ తన కూతుర్నీ, ఆస్తిని బాల చేతిలో పెట్టేసి కథను సుఖాంతం చేస్తాడు.

ఎపిసోడ్ పగలబడి నవ్వేలా చేస్తుంది. ఓసారి శ్రీలక్ష్మి పక్క సీట్‌లో కూర్చుని సినిమా చ ూ న వ్వాం టా డ ం వీరభద్రరావు. సినిమాలో ఎన్‌టిఆర్ చనిపోవడంతో సడన్‌గా లేచి ఏడ్చుకుంటూ బైటికి వెళ్ళిపోతుంది శ్రీలక్ష్మి. ఆమెని ఏదో చేసుంటాడని తప్పుగా అర్థంచేసుకుని ఇతర ప్రేక్షకులు వీరభద్రరావుని చితక బాదుతారు. అలా..అలా.. శ్రీలక్ష్మి మీద మనసు పారేసుకుని తనదాన్ని చేసుకుంటాడు వీరభద్రరావు.



ఉషోదయ మూవీస్ చిత్రం ప్రారంభ సమయంలో జంధ్యాల, భాస్కరరాజు, గోపాలరెడ్డి, సుధాకరరెడ్డి, బాలకృష్ణ, అనితారెడ్డి

శ్రీలక్ష్మి తన పాత్ర గురించి వివరిస్తూ -" సినిమా చూస్తూ సంతోషం కలిగినా, దుఃఖం వచ్చినా ఓవర్ రియాక్ట్ అయిపోయి తలుచుకుని తలుచుకుని మరీ ఏడ్చే పాత్ర నాది. నేను ఏడుస్తూ ప్రేక్షకుల్ని నవ్వించ గలగడమనేది నిజంగా కష్టసాధ్యవే. జంధ్యాల గారు నర్వనమర్థులు కాబట్టి దేన్నైనా ఈజీగా చేయించగలరు. కన్నీళ్లు రావడం కోసం గ్లిజరిన్ కళ్లలో పోసుకుని పోసుకుని చివరికి కళ్లు వాచిపోయేంత పరిస్థితి ఏర్పడింది. నిర్మాత అయితే 'గ్లిజరిన్ ఫ్యాక్టరీ కట్టించమంటారా' అంటూ చమత్కరించారు కూడా'' అని చెప్పుకొచ్చారు.

సీనియర్ నటి నిర్మలమ్మది ఈ 'బాబాయ్ అబ్బాయ్' ల ఇంటి ఓనరు పాత్ర. ఈవిడగారి ముద్దుల కూతురు సుందరిగా పావలా శ్యామల కనిపిస్తారు. ఇందులో శ్యామల సీనియర్ బ్రహ్మచారిణి. 'కళ్యాణం' అనే మాట వినగానే తెగ ఇదైపోతుందామె. నల్లగా ఉన్న తన కూతురి కోసం కనిపించిన ప్రతి మగాణ్ణీ 'పెళ్ళయిందా' అని నిర్మలమ్మ అడగడం, ఆవిడలా అడిగినప్పుడల్లా 'అమ్మా నాకు సిగ్గేస్తున్నట్టుందే' అంటూ శ్యామల వంకర్లు తిరగిపోవడం, 'అవునమ్మా దాన్ని



సొమ్ము పెంచకు బాబయో..
సొమ్మసిల్లకు అబ్బయో...
సొమ్ము పెంచకు బాబయో..
సొమ్మసిల్లకు అబ్బయో...
పెరిగిపోతే పైకం
ఎదుగుతుంది మైకం
బాబయో... అబ్బయో.... ॥సొమ్ము॥
నల్లడబ్బుని దాచడానికి గుడ్డిగా నమ్మాలి
నానా గడ్డి కరవాలి
ఎందరి కాళ్లో పట్టాలి
తెల్ల డబ్బుపై హక్కు కోసం మొక్కలు వెతకాలి
ఎన్నో ట్రిక్కులు చేయాలి
టాక్సులు తక్కువ కట్టాలి
కుప్ప తెప్పలుగా చెరువు నిండితే
కప్పలు చేరుట ఖాయం
అప్పనంగా వచ్చిన సొమ్ము
నిప్పు పెట్టడం ఖాయం
చెలిమికి చేసి పోవురా గాయం
యూయం యూయం మయం మయం ॥సొమ్ము॥


పావలా శ్యామల, నిర్మలమ్మ

సిగ్గనే అంటారు' అంటూ నిర్మలమ్మ కన్ఫర్మ్ చేయడం భలే కామెడీ ఎపిసోడ్.

జంధ్యాల -రచయిత ఆదివిష్ణుల అనుబంధం గురించి ఇంతకుముందే మనం చెప్పుకున్నాం. సందర్భం కుదిరినప్పుడల్లా ఏదో ఒక సన్నివేశంలో ఆయన పేరుని ఇరికిస్తూంటారు జంధ్యాల. ఇందులో బాలకృష్ణ, వీరభద్రరావులు అద్దె ఎగ్గొట్టడం కోసం నిర్మలమ్మతో ఓ అబద్ధమాడతారు. నిర్మలమ్మ కూతురు శ్యామలను వీళ్ళ స్నేహితుడు తొలి చూపులోనే ప్రేమించాడట. ఆ స్నేహితుడు ఆర్‌టిసిలో పెద్ద ఆఫీసరు. పేరేమో ఆదివిష్ణు విఘ్నేశ్వరరావు. ఇది మన రచయిత ఆదివిష్ణు పూర్తిపేరు. తన ఇంటిపేరుతోనే ఆయన ప్రాచుర్యం పొందారన్న విషయం, ఎపిఎస్ఆర్‌టిసిలో ప్రజాసంబంధాల అధికారిగా పనిచేసారన్న సంగతి చాలామందికి తెలిసిన విషయమే.

ఇలా జంధ్యాల తన మిత్రబృందం పేర్లు ఉపయోగించుకుని అప్పుడప్పుడు చిలిపిపనులు చేస్తుంటారు. తన దగ్గర అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్న బత్తుల రామకృష్ణను కూడా ఆయన వదిలి పెట్టలేదు. ఇవివి సత్యనారాయణతో 'నాలుగు స్థంభాలాట' లో విధి వేషం వేయించిన జంధ్యాల, ఇందులో బత్తుల రామకృష్ణని దర్శకుడిగా చూపించారు. అదెలాగంటే -


పొట్టిప్రసాద్

బాలకృష్ణ, వీరభద్రరావులు పాతికలక్షల్ని ఎలాగైనా ఖర్చుపెట్టే ప్రయత్నంలో 'చేతికి చిప్ప' అనే ఓ ఫ్లాప్ సినిమా కొంటారు. ఆ సినిమా వాల్‌పోస్టర్స్‌లో దర్శకుడిపేరు బత్తుల రామకృష్ణ అని వుంటుంది. గమనించండి.

ఈ 'చేతికి చిప్ప' నిర్మాతగా పొట్టిప్రసాద్ కనిపిస్తారు. సినిమా తీసి....తీసి చివరికి అమ్ముకోలేక పిచ్చివాడై పోతాడు. బాలకృష్ణ, వీరభద్రరావులని జేమ్స్‌బాండ్‌లా అనుసరిస్తూ వాళ్ళని అనవసరంగా టెన్షన్ పెడుతుంటాడు. చివరికి క్లైమాక్స్‌లో పిచ్చాసుపత్రివాళ్ళకి దొరికిపోతాడు.

బాలకృష్ణ -వీరభద్రరావుల మేనేజర్ జంబులింగంగా నత్తిబాబుది మంచి కార్టూన్‌లాంటి పాత్ర. కొంచెం గాలి వీచినా దబ్‌మని పడిపోయే నత్తిబాబు, ఒకానొక సమయంలో జబ్బర్ అనే గజదొంగ అని తెలిసాక మనకి నవ్వు ఆపుకోవడం చాలా కష్టమవుతుంది.

పాడుతా తీయగా (ఈటీవి), ఎందరో మహానుభావులు (జెమినీ టీవీ), పాడాలని ఉంది (మాటీవీ) కార్యక్రమాల దర్శకుడు ఎన్.బి.శాస్త్రి ఒకప్పుడు జంధ్యాలకి అసిస్టెంట్‌గా పనిచేసారు. బాలకృష్ణ కారు యాక్సిడెంట్ చేసి నష్ట పరిహారంగా డబ్బిద్దామనుకుంటే, 'ఆ యాక్సిడెంట్ వల్ల మా నాన్నకి తిరిగి మాటొచ్చింది సార్... కృతజ్ఞతగా ఈ పదివేలూ ఉంచండి,' అని చెప్పే వ్యక్తిగా నటించారాయన.

ఈ సినిమా షూటింగ్ సమయంలో చిన్నా, పెద్దా కలిపి సుమారు 22 యాక్సిడెంట్లు జరిగాయి. అందులో ప్రధానమైనది అనితారెడ్డి తనకారుతో బాలకృష్ణను ఢీ కొట్టడం. అనితారెడ్డికి అస్సలు కారు డ్రైవింగ్ తెలియదు. ఈ సీన్ కోసమని ఒక రోజు డ్రైవింగ్ నేర్చుకుందామె. తీరా సీన్ తీస్తున్నప్పుడు కంగారులో బ్రేక్ వేయబోయి యాక్సిలేటర్ నొక్కడంతో కారు బాలకృష్ణని బలంగా గుద్దింది. దాంతో ఆయన గాలిలో పల్టీలు కొట్టారు. కొద్దిపాటి గాయాలు తగిలాయి కూడా. ఎఫెక్టివ్‌గా ఉందని సినిమాలో ఆ సీన్‌ని అలాగే ఉంచేసారు.

ఆ యాక్సిడెంట్ సీన్‌లో బాలకృష్ణ గాయపడటం జరిగింది. ఆ విషయం తనకు ముందే తెలుసునంటారు బాలకృష్ణ. "ప్రమాదం జరిగే ముందు రోజున నా మిత్రులతో మాట్లాడుతూ నాకు ఏదో జరగబోతుంది అని అన్నాను. ఆ మిత్రులు వైజాగ్ చుట్టుపక్కల ప్రదేశాలు చూసి తిరిగి రెండవరోజు వైజాగ్ వచ్చేనరికి నేను హాస్పటల్‌లో వున్నాను" అని అప్పట్లోనే చెప్పారు బాలకృష్ణ.


అనితారెడ్డి

మరో సీన్‌లో కూడా అనితారెడ్డి ఇలాంటి పొరపాటే చేసింది. వైజాగ్‌లోని ఆంధ్రా యూనివర్శిటీకి ఎదురుగా గల కాలనీలో షూటింగ్ చేస్తున్నారు. కూరగాయల బండిని కారుతో డాష్ కొట్టాలి. ఇంతకుముందు ప్రమాదాన్ని దృష్టిలో పెట్టుకుని ఆమె ఈ సీన్ చేయడానికి తెగ భయపడిపోయింది. జంధ్యాల ధైర్యం చెప్పి పంపించారు. పాపం ఈ సీన్‌లో కూడా అనితారెడ్డి పొరపాటున నిజంగానే కూరగాయల బండిని గుద్దేసింది. దాంతో ఆ కూరగాయల బండి తుక్కుతుక్కయిపోయింది. ఈ సీన్‌ని కూడా జంధ్యాల రియల్‌గా సినిమాలో ఉపయోగించుకోవడం జరిగింది.

అలాగే వైజాగ్‌ప్రసాద్ చేసిన యాక్సిడెంట్ గురించి ముందే చెప్పుకున్నాం. ఇలా ఈ సినిమా యాక్సిడెంట్లుపరంగా కూడా ఆర్టిస్టులకి బాగా గుర్తుండిపోయింది.

అలాగే ఈ చిత్రం క్లయిమాక్స్‌లో బాలకృష్ణ గుర్రంమీద దౌడు తీస్తుంటారు. ఆ గుర్రం వైజాగ్‌లో సుప్రసిద్ధులైన వైద్యులు సదాశివరావుగారిది. బీచ్‌రోడ్డులో సన్నివేశాన్ని చిత్రీకరిస్తున్నారు. గుర్రం ఒకవైపుకి వెళ్తుంటే, బాలకృష్ణ మరో వైపుకి కళ్లెం విదిల్చారు. దాంతో పట్టుతప్పి అటు గుర్రం, ఇటు బాలకృష్ణ పడిపోయారు. చిన్న పాటి దెబ్బలతో గండం తప్పిపోయింది.

ఇక ఈ చిత్రం హీరోయిన్ అనితా రెడ్డి గాయనిగా తొలుత పరిశ్రమకు పరిచయం అయింది. మొదట్లో ప్రఖ్యాత గాయకుడు జేసుదాసుతో కలిసి పాట కచ్చేరిల్లో పాల్గొని ఆ తర్వాత పాప్ సింగర్‌గానూ, అటుపై నటిగానూ పరిచయమైంది అనితారెడ్డి. ఈ సినిమా కన్నా ముందే 'శ్రీవారి శోభనం' కోసం ఆమెను కథానాయికగా ఎంచుకున్నారు జంధ్యాల. అయితే మొదట రిలీజైన సినిమా మాత్రం 'బాబాయ్ అబ్బాయ్'నే. 1985 లో హీరో సురేష్‌ని పెళ్ళిచేసుకుని సినిమాల్లో నటించడం మానేశారు. ఆ తర్వాత సురేష్, అనితారెడ్డి విడిపోయారను కోండి. ఇక్కడ మనకది అప్రస్తుతం.

ఇందులో మొత్తం ఐదు పాటలున్నాయి. ముఖ్యంగా ఓ పాట గురించి ప్రత్యేకంగా ప్రస్తావించుకోవాలి. 'సొమ్ము పెంచకు బాబయో' పాటను మాధవపెద్ది రమేష్, బాలు కలిసి ఆలపించారు. కొంతమందికే తెలిసిన విషయమేమిటంటే - ఈ పాటలో రమేష్

స్వయంగా తన బాబాయ్ మాధవపెద్ది సత్యం గొంతును అనుకరించి, మొత్తం పాటను అదే బాణీలో పూర్తి కావించారు.

ఈ ఆసక్తికరమైన అంశం గురించిన పూర్తి వివరాలు రమేష్ తమ్ముడైన మాధవపెద్ది సురేష్‌నడిగితే - "అన్నయ్య రమేష్, జంధ్యాల ఇద్దరూ ఒకటో తరగతి నుండి ఎస్సెల్సీ దాకా క్లాస్‌మేట్స్. తర్వాత విజయవాడ ఎస్సారార్ అండ్ సిబిఆర్ గవర్నమెంట్ కాలేజ్‌లో కలిసి డిగ్రీ చదువుకున్నారు. రమేషన్నయ్యకి మిమిక్రీ అంటే చాలా ఇష్టం. అవకాశం దొరికినప్పుడల్లా బాబాయ్ మాధవపెద్ది సత్యంను అనుకరిస్తుండేవాడు. ఎస్.జానకి గారితో కలిసి అమెరికా ప్రోగ్రామ్స్‌కి వెళ్లినప్పుడు అన్నయ్య, సత్యం బాబాయ్‌ని ఇమిటేట్ చేస్తూ 'వివాహభోజనంబు' మొదలైన పాటలు పాడుతుంటే అక్కడి శ్రోతలు ఉర్రూత లూగిపోయేవారట.

ఇవన్నీ జంధ్యాలకు బాగా తెలుసు. అందుకే 'బాబాయ్ - అబ్బాయ్' లో ఈ పాటని ప్లాన్ చేసినప్పుడు తమాషాగా సత్యంగారి వాయిస్‌తో పాడించాలనుకున్నారు. అన్నయ్య ఈ పాట పాడుతుంటే రికార్డింగ్ టైమ్‌లోనే జంధ్యాల, బాలు, చక్రవర్తి, నుత్తి వీరభద్రరావు మహదానందపడిపోయారు. మాధవపెద్ది సత్యం గారిది విలక్షణమైన కంఠస్వరం. ఆయన్ని అనుకరించటం చాలా కష్టం. అయితే ఆయన రక్తసంబంధీకులం కాబట్టి అన్నయ్యకి ఇమిటేషన్ ఈజీ అయ్యింది. నేను గాయకుణ్ణి కాదు కానీ, అప్పుడప్పుడూ ఆయన్ని అనుకరించే ప్రయత్నం చేస్తుంటాను.

అయితే ఎక్కువగా ఆ ప్రయోగాన్ని నా మిత్రుడైన 'హాసం' రాజా మీద చేస్తుంటాను. తన సెల్‌ఫోన్‌కి రింగ్ చేసి ఏదైనా పద్యంలో 'రాజా' అని వస్తే దాన్ని బాబాయ్ ఎలా పాడతాడో ఆ స్టయిల్‌లో సాగదీసి పాడుతుంటుంటాను. ఇది మా ఇద్దరికే పరిమితమైన విషయం. ఇక అన్నయ్య విషయంలోకి వస్తే - తను ఇలా బాబాయ్‌ని అనుకరిస్తూ సినిమాల్లో పాడటమనేది ఇదే మొదటిసారి, చివరిసారి కూడానూ. ఒకరకంగా చెప్పాలంటే అలా పాడే అవకాశం



కూడా మళ్లీ రాలేదు. అన్నయ్య పాడిన ఆ పాటను బాబాయ్‌కి వినిపిస్తే 'ఎప్పుడో నేనే పాడివుంటాను' అన్నారు మతిమరుపుగా. తర్వాత నేను అసలు విషయం చెబితే 'ఆరి భడవల్లారా! ఇలా కూడా నన్ను బతకనివ్వరా'' అంటూ తియ్యగా కసురుకున్నారు. బాబాయ్‌కి కూడా మిమిక్రీ అంటే చాలా ఇష్టంలెండి. ఇలా ఈ సినిమా టైటిల్‌కి తగ్గట్టుగా 'బాబాయ్' గొంతుని అనుకరిస్తూ 'అబ్బాయ్' పాడటమనేది చరిత్రలో గుర్తుపెట్టుకోదగ్గ అంశం'' అంటూ ఆ వివరాలను చెప్పుకొచ్చారు మాధవపెద్ది సురేష్.

ఉషోదయా మూవీస్ వారికిది తొలి చిత్రం. 1984 సెప్టెంబరు 7న విశాఖపట్నంలో ఈ చిత్రం నిరాడంబరంగా ప్రారంభమైంది. "భగవంతుడా! సక్సెస్ అయ్యేలా చూసే బాధ్యత నీదేనయ్యా" అని బాలకృష్ణ డైలాగ్ చెప్పడాన్ని ముహూర్తపు షాట్‌గా చిత్రీకరించారు. కళాదర్శకుడు భాస్కర్‌రాజు ప్రథమ క్లాప్ ఇవ్వగా, జంధ్యాల కెమెరా స్విచాన్ చేశారు.

ఈ సినిమా మొత్తం వైజాగ్ చుట్టుపక్కలే తీశారు. కొన్ని బీచ్‌హౌస్ షాట్స్ మాత్రం మద్రాసులో తీశారు.

బాలకృష్ణ -జంధ్యాల కాంబినేషన్‌లో ఇదే తొలి చిత్రం. ఆ తర్వాత వీరిద్దరూ కలిసి 'సీతారామ కళ్యాణం' సినిమా చేశారు. 'బాబాయ్ -అబ్బాయ్' జంధ్యాలకు 12వ చిత్రం కాగా, బాలకృష్ణకు20వ చిత్రం.

'బాబాయ్ - అబ్బాయ్' రిలీజ్ టైంలోనే 'వద్దంటే డబ్బు' సినిమాని మళ్లీ రిలీజ్‌చేశారట.

ఈ సినిమాలో చాలా తమాషాలు కనిపిస్తాయి. బాలకృష్ణ, వీరభద్రరావులు ఇంటి అడ్వాన్స్‌గా అరవైవేలు ఇవ్వగానే ఓనర్ ముఖంలో రంగులు మారడాన్ని జంధ్యాల చాలా తమాషాగా చిత్రీకరించారు. ఇలా చెప్పుకుంటూ పోతే చాలానే వున్నాయి.

ఇలా ఫస్ట్‌ఫ్రేమ్ టూ లాస్ట్ ఫ్రేమ్ వరకూ అందరూ ఎంజాయ్ చేసే విధంగా ఈ చిత్రాన్ని తనదైన శైలిలో తీర్చిదిద్దారు జంధ్యాల.

**- పులగం చిన్నారాయణ**

కూర్పు: టి. నవీన్-హైదరాబాద్

# సరిగపదమని



30

నవంబరు 5 దాశరథి వర్ధంతి సందర్భంగా...

## దాశరథి స్పెషల్



పంపినవారి పేరు :..............................................

వయసు :............ వృత్తి :..............................................

చిరునామా :..............................................

..............................................

..............................................ఫోన్ :..............................................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**అడ్డం:**

1. 'ఖుషీ ఖుషీగా ............చలాకి మాటలు రువ్వుతూ' ఇద్దరు మిత్రులు చిత్రంలోని గీతం (3)
2. 'మముగన్న మాయమ్మ అలివేలు ............' రంగుల రాట్నం చిత్రంలోని గీతం (3)
6. '.......... అనాదియు నీవే దేవా నింగియు నేలయు నీవే కావా' భక్తప్రహ్లాద చిత్రంలోని గీతం (2)
7. 'మంటలు ........ నెలరాజా ఈ తుంటరితనము నీకేలా' రాము చిత్రంలోని పాట (2)
9. 'నన్ను వదిలి నీవు పోలేవులే అది .............' మంచి మనసులు చిత్రంలోని పాట(4)
11. '........ పాలింపగ నడచీ వచ్చితివా' బుద్ధిమంతుడులోని పాట (2)
13. 'రావయ్యా ........నయ్యా నీ రాధ మనవి వినవయ్యా' రామరాజ్యం సినిమాలోని పాట (2)
14. గోరొంక గూటికే చేరావు........' దాగుడు మూతలులోని పాట(3)
15. '........ క్రిష్ణయ్యా ....... క్రిష్ణయ్యా దీనులను కాపాడ ....... క్రిష్ణయ్యా' (2)
19. 'నీవు రావు ..........రాదు నిలిచిపోయె ఈ రేయి' (3)
20. ' వేణుగానలోలుని గన..........కనులు చాలవులే (2)
21. 'కన్ను మూసింది ....... నిన్ను మరిచింది ....... నీ తోడు ఓ ప్రియతమా' మనుసులు మమతలు చిత్రంలోని పాట (2)

**నిలువు:**

1. '............ ఏ జాములో స్వామి నినుచేర దిగివచ్చునో' (4)
3. 'గోదారి గట్టుంది ........ మీద శెట్టుంది' (2)
4. 'తిరుమల ............ సుందరా సుమధుర కరుణా సాగరా' (3)
5. 'అందెను నేడే ......... జాబిల్లి నా అందాలన్నీ ఆతని వెన్నెలలే' (3)
8. 'అందాల ఓ చిలుకా అందుకో ..........' (3)
10. 'అన్నా నీ అనురాగం ఎన్నో ......... పుణ్యఫలం' (3)
11. 'కన్నయ్యా......... కన్నయ్యా నిన్న కనలేని కనులుండునా' నాదీ ఆడజన్మే చిత్రంలోని పాట (3)
12. 'ఏ ....లో విరిసిన పారిజాతమో '(2)
14. '.......... పొన్నారి పువ్వా విరబూసి విరబూసి నవ్వు' (3)
16. 'వినిపించని .............. కనిపించని అందాలే అలలై మదినే కలచే (3)
17. 'మామిడి కొమ్మ మళ్ళి మళ్ళి పూయునులే మాటలు ........కోయిలమ్మ పాడునులే' ఇదికూడా రాము చిత్రంలోనిదే (2)
18. 'వేయి వేణువుల మ్రోగే వేళా........ వెల్లువై పొంగె వేళా' (2)

పజిల్, కూపన్ 15-11-2004 లోగా చేరాలి

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



## Some పక్షం

(గత సంచిక తరువాయి)

దొంగలు నిజజీవితంలో ఎన్ని కష్టాలు కలిగించినా కార్టూనిస్టుల పాలిట మాత్రం కల్పతరువులే! దొంగలమీద ఎన్నో కార్టూన్లున్నాయి. కొత్తగా వేయడానికి అవకాశమే లేదనిపిస్తుంది. కానీ 'సరసి' తన దృష్టి దొంగల కుటుంబాలపై సారించారు. మామూలుగా మనందరికీ తెల్లారుగట్ల లేచి చదువుకోవాలంటే అలారం కావాలి. కానీ దొంగగారబ్బాయికి అలారం అక్కర్లేదు, అది మోగుతుందో లేదోనన్న భయం లేదు.







సరసి కార్టూన్లు
250 కార్టూన్లు, 50 రూ॥లు
ప్రతులకు - విశాలాంధ్ర

దొంగల మాటెత్తగానే పోలీసులు గుర్తొస్తారు కదా! పోలీసు కుటుంబాలూ 'సరసి' దృష్టి దాటిపోలేదు. సీరియళ్ల బాధితుడు తన చేతిలో ఉన్న ప్రతి ఆయుధాన్ని ఉపయోగించుకోవాలని చూడడంలో ఆశ్చర్యమేముంది!?




జనాల్ని చెదరగొట్టడానికి పోలీసులు గాలిలో కాల్పులు జరిపారని పేపర్లో చదువుతూ ఉంటాం. దానివల్ల 'ఫ్రింజ్ బెనిఫిట్స్' (కొసరు ప్రయోజనాలు) ఉంటాయన్న ఊహ పోయినందుకు 'సరసి' అభినందనీయుడు.

దొరకైనా,దొంగకైనా భార్య ముచ్చట తీర్చడం తప్పనిసరి. ముద్దు చెల్లిస్తానన్న భర్త అనుకున్న సమయానికి ఇంటికి రాకపోతే ముద్దరాలు కంగారుపడదూ? ఆ బెంగ తీర్చవలసిన డ్యూటీ ప్రజాసేవకులది కాదూ!?







ఇంకోరకమైన 'ఫ్రింజ్ బెనిఫిట్' కూడా ఉందనిపిస్తుంది - ఈ క్రింది కార్టూన్ చూస్తే! ఇలాంటి సమయాల్లో పాతపగల బాకీలు తీర్చుకునే సువర్ణావకాశం అందివస్తే వదిలిపెడతారా?

కొన్ని ప్రాంతాల్లో ఫ్యాక్టరీ శంకుస్థాపన రాయి పడ్డ మర్నాడే యూనియన్ జండాలు రెపరెపలాడతాయి. అలాటి కథే ఇదీ - మరో కోణంలో...!







(వచ్చే సంచికలో మరికొన్ని)

**- ఎమ్బీయస్ ప్రసాద్**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం: స్వదేశ్
రచన : జావేద్ అఖ్తర్
సంగీతం : ఎ.ఆర్.రెహమాన్
గానం : ఉదిత్ నారాయణ్, మాస్టర్ విఘ్నేశ్, బేబి పూజా
అభినయం : షారూఖ్ ఖాన్, బాలతారలు



'లగాన్' వంటి చరిత్రాత్మక చిత్రం నిర్మించిన అశుతోష్ గొవారికర్, తన ద్వితీయ ప్రయత్నంగా అందిస్తున్న చిత్రం 'స్వదేశ్'. 'లగాన్' లో అమిర్‌ఖాన్‌ను, 'స్వదేశ్'లో షారుఖ్‌ఖాన్‌ను తీసుకోవడం ఓ ప్రత్యేకమైన విషయమైతే, రెండింటికీ ఎ.ఆర్. రెహమానే సంగీతాన్ని అందించడం విలక్షణమైన అంశం.

ఎప్పుడూ మంచి సంగీతాన్నే అందించే రెహమాన్ మంచి కథ, మంచి దర్శకుడు ఉంటే, అసాధారణమైన స్థాయికి ఎదుగుతాడన్నదే శ్రోతలందరికీ తెలిసిన విషయమే. అందులోనూ పూవుకు తావి అబ్బినట్లు అతనికి జావేద్ అఖ్తర్ సాహిత్యం కూడా లభించింది.

'స్వదేశ్'లో అన్ని పాటలు బాగున్నా, ప్రత్యేకంగా చెప్పుకోదగ్గవి రెండు. 'యూహీ చలా చల్', 'యే తారా వో తారా హర్ తారా', అన్నీ తెలిసిన, నిరాడంబరమైన మాటల్లోనే ఎంత గొప్ప సందేశం ఇవ్వవచ్చో చెప్పడంలో తనకు తానే సాటి అయిన అఖ్తర్ గీత రచన ఈ చిత్రానికే హైలైట్. మాటలు నిరాడంబరమైనవీ, రోజూ మనం మాట్లాడుకునే పదజాలమే. కానీ మాటలు చాలా ఎక్కువ ఉండడం ఈ రెండు పాటల ప్రత్యేకత. అందుకే చరణాలు కూడా సుదీర్ఘమైనవే. పాట ఇది

**యే తారా వో తారా హర్ తారా - 2**
**దేఖా జిసే భీ లగే ప్యారా ॥యే॥**
**యే సబ్ సాథ్ మే జో హై రాత్ మే**
**తో జగ్ మగాయే ఆస్‌మాన్ సారా**



**జగ్‌మగ్ తారే - దో తారే -నౌ తారే - సౌ తారే**
**జగ్‌మగ్ తారే - హర్ తారా హై షరారా**

జగ్‌మగానా అంటే వెలగడం; ఆస్‌మాన్ అంటే ఆకాశం, షరారా అంటే అగ్నికణం.

ఇది ఒక సమైక్యతాగీతం. ప్రకృతిలో అన్నీ కలిసివుంటే ఎంత ఆనందం. అలాగే మనుషులు కూడా ఐక్యంగా ఉంటే సాధించలేనిదేది లేదు అన్న సందేశం ఈ పాట ఇస్తుంది. ఆ స్ఫూర్తినే కవి రకరకాలుగా చెప్పాడు.

**ఈ తారా ఆ తారా అన్ని తారలూ**
**దేన్ని చూసినా అందాలు వెల్లి విరియు**
**రాత్రి చీకట్లో ఇవి కలిసి కనిపిస్తే**
**అంబరమంతా దేదీప్య మానమే**
**వెలుగుతున్నాయి- ఒకటి -కాదు - తొమ్మిది;**
**వంద - ప్రతి తారా ఒక అగ్నికణమై ॥ఈ తారా॥**

1 వ చరణం :

**తుమ్ నే దేఖాహై ధనక్ కో - బోలో రంగ్ కిత్‌నే హై**
**సాత్ రంగ్ కెహనేకో -ఫిర్ భీ సంగ్ కిత్‌నే హై**
**సమఝో సబ్ సే పెహలే తో - రంగ్ హోతీ అకేలే తో**
**ఇంద్ర ధనుష్ బన్‌తా హీ నహీ**
**ఏక్ న హమ్ హో పాయే తో - అన్యాయ్ సే లడ్ నే కో**
**హోగీ కోయీ జన్‌తా హీ నహీ**
**ఫిర్‌న కెహనా నిర్బల్ హై క్యూ హరా ॥తారా॥**

ధనక్ అంటే నేతపని. నేతపనిని చూసినపుడు ఎన్ని రంగులున్నాయో అని ముచ్చట పడ్తావు. వాటిలో ఏడు రంగులుండవచ్చు. కానీ అన్ని రంగులు ఎలా కలిసి వున్నాయి? అందుకే ముందు అర్థం చేసుకో

**రంగులు ఒంటరిగా ఉంటే - ఇంద్ర ధనుస్సు ఎలా పుడుతుంది?**
**అన్యాయంతో పోరాడేందుకు -మనం ఒక్కటి కాకపోతే**
**ఏ ప్రజలూ మనతో ఉండరు**
**మళ్ళీ అనకు - ఎందుకు బలహీనులయ్యామని**
**ఎందుకు పరాజయం పొందామని ॥ఉ...తార॥**

2వ చరణం :

**బూంద్ బూంద్ మిల్ నే సే - బన్‌తా ఏక్ దరియా హై**
**బూంద్ బూంద్ సాగర్ హై -వర్‌నా యే సాగర్ క్యా హై**
**సమఝో ఇస్ పహేలీ కో - బూంద్ హో అకేలీ తో**
**ఏక్ బూంద్ జైసే కుచ్ భీ నహీ**
**హమ్ ఔరోంకో ఛోడే తో - మూహ్ సబ్ సే మోడే తో**
**తన్‌హా రెహనా జాయే - దేఖో హమ్ కహీ**
**క్యూ న బన్ మిల్ కే హమ్ ధారా ॥ఊ...తారా॥**
**బిందువు బిందువు కలిస్తే సింధువవుతుంది**



బిందువుతో నిండిందే సాగరం
కాక, ఈ సముద్రంలో ఏముంది?
ఈ పొడుపు కథకు అర్థం చెప్పు
బిందువు కనక ఒంటరిదైతే
ఒక్క బిందువు - అంటే ఏమీ లేనట్లే
మనం ఇతరుల్ని వదిలిపెడితే -ముఖం చాటుచేస్తే
ఒంటరిగానే మిగులుతాం
మనమందరం ఒకటై -ప్రవాహంగా మారితే ? ॥ఓ...తారా॥
3వ చరణం:
జో కిసాన్ హల్ సంభాలే - ధర్తీ సోనాహీ ఉగాయే
జో గోవాలా గయ్యా పాలే - దూధ్ కీ నదీ బహాయే
జో లోహార్ లోహా ఢాలే - హర్ ఔజార్ ఢల్ జాయే
మిట్టీ జో కుంభాల్ ఉఠాలే - మిట్టీ ప్యాలా బన్ జాయే
సబ్ యే రూప్ హై - మెహనత్ కీ - కుఛ్ కర్ నే కీ చాహత్ కీ
కిసికో కిసీ సే కోయీ బైర్ నహీ - సబ్ కే ఏక్ హీ సప్నే హై
సోచోతో సబ్ అప్నే హై



కోయీ భీ కిసీ సే యహాగైర్ నహీ -
సీధీ బాత్ హై సమ్‌ఝో యారా ॥ఓ..తారా॥
రైతు నాగలి ఝుడిపిస్తే - నేల బంగారం పండిస్తుంది
గోపాలుడు గోవుల్ని కాస్తే - పాల ధార వెల్లువవుతుంది
కమ్మరి ఇనుము కరిగిస్తే - పరికరం తయారౌతుంది
కుమ్మరి మట్టిని పిసికితేనే - ఆ మన్ను గిన్నె అవుతుంది
ఇవన్నీ శ్రమజీవన రూపాలే - ఏదోచేసి చూపాలన్న ఆరాటాలే
ఎవరూ ఎవరికీ పరాయి కారు -
అందరి కలలూ ఒకటే
ఆలోచిస్తే అందరం ఒకటే -
ఎవరూ మనకు పరులు కారు
ఇది అందరికీ తెలిసిన మాటే -
అర్థం చేసుకో నేస్తమా ॥ఓ.. తారా॥

నక్షత్రాలు, ఇంద్రధనుస్సు, శ్రమజీవులు అనే మూడు భావచిత్రాల ద్వారా, కవి మనమందరం అలవరచుకోవాల్సిన సమైక్యతా దృక్పథాన్ని, శ్రమ జీవన సౌందర్యాన్ని గుర్తు చేస్తున్నాడు. మనషులందరూ ఏకమై, ఏకలక్ష్యంతో సాగినపుడు, అందరూ తనవారేనని అనుకున్నప్పుడు, ఇక మానవయత్నానికి అడ్డులేదు. అతని విజయానికి తిరుగులేదు. ఈ సార్వజనీన సత్యాన్ని చిన్న మాటల్లో పొదిగి, దేశీయమైన బాణీలో రంగరించి ఇచ్చారు జావేద్ అఖ్తర్, రెహమాన్‌లు. షారుఖ్ ఖాన్ చిన్న పిల్లలతో కలిసి పాడే ఈ పాటకు నేపథ్యగానం అద్భుతంగా అందించిన గాయకులు ఉదిత్ నారాయణ్, మాస్టర్ విఘ్నేశ్, బేబీ పూజా.

- మృణాళిని





"ఈ చీర కలర్ బాగుంది కాని డిజైన్ బాగాలేదు".

"డిజైన్‌దేముంది మేడమ్ ఒక్క ఉతుకులో పోతుంది..... తీసుకోండి మేడమ్".

"బాబుగారూ... ఈరోజు రాత్రి టీ.వీలో రాబోయే సినిమా నేను మీ యింటిలో చూడవచ్చా?"

"ఇదేం కోరికయ్యా".

"20 సంవత్సరాల క్రితం ఆ సినిమా తీసింది నేనే బాబూ...ఓసారి ఆ ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళిపోదామనీ.."



"ఇదిగో ఈమందు దెబ్బ తగిలిన చోట రాయి ఒక్కరోజులో తగ్గిపోతుంది".

"నిజంగా డాక్టర్"!

"రాసి చూడు నీకే తెలుస్తుంది".

మరుసటి రోజు

"మానలేదు డాక్టర్"

"ఏదీ చూపించు. ఇదేంటి మందు అస్సలు రాసినట్టులేదు...?"

"ఏంటీ... మందు ఇక్కడ రాయలా... యాక్సిడెంట్ అయిన ప్లేస్‌లో రాయమన్నారు కదాని ఓపిక లేకపోయినా అంత దూరం వెళ్లి ఎగ్జాక్ట్‌గా ఆ ప్లేస్ వెతికిమరీ పట్టుకొని అక్కడ రోడ్డు మీద శుభ్రంగా ఉన్న మందంతా రాసొచ్చాను కదండీ!?".



ఒకతను రోగంతో హాస్పిటల్‌లో చావుబ్రతుకుల మధ్య ఉన్నాడు. వైద్యులు, బంధువులు చేయని ప్రయత్నం లేదు. చివరగా ఒకరి సలహా పై ఓ స్వామిజీని తీసుకు వచ్చి చూపించారు.

స్వామిజీ సమీపించగానే మంచం మీదున్న ఆ వ్యక్తి చేతులెత్తి దండం పెడుతూ ఏదో చెప్పబోయాడు . అది చూసిన స్వామిజీ "ఆయన ఏదో చెప్పాలని చెప్పలేకపోతున్నాడు అతనికి ఒక పెన్ను, పేపరు ఇవ్వండి రాస్తాడు" అన్నారు. అతడు పేపరు మీద ఏదో రాసి మరణించాడు. ఆ స్వామిజీ అతని అంత్యక్రియలు జరిపించి ఆశ్రమానికి చేరుకున్న తర్వాత అతను రాసిన పేపరు గుర్తుకి వచ్చి తీసి చూశాడు అందులో "స్వామీ మీరు నా ఆక్సిజన్ ట్యూబ్ తొక్కారు నాకు ఊపిరి ఆడడంలేదు. మీరు కాలు తీయకపోతే చస్తాను" అని ఉంది .





"వన్ నాట్ ఫోర్ (104) ను తెలుగులో ఏమంటారో చెప్పరా ?"

"ఒకటి కాదు నాలుగు".



ఒక సినీనటితో (మరొక నటితో ) : నిన్ను ఎత్తుకు పోయిన దొంగలు అయినిమిషాల్లో ఎలా వదిలేశారు ?

"సింపుల్‌గా మేకప్ చెరిపేసుకున్నా ....అంతే!"



"ఏమయ్యా నేను మతిమరుపుకు ఇచ్చిన మందు అద్భుతంగా పనిచేసినట్టుందే.. చాలా బాగా కనిపిస్తున్నావ్..."

"సారీ డాక్టర్ అసలు ఆ మందు వేసుకోవాలన్న సంగతే మరిచిపోయాను."

**ఈ జోకులను పంపించిన వారు: ఎ. బాలరాజు, ఖమ్మం.**



"నాన్నా ! మనం మాట్లాడే భాషను మాతృభాష అని ఎందుకు అంటారు ?"
"మాట్లాడే అవకాశం నాన్నలకు రాదు కనుక".



"మూడు రోజుల్నుంచి అన్నం లేదు.. బాబయ్యా"!
"నిన్నకూడా ఇదే మాట చెప్పినట్టున్నావ్!?"
"ఆకలి బాధతో జ్ఞాపక శక్తి దెబ్బతిని ఉండొచ్చు బాబయ్యా!"



"సారీ మేడమ్.... మేనేజర్ గారు ఇప్పుడే వారి శ్రీమతితో లంచ్‌కి వెళ్ళారు"
" అలాగా ! అయితే ఆయన తిరిగి రాగానే, ఇంటి నుండి వారి సెక్రటరీ ఫోన్ చేసిందని చెప్పు".



"ప్రతి రోజూ ఒక మంచి పని చేయాలని నిన్న చెప్పారు కదా - అందుకే నేను ఈ వేళ ఒక మంచి పని చేసా... టీచర్ " చెప్పాడు సంతోషంగా రవి.
'ఏంటది ....చెప్పు .." అడిగింది టీచర్..
"నేను... మరో ముగ్గురం కలిసి.. ఒక వృద్ధుడ్ని రోడ్డు దాటించాం" గర్వంగా చెప్పాడు రవి.
"ఆ పనికి నలుగురెందుకు?"
"దాటేందుకు ఆయన మొరాయించాడు కదా".



"చఛానన్త్తాన్నానండీ మన పెళ్లి అయిన తర్వాత మీలో చాలా మార్పు వచ్చింది. వెనకట్లా మీరు నన్ను ప్రేమించట్లేదు".
"పెళ్లి అయిన వాళ్ళను ప్రేమించడం మా ఇంటా వంటా లేదు".

"శ్రీ వీర వెంక సత్యనారాయణ లక్ష్మీసాయి గణేష్ కనక ద ం ర్గా ం జ నే య ం శివన్నాయణ షూమార్ట్... మన చెప్పుల షాపుకు ఇంత పెద్ద పేరెందుకు డాడీ?"
"ఆ గుళ్ళల్లో కాజేసిన చెప్పులు, షూష్‌లతోనే కదరా నేనీ షాపు పెట్టింది'



**ఈ జోకులను పంపించిన వారు: వేంద్ర బాలస్వప్న, హైద్రాబాద్.**

**ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన వేంద్ర బాలస్వప్న, హైద్రాబాద్, ఎ.బాలరాజు, ఖమ్మం గార్లకు సోహన్ మ్యూజిక్ వారు "సామ్రాట్ రీమిక్స్' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN MUSIC



# రంగుల 'మొఘలే ఆజమ్' పాటల రీరికార్డింగులో నౌషాద్



నవంబరు 12న దీపావళి సందర్భంగా రిలీజ్ కాబోతున్న 'మొఘలే ఆజమ్' రంగుల వెర్షన్‌కు సంగీతపరంగా కూడా కొత్త హంగులు అద్దుతున్నారు. ఈ ప్రాజెక్టుకు సారథ్యం వహిస్తున్న దీపేష్ సాల్గియా సౌండ్‌ను కూడా అప్‌గ్రేడ్ చేద్దామని సంకల్పించారు. 6.1 మిక్సెడ్ ట్రాక్‌లో డాల్బీ సరౌండ్ సౌండ్ సిస్టమ్‌కు అనుగుణంగా డిజిటల్‌గా మార్చబోవడం ప్రపంచంలోనే తొలిసారిగా జరుగుతోందని అంటున్నారు.

60 సంవత్సరాల క్రితం 1944లో ప్రారంభించిన మొఘలే ఆజమ్ రిలీజ్ కావడానికి 16 యేళ్లు పట్టింది. పెట్టుబడి పెడతానన్న షిరాజ్ ఆలీ హక్ (మహాలక్ష్మి స్టూడియో) పాకిస్తాన్‌కు తరలివెళ్లిపోవడం ఒక కారణమైతే దర్శకుడు కె.అసిఫ్ పెర్‌ఫెక్షనిజమ్ మరో కారణం. సినిమా తీసన్తాండగానే 1957లో కలర్ టెక్నాలజీ అందుబాటులోకి రావడంతో అసిఫ్ సినిమాలో 15 శాతం కలర్‌లో తీశాడు. దాని ఎఫెక్టు చూసి అందరూ మెచ్చుకోవడంతో సినిమా మొత్తం కలర్‌లో తిరిగి తీద్దామనుకున్నాడు కానీ డిస్ట్రిబ్యూటర్లూ, ఆ రోజుల్లోనే ఒకటిన్నర కోటి రూపాయలు పెట్టుబడి పెట్టిన షాపుర్‌జీ పలోంజీ పట్టుబట్టడంతో అలాగే రిలీజ్ చేశాడు. సినిమా ఎంత పెద్ద హిట్టో వేరే చెప్పనవసరం లేదు.

షాపుర్‌జీ వారసులు, స్టెర్లింగ్ ఇన్వెస్ట్‌మెంటు కార్పొరేషన్ కలిసి 10 కోట్ల బడ్జెట్‌తో దీపేష్ ఆధ్వర్యంలో మూడేళ్లు శ్రమించగా ఇప్పటి కలర్ కాపీ తయారయింది. 3 లక్షల ఫ్రేములున్న సినిమా ఒరిజినల్ నెగిటివ్‌ను తీసుకుని దానిలో గీతలూ గట్రా తీసేసి ఒరిజినల్ రంగులకు దగ్గరగా ఉండే విధంగా రంగులద్దారు. అసలలాటి టెక్నాలజీ తయారు చేయడానికే 18 నెలలు పట్టింది. హాలీవుడ్‌లో ఈ రకమైన ప్రయత్నాలు జరిగాయి కాబట్టి వాళ్లనే వెళ్లి అడిగారు కానీ, ఖర్చు 12-15 మిలియన్ల డాలర్లు (అంటే 50కోట్ల పైమాటన్నమాట) అవుతుందనడంతో స్వదేశీనిపుణులపై దృష్టి మళ్లించారు.

ఫలితాలు చూడబోతే అద్భుతంగా వచ్చాయిట. అనుకోకుండా గోడౌన్లో దిలీప్‌కుమార్ ఆ సినిమా షూటింగు టైములో వేసుకున్న రంగులకోటు దొరికిందట. రంగు చూడబోతే ఇప్పుడు తాము మార్చిన రంగుకి బాగా దగ్గరగా ఉందట! హమ్మయ్య అనుకున్నాడు దీపేష్. ఈ ప్రయోగం సౌండు విషయంలో కూడా చేస్తే!? అన్న ఆలోచన వచ్చి నౌషాద్‌ను సంప్రదించాడు. 44 యేళ్లనాటి ఆ సినిమాకు పనిచేసిన సాంకేతిక నిపుణులు చాలామంది పరలోకగతులయినా అదృష్టవశాత్తూ సంగీతదర్శకుడు నౌషాద్ మనమధ్యనే, ఆరోగ్యంగా ఉన్నారు.

మహమ్మద్ రఫీ, లతా, బడే గులాం ఆలీఖాన్ షంషాద్ బేగమ్ కంఠాలు అలాగే ఉంచుతూ డాల్బీ ఎఫెక్ట్ తెలిసేట్టు వాయిద్యాలు మాత్రం మార్చి నౌషాద్ చక్కటి ప్రయోగం చేశారు. రీరికార్డింగులో ఉత్తమ్‌సింగ్ సహకారం తీసుకున్నారు.

మరి యువప్రేక్షకులు (థియేటర్లకెళ్లేవారిలో 70-80 శాతం వారే మరి!) ఈ ప్రయోగాన్ని ఎలా ఆదరిస్తారో వేచి చూడాల్సిందే!

## న్యూస్ వ్యూస్

### రంగుల 'నయాదౌర్' కోసం ఓపి నయ్యర్ కూడా ఇలాగే చేస్తారా?

బి.ఆర్. ఫిలిమ్స్ వారుకూడా వారి 'నయాదౌర్'ను రంగుల్లో అలంకరించి వచ్చే ఏడాదిలోపున రిలీజ్ చేయబోతున్నారు.

ఈ సినిమాలో ఔట్‌డోర్ దృశ్యాలు చాలా ఉన్నాయి కాబట్టి, మనిషికీ, యంత్రానికీ జరిగే పోరాటం అనే కథాంశానికి కాలం చెల్లలేదు కాబట్టి మూడుకోట్లు ఖర్చుపెట్టి రంగుల్లో మార్చినా ఫర్వాలేదని భావిస్తున్నారు, బి.ఆర్.చోప్డా, కుమారుడు రవిచోప్డా.

'షోలే' రివైజ్డ్ వెర్షన్ బాగానే వుంది కానీ సౌండ్‌పై వారు మరింత శ్రద్ధ వహించవలసినది. మేం మాత్రం మా 'నయాదౌర్'కు డాల్బీ సౌండ్, డిజిటల్ ఎఫెక్ట్స్ చేర్చబోతున్నాం.' అన్నారు రవి.

సంగీతం విషయంలో ఏం చేయబోతున్నారో చెప్పలేదు. నయాదౌర్ సంగీతదర్శకుడు ఓపి నయ్యర్ కూడా మనమధ్యే ఉన్నారు కాబట్టి ఈ డిజిటలైజేషన్‌లో ఆయన కూడా పాలుపంచుకుంటే బాగుంటుంది కదూ! యువతను ఆకట్టుకోగల ప్రజ్ఞ ఉన్న నయ్యర్ కలగజేసుకుంటే 'మాంగ్ కే సాథ్ తుమ్హారా' అని పదహారేళ్ల పిల్లలు సైతం 'హమ్' చేసే రోజు ఎంతో దూరంలో లేదు.



| రచన: సామవేదం షణ్ముఖశర్మ | 1 | గానం: మధుబాలకృష్ణన్, శ్రీరాం పార్థసారథి, చిత్ర |
|---|---|---|

శ్రీ మన్మనోహర సురాగిణి దివ్యమూర్తే
గంధర్వ కిన్నెర సురార్చితగీత కీర్తే
సామాది మంత్రపరివేష్టిత శుభ్రదీప్తే
శ్రీ రాగ సేవ్య చరణే తవసుప్రభాతమ్

| రచన: వేటూరి | 2 | గానం: శంకర్‌మహదేవన్, సుజాత, కోరస్ |
|---|---|---|

సాకీ: కస్తూరీ తిలకం లలాట ఫలకే
వక్షస్థలే కౌస్తుభం నాసాగ్రే నవ మౌక్తికం
కరతలే వేణుం
ప॥ వేణు గాన సమ్మోహనం - వేలిమీద గోవర్ధనం
వ్రేపల్లె మా నందనం - వేనోళ్ళ నీ కీర్తనం
అప॥ ఆషాఢ మేఘాలొచ్చి ఆనందాల జల్లే కురిసే ఆలారే...॥వేణు॥
చ॥ పాలచట్టి నెత్తినెట్టి అమ్మబోతె కిట్టయ్యా
ఏలుపెట్టి ఎంగిలి చేత్తడు .. ఎట్టాగమ్మో.. ఇంకెట్టగమ్మో
మాటుచూసి మడుగులోన మునగబోతె కిట్టయ్యా
సీరలు గుంజి సక్కబోతడు .. ఎట్టగమ్మా.. ఇంకెట్టగమ్మో
ఏరే కోక నీరే రైక అంటాడమ్మో
వచనం: అట్టాగని అంటాముట్టనట్టు వుందామంటే
చ॥ మురిపాలు పొంగిస్తే పాలెందుకంటాడు... ఓలమ్మో
సిగ్గొచ్చి చుట్టేస్తే చీరెందుకంటాడు.... ఓలమ్మో
బుటుకు బుటుకు బుగ్గ గిల్లి పోయినట్టు
సిటుకు సిటుకు సినుకు ముద్దులిచ్చినట్టు ॥బుటుకు॥
వయసు పచ్చి తాకినట్టు - మనసు గిచ్చి పోయినట్టు
ఆలారే ఆలారే ఆనందబాల
అందాల కిట్టయ్యతో పంతాల హేల ॥ఆలారే॥ ॥వేణుగాన॥
చ॥ కృష్ణా ముకుందా మురారీ
నంద యశోదానందనునకు నవమదన దేవునకు గొబ్బిళ్ళో
చందన చర్చిత నీలదేహా గగనాల సొగసుకు గొబ్బిళ్ళో
ఉసురుగాలులను వెదురుపాటలుగా॥2॥
పలుకు వేణువుకు గొబ్బిళ్ళో
ఏటిమీద ఎన్నెల్లో ఎన్నెలంటి కన్నుల్లో
కన్నెగంటి సన్నల్లో సన్నజాజి గిన్నెల్లో
వేదమంతా వెన్నెలాగా కరిగే వేళల్లో ॥2॥
ఏ గీత బోధిస్తావో ఎవ్వరి గీత మారుస్తావో నందారే ॥వేణుగాన॥

| సంప్రదాయ కీర్తన | 3 | గానం: ఎస్.పి.బాలు, సునీత |
|---|---|---|

కుడికన్ను అదిరెనే కూడిన తరుణాన ॥2॥
కొండలరాయనికిక కోటి రాతురులు.. ॥కుడి॥
మేలు మేలాయెనే మంగ మాయమ్మకు
అలకల తీపులు ఆర్చినందుకు ॥మేలు॥
చాలుచాలాయె చెలిబుగ్గలకు ॥2॥
చెలువంపుగాటులు చెక్కినందుకు ॥కుడి॥
తెలుపరే భానునికి తెలవారలేదని ॥2॥
పాలిసిన మేన పొలతి పవళించినందుకు
పిలువరే మెల్లగ పిల్ల తెమ్మెరల ॥2॥
నలిగిన గుబ్బల నెలత అలసిసొలసినందుకు ॥కుడి॥
సాసా సరినీద
మదనిరినీ దనీసా
దాదా మనిదా
మదనిసదా మగరిగ మనిదా
సా నిదమగరిస దనిస దనిస దనిస దనిస
తీయకే ఆ గడియ తీపి ఘడియలు వేలు
తిరునాధు కౌగిలిని కాగువరకు
సాయకే ఆ మేను... సాయకే ఆ మేను సరసాల సమయాలు
సరిగంచు సవరించి సొగువరకు ॥కుడి॥

| రచన: వేటూరి | 4 | గానం: ఎస్.పి.బాలు, శైలజ |
|---|---|---|

సాకీ: ఒక్కక్షణం.... ఒక్కక్షణం
గరిమల నీ మురిపపు ముద్దుల మొలకొచ్చేదిక...
ఒక్కక్షణం ఒక్కక్షణం
ప: అమ్మకడుపు చల్లగా అయ్యకలలు పండగా
ఇమ్మనరే... ఇమ్మనరే దేవతల ఈ తల్లికి వరము
ఈ లాలికి స్వరము... ఇహము.... పరము ॥అమ్మ॥
చ: కౌసల్యకు తప్పని ఈ అమ్మవేదన మన రామకీర్తన
రామం దశరథరామం దనుజవిరామం ధరణిజ సోమం
రామం దశరథరామం దనుజవిరామం ధరణిజ సోమం
దేవకికే తప్పని చెరసాల వేదన నవరసాల నర్తన
నందనందనం భక్తచందనం గోపికా గోవందనం
నందనందనం భక్తచందనం గోపికా గోవందనం
గగప రిరిగ సాదసా
గరి పప్పాగరి
గప దపా దపా సదా
దసరి సారి సాగరీ
గగ రిరి సస
రిరి సస దద
సాదా పగా రిసా
రిగా
తూరుపు తల్లికి తప్పదు ఉదయవేదన
మేఘాలకు తప్పదు మెరుపు వేదన... ఒక్క క్షణం... ఒక్క...
గరిమల నా మురిపపు ముద్దుల మొలకొచ్చేదిక..
ఒక్కక్షణం ॥అమ్మకడుపు॥
చ: కల్లోలపు కడలిమీద తానుతేలగా వటపత్రశాయిగా
తొమ్మిది మాసాల యోగి కెవ్వుకెవ్వున తొలికేకపెట్టగా
శోకంలో పుట్టెనంట రామాయణము
శోకంలో పుట్టెనంట రామాయణము
శ్లోకంగా పెరుగునంట జన్మల ఋణము
ఆ ఋణానుబంధమే ఈ శిశు జననం
నందనందనం భక్తచందనం గోపికా గోవందనం
నందనందనం భక్తచందనం గోపికా గోవందనం
నందనందనం భక్తచందనం గోపికా గోవందనం
నందనందనం భక్తచందనం గోపికా గోవందనం
జో అచ్యుతానంద జోజో ముకుందా
లాలి పరమానంద రామగోవిందా జోజో

| రచన: సిరివెన్నెల | 5 | గానం: మనో, చిత్ర |
|---|---|---|

ప : నీ చెంతే ఒక చెంచిత ఉంటే వెన్నెల్లో వేట అది
నీ వెంటే ఒక చంద్రిక ఉంటే పున్నమితో పాట అది
అదేకదా ఇది ఔనేమో అంటోంది మది! ॥నీ చెంతే॥
చ: వయసుకి వగరొస్తుంటే వసంతాల రాక అది
సొగసుకి చిగురొస్తుంటే వయారాల వేకువది
మల్లెకి సిగ్గులు పూస్తుంటే పరాగాల భారమది
పిల్లకి తొందర పుడుతుంటే సరాగాల గారమది
అదేకదా ఇది ఔనేమో అంటోంది మది! ॥ నీ చెంతే॥
చ: వెచ్చని ఊహల వెనువెంటే తరలిన హేమంతమది
పచ్చని ముచ్చట మొదలెట్టే చెలిమికి సీమంతమది
నీతో నడిపిస్తుంటే ప్రతి అడుగూ సప్తపది
నీతో శ్రుతి చేస్తుంటే ప్రతి పలుకూ అష్టపది
అదేకదా ఇది ఔనేమో అంటోంది మది!
సారీగప సారీగప పాదపదా సదా దపప
సారీగప సారీగప పాదపదా సదా దపప
పదాపదా సదా పాదాసా పాధాగా రిసా
రిసనిదపమగరిస రిగమగపా

**రచన: వేటూరి** (6) **గానం: ఎస్.పి.బాలు, చిత్ర**

అ: ఇది నాదని అది నీదని
ఆ: ఇది నాదని.... అది నీదని
అ: చెప్పలేనిది ఒక్కటి ఈ ఒక్కటి
ఆ: ఏమది
అ: అది ఇదీ అని చెప్పలేనిది
ఆ: ఆ చెప్పలేనిది ఏమది...
అ: అది మనసున పుట్టి మమతల పెరిగి మనువై పూచేది
అది ఇది అని చెప్పలేనిది
ఆ: అది ఇది అని చెప్పలేనిది
అ: వెన్నెలమ్మ రాతిరిదా వేకువమ్మ పొద్దుటిదా
కోకిలమ్మ ఆమనిదా
ఆ: ఈ పువ్వు పులకరింత ఈ పడక పలకరింత ॥2॥
ఈ జన్మకు చాలనంత పరవశమంతా
ఇ: మనదే మన ఇద్దరిదే
పదే పదే వినిపించే ప్రియదేవుడి అష్టపదీ ॥అది ఇదీ॥
ముగ్గిన వలపుల ముగింట వయసుముగ్గు వేయనా
అ: నిగ్గులు పొంగిన చెక్కిట సిగ్గుల ఎరుపులు తాకనా
ఆ: వయ్యారంగా పార్వతి శృంగారంగా శైలపతి
అ: ఓంకారంగా కలిసి ఏకాక్షరమై మురిసే
పరవశమంతా మనదే మన ఒక్కరిదే
ఆ: ఎదా ఎదా కలిపేసే ఇహపరాల ఇష్టపది ॥అది ఇదీ॥

**రచన: సామవేదం షణ్ముఖ శర్మ** (7) **గానం:మనో, శ్రీరామ్ పార్థసారథి, మధు బాలకృష్ణన్, చిత్ర**

సమానమెవ్వరు నీకిల ఉమా రమణా
పాహి పాహీ ఓయీ శ్రీచరణా
రమా వినోది వల్లభా నమామి స్వర సుమాభరణా
నాద సదనా శ్రుతిధనా
రమా వినోది వల్లభా ఉమారమణ శ్రీచరణా ॥2॥
నమామి నాదసదనా .... నమామి నాదసదనా
శ్రుతిధనా స్వరసుమాభరణా
పాహి... పాహి.. ॥రమా॥
ప్రాణగానమాలాపన చేసి - స్వరసోపానములధిరోహించి ॥2॥
ప్రణవ శిఖరిపై... ప్రణవ శిఖరిపై
నిను దరిశించీ
చిదంబరాన - హృదంబుజమ్మున - నీ
పదాంబుజంబుల ధ్యానించీ
శుభంకరా - నవరసాంబులధారల
ప్రభాతాభిషేకములు జేతురా
పాహి... పాహి... పాహి... పాహి... ॥రమా॥
సా సరిమా రిమపా మపనీని ధీం ధీం నిసరి నిసరి తకిట
సాసరిసా మరిసా సరిసా పమ ధీం ధీం మరిప మనిప
తకతకిట సాసస రీరిరి ధీం తతక తఝుణు సాసస రీరిరి
ధీంత సరిసరిస తకిట సరిసరిస తధిమి సరిసరిస
సనిరీ సానీపాని తాంతతాం తకతాం సరిమరిసా పామపా
సనిపా తధింగిణతోం తధింగిణతోం సారిసా సరిసా
సరిమపమ రిమపనిప మపని సరిసా...
గమక గమనముల స్వరఝురులే
జడల అడవిలో సురధునిగా
మురిసి ముక్కనుల కదలికలె
ముజ్జగాల సంగతుల గతులుగా
రాగములే నాగాభరణములై
యోగములే వాగర్థాకృతులై
కాలములే లీలా కరణములై
సామములే మధుగాంధర్వములై
గంగధరా ! శంకరా !! సంగీతసాకారా !
ఉమారమణా శ్రీ చరణా పాహి.... పాహి...

**రచన: వేటూరి** (8) **గానం: కె.జె.ఏసుదాసు, ఎస్.పి.బాలు**

ప: అనుజుడై లక్ష్మణుడు అన్నా యనుచు పిలువ
తపమేమి జేసెనో ఈ రామయ్య
అనుజుడై లక్ష్మణుడు అన్నా యనుచు బిలువ
తపమేమి జేసెనో రామయ్య తపమేమి జేసెనో తెలియ ॥అను॥
చ: తనువులో తనువైన తన సతికి దూరమై... లక్ష్మణుడు
తనువులో తనువైన తన సతికి దూరమై...
చిత్రకూటపు ఆ బ్రతుకు సీతకై విలపింప... ॥2॥
చెంతనే తానుండి చింత తీర్చిన వాని
లక్ష్మణుని తమ్ముడాయని పిలువ ॥తపమేమి॥
అన్న : ఆ..... సా....
తమ్ముడు : సా....ఆ....ఆ....
అన్న: సా స ని ద ప మ గమప మపద
పదని సా
తమ్ముడు: సారిగా పమగా పమా దపా
ని ద పా
అన్న: రీ నిరిగా దని రీ రిగమ గమద
మదనిరీ
తమ్ముడు: గ రి స ని స ని స ని ద ప
మ గ ని దా గ రీ
ఇద్దరు: గా గా గ రిగ పమ గరి నిరిగరి
సా సా స నిగరి ని రి స నిదపమ
పా పాప మద పమ గరి నిరిగరి గా
తమ్ముడు: ని దా నిదపమ గమద గనీ
అన్న: స నీ సనిదప మగరి
సా సా సా ససా సా స
తమ్ముడు: రీ రీ రీ రి రీరీరి
ఇద్దరు : గారీ గరిస రీసా రిసని
సానీ సనిద పమా పమగ
రిసనీ గరిస మగరి పదని
సాసస సాసస సరిగరీ నిరిగరీ
నిదమ
పాపప పాపప మదనిదా
గమనిదా మగరిసని
దససని నిరిరిస సగగరి రిమమగ
గపపమ మదదప
గపమ మదప పనిద దసని...
రిమగప మద పని దసనిరి... సా ..
ఆ..
ఇద్దరు: గా రీ సా గరిస గరి సరిసని సనిద
సా నీ దా పా సనిదప
సనిదప నిదపమ దపమగ
రీ గా మా పాదా రిగమ పద
గమ పదని
మ పదనిస దనిసగరి
సా...
తమ్ముడు: అగ్రజుడు రాఘవుడు తమ్ముడా అనుచు బిలువ
తపమేమి జేసెనో లక్ష్మణుడు ఈ లక్ష్మణుడు
తపమేమి జేసెనో తెలియ ॥అగ్రజుడు॥

**రచన: సామవేదం షణ్ముఖశర్మ** (9) **గానం: మధుబాలకృష్ణన్, శ్రీరాం పార్థసారథి, చిత్ర**

మంగళమ్ రాగరాగిణ్యై
మంగళమ్ శ్రుతిసమ్మిత్యై
మంగళమ్ నాదరూపిణ్యై
గీర్వాణ్యై నిత్య మంగళమ్

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

హరి గోపాలకృష్ణ మూర్తి
సమర్పించు
రాజరాజేశ్వరి కంబైన్స్





కె.విశ్వనాథ్

# స్వరాభిషేకం

నిర్మాత : సి.కౌసలేంద్రరావు    సంగీతం : విద్యాసాగర్



వేటూరి

**తారాగణం**

కె.విశ్వనాథ్, శ్రీకాంత్, శివాజీ, శివాజీరాజా, శ్రీధర్, అనంత్, ఎం.ఎస్.నారాయణ, ఏ.వి.ఎస్., అశోక్ కుమార్, రాజీవ్ కనకాల, గుండు హనుమంతరావు, బేబీ స్వాతి, మాస్టర్ సాయితేజ లయ, ఊర్వశి, అముక్త మాల్యద (తొలి పరిచయం), సన, జయలలిత, సురేఖావాణి, జానకి, పద్మాజయంతి, జయలక్ష్మి

**సాంకేతిక నిపుణులు**

| | | | |
|---|---|---|---|
| సమర్పణ | : హరిగోపాలకృష్ణమూర్తి | కొరియోగ్రఫీ | : భూషన్ లఖాంద్రి |
| కథ | : కె.విశ్వనాథ్ | పి.ఆర్.ఓ. | : ట్రేడ్‌గైడ్ వెంకటేశ్వరరావు |
| మాటలు | : రమేష్ - గోపి | పబ్లిసిటి | : కళా భాస్కర్ |
| కెమెరా | : వి.దుర్గాప్రసాద్ | కో-డైరెక్టర్ | : ఎన్.బి.చక్రవర్తి |
| సంగీతం | : విద్యాసాగర్ | నిర్మాత | : సి.కౌసలేంద్రరావు |
| ఆర్ట్ | : ఎం.వేంకటేశ్వర్లు | స్క్రీన్‌ప్లే | } కె.విశ్వనాథ్ |
| ఎడిటింగ్ | : జి.జి.కృష్ణారావు | దర్శకత్వం | |



సీతారామశాస్త్రి



కె.విశ్వనాథ్



హరిగోపాలకృష్ణ మూర్తి



సి.కౌసలేంద్రరావు



విద్యాసాగర్



సామవేదం షణ్ముఖశర్మ



సినీ గీతాల్లో యాంత్రికతను పరిహరించడం కోసమో, వైవిధ్యం కోసమో, కథకు అవసరమనో యుగళగీతాల్లో ఎందరో దర్శకులు, గీతరచయితలు ప్రయోగాలు చేసారు. అలాంటి ప్రయోగాల్లో ఒకటి - నాయికానాయకులు ప్రశ్న-జవాబుల్లోనో, వాదించుకుంటున్నట్టుగా పాడడం. సాధారణంగా, నాయికానాయకుల పరిచయదృశ్యాల్లో ఇలాంటి పాటలుండొచ్చు. కానీ, అక్కడే ఉండాలని నియమమేమీ లేదు. ఇలాంటి పాటలు హృదయానికి ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ఉత్సుకతను కలిగిస్తాయి. సరదా సరదా పాటలుగా మనల్ని అలరిస్తాయి. వాదసంవాదా లనగానే గుర్తుకు వచ్చే పాట -

**ఎక్ సవాల్ మై కరూ - ఎక్ సవాల్ తుమ్ కరో**
**హర్ సవాల్ కా సవాల్ హీ జవాబ్ హో (ససురాల్ - లతాతో కలిసి)**

# వాద సంవాదాల రఫీ



చిత్రం : లీడర్
రచన : షకీల్ బదాయూనీ
సంగీతం : నౌషాద్
అభినయం: దిలీప్‌కుమార్, వైజయంతీమాల

అ: ఆజ్ కల్ షౌకే దీదార్ హై- క్యా కహూఁ
ఆప్ సే ప్యార్ హై
ఆజ్ కల్ షౌకే దీదార్ హై
ఆజ్ కల్ షౌకే దీదార్ దీదార్ హై
క్యా కహూఁ ఆప్‌సే ప్యార్ హై
క్యాకహూ క్యాకహూ
ఆప్‌సే ప్యార్‌హై ప్యార్ హై ప్యార్‌హై
ఆ: మెరి జానిబ్ సే ఇన్‌కార్‌హై
మెరీ జానిబ్ సే ఇన్‌కార్ ఇన్‌కార్‌హై
క్యాకరూ మై అగర్ ప్యార్‌హై క్యా కరూఁ క్యాకరూఁ
మై అగర్ ప్యార్ హై ప్యార్‌హై ప్యార్‌హై
అ: ప్యార్ వో చీజ్‌హై జిస్‌సే యే నాజ్‌నీ
పెహలె ఇన్‌కార్ కర్‌తే హై సారే హసీ
ఫిర్ యే కెహతే హై ఇక్‌రార్‌హై
ఫిర్ యే కెహతే హై ఇక్‌రార్ ఇక్‌రార్‌హై ॥క్యా కహూఁ॥
ఆ: ఛోటాముహ్ ఔర్ బడీబాత్ మత్ బోలియే
దేఖియే అప్‌నీ ఔకాత్ మత్ భూలియే
ఇస్‌కా ఏ ఇష్క్ బేకార్ హై
ఇస్‌కా ఏ ఇష్క్ బేకార్ బేకార్ హై ॥క్యాకరూఁ॥
అ: ఆప్‌కీ హర్ అదా పర్ మై కుర్బాన్ హు
కుఛ్ తరస్ ఖాయియే మై భీ ఇన్‌సాన్ హుఁ
కిస్‌లియే ముఝ్‌సే టక్‌రార్ హై
కిస్‌లియే ముఝ్‌సే టక్‌రార్ టక్‌రార్ హై ॥క్యాకహూఁ॥
ఆ: సున్ సకేంగే న హమ్ ఆప్ కీ ఇంతజార్
జా కిసీసే కిసీ ఔర్ ఘర్ సజా
యహా దిల్ హై న దిల్‌దార్ హై
యహా దిల్ హై న దిల్‌దార్ దిల్‌దార్‌హై ॥క్యాకరూ॥
అ: జానెమన్ అబ్‌తో మిల్‌నే కా వాదా కరో
ఆ: హమ్ నహీ జాన్‌తే తుమ్ జీయో మరో
అ: గుఫ్తగూ కా యే కోయీ తరీకా నహీ
ఆ: ఔర్ తుమ్‌కో భీ కోయీ నహీ
అ: మెరీ ఉల్ఫత్‌కి ఇన్సల్ట్ యూ న కరో
ఆ: యూ షటప్
అ: యూ షటప్
ఆ: యూ షటప్ ఈడియట్ అప్‌నా రస్తా చలో
అ: యూ న తడ్‌పావో దేఖో ఆషిక్
కో దేఖో హెలో హలో హలో హలో

ఈ పాట నిండా పొడుపు కథలే! ప్రతి పొడుపుకథనీ నాయిక ఒడుపుగా విప్పుతుండగా, నాయిక తరపు మిత్రురాళ్ళు ఆనందం ప్రకటించడం, చిట్టచివరి పొడుపు ప్రశ్నను ఆమె విప్పలేకపోవడం (మన సినిమాల్లో నాయకుడే గెలవాలి మరి!)- ఇదంతా చక్కని సాహిత్యం, చక్కని సంగీతం, మరింత చక్కని గానాలతో అలరించే సన్నివేశం.

ఒక నాయకుడు తనకు ఏదో అవుతోందని, అదేమిటో చెప్పమని నాయికను అడుగుతాడు.

**అగర్ మై పూఛూ, జవాబ్ దోగే - దిల్ క్యూ మేరా తడప్ రహా హై**

నాయిక జవాబు - **'తేరీ భి దిల్ మే హై ప్యార్ కుఛ్ కుఛ్ -మేరే భీ దిల్ మే జరా జరాసీ' (షికారి - లతాతో)**

నా మనస్సు ఎందుకు తప్పించిపోతోందంటే, నీ హృదయంలోనూ కొంచెం ప్రేమ, నా హృదయంలోనూ కొంచెం ప్రేమ ఉన్నాయి కాబట్టి అని సమాధానం.

ఈ వాద సంవాదాల్లో ఇద్దరూ పరస్పరం దూషించుకుంటూ తమ మనసుల్లోని భావాలను చెప్పే పాట ఇది.

**ఆజ్ కల్ షౌకే దీదార్ హై ఆజ్ కల్ షౌకే దీదార్ దీదార్ హై**
**క్యా కహూ( ఆప్‌సే ప్యార్ హై క్యాకహూ క్యాకహూ**
**ఆప్‌సే ప్యార్‌హై ప్యార్ హై ప్యార్‌హై**

అని ప్రారంభమయ్యే ఈ పాటలో కథా నాయకుడు ఏం చేయమంటావ్ నాకు నువ్వంటే ప్రేమ అనడం... కథానాయిక నీకు ప్రేముంటే నాకేంటి అనడం ... ఈ వాదసంవాదాల ప్రక్రియ ఈ పాటను చాలా సరదాగా నడిపిస్తుంది. చిట్టచివరకు అంతదాకా ప్రేమగా ఉన్న నాయకుడు కూడా ఆమె జవాబులతో విసిగిపోయి దూషించడం... దాంతో ఇద్దరూ 'యూ షటప్' అంటే 'యూ షటప్' అని ఒకరిమీదొకరు రెచ్చిపోతే చివరికి అతను బేలగా హలో అంటూ నీరసంగా కూలబడటం హాస్యాన్ని కలిగించే సన్నివేశం.

ఒకసారి అతను ఏదో అనబోతూంటే, ఆమె అందుకుని అతని మనసులో మాట చెప్పేస్తుంది.

అతను **'తెరీ బిందియారే హాయ్ హాయ్ తేరీ బిందియారే'** అంటాడంతే.

ఆమె **'సజన్ బిందియా లేలేగీ తెరీ నిందియా రే హాయ్ మేరీ బిందియా రే' (అభిమాన్ - లతాతో)**అంటుంది.

మరోసారి ఇద్దరూ ఒకరినొకరు ప్రశ్నించుకుంటూ, మనోభావాలని స్పష్టం చేసుకుంటారు -

**'కుఛ్ కెహతా హై యే సావన్'** అని అతనంటే

**'క్యా కెహతాహై'** అని అడుగుతుంది నాయిక.

**శామ్ సవేరే దిల్ మే మేరే తూ రహతాహై - తూ రెహతాహై**
**(మేరా గావ్ మేరా దేశ్ - లతాతో)**

నా మనస్సులో రాత్రింబగళ్ళు నువ్వే ఉన్నావని ఈ వానాకాలం చెబుతోందంటాడు. తర్వాత ఆమె **కుఛ్ కెహతా హై యే ఝుర్‌నా** అంటుంది. అతను **'క్యా కెహతాహై'** అని అడుగుతాడు. అలా ప్రశ్న రూపంలో ఇద్దరూ, ప్రకృతి తమ మనస్థితిపై వ్యాఖ్యానిస్తున్నట్టుగా మనో భావాలు వ్యక్తం చేసుకుంటారు.

ప్రశ్న జవాబుల సంవాదంలో నాయకుడు నాయికను బోల్తా కొట్టించేసి, ఆమె చేత మనసులో మాట చెప్పించేసిన పసందైన, చతురమైన పాట ఇది.

**బాగోంమే బహార్ హై - కలియోంపే నిఖార్ హై**
**తుమ్ కో ముఝ్‌సే ప్యార్ హై**

అని ఎన్ని సార్లు పాడినా, మొదటి రెండింటికీ **'హై'** అని జవాబు చెప్పిన నాయిక, **తుమ్ కో ముఝ్‌సే ప్యార్ హై** కి మాత్రం జాగ్రత్తగా నహీ అని చెబుతూంటుంది.

నీ పని ఇలా ఉందా అని పాట చివర ఇలా అంటాడు -

**మైనా కహూంగా తుమ్ కో జిస్ కా ఇంత్‌జార్ హై** (తనకు ఎవరిదో నిరీక్షణ ఉన్నట్టు ఒప్పుకుంటుంది.)

**ఫిర్ భీ ఇన్‌కార్ హై** (అయినప్పటికీ వ్యతిరేకత కూడా ఉందంటే ఊ అంటుంది)

**చిత్రం : ససురాల్ రచన : శైలేంద్ర సంగీతం: శంకర్-జైకిషన్**
**అభినయం : రాజేంద్రకుమార్, బి.సరోజాదేవి తదితరులు**

అ-ఏక్ సవాల్ మై కరూ... ఏక్ సవాల్ తుమ్ కరో.. ॥2॥
హర్ సవాల్ కా సవాల్ హి జవాబ్ హో
ఆ-ఏక్ సవాల్ మై కరూ... ఏక్ సవాల్ తుమ్ కరో.. ॥2॥
హర్ సవాల్ కా సవాల్ హి జవాబ్ హో ॥ఏక్ సవాల్॥
అ-ప్యార్ కి బేలా సాథ్ సజన్ కా ఫిర్ క్యూ దిల్ ఘబ్‌రాయ్
నయ్‌హర్ సే ఘర్ జాతీ దుల్హన్ క్యూ నైనా ఛల్‌కాయే
ఆ- హై మాలుమ్ కి జానా హోగా దునియా ఏక్ సర్
ఫిర్ క్యూ జాతే వక్త్ ముసాఫిర్ రోయే ఔర్ రులాయే ॥ఏక్ సవాల్॥
ఆ-చాంద్ కి మాథే దాగ్ హై ఫిర్ క్యూ చాంద్‌కో లాజ్ న ఆయే
ఉస్‌కా ఘట్‌తా బఢ్‌తా చెహరా క్యూ సుందర్ కెహలాయే
అ- కాజల్ సే నయనోం కి శోభా క్యూ దుగ్‌నీ హోజాయ్
గోరే గోరే గాల్ పే కాలా దిల్ క్యూ మన్ కో భాయే ॥ఏక్ సవాల్॥
అ-ఉజియాలే మే జో పర్‌చాయి పీఛే పీఛే ఆయే
వొహి అంధేరా హోనే పర్ క్యూ సాథ్ ఛోడ్ ఛుప్‌జాయే
ఆ-ఛుప్‌నే క్యూ భీ రహతే హై అప్‌నే ఔర్ పరాయే
బురీ ఘడీమే క్యూ హర్ కోయీ దేఖ్ కే భీ టక్‌రాయే ॥ఏక్ సవాల్॥
అ-ఇస్ పే ఛూనే సే మిట్టీ భీ సోనా హో జాతీ హై
ఇస్ కా సాయా పడేతో దౌలత్ మిట్టీ బన్ జాతీ హై
అ-మెహనత్ కశ్ మిట్టీ కో ఛూలే సోనా హో జాయే
ఆంఖ్ న దేఖా హిల్ కా దౌలత్ మిట్టీ మే మిల్ జాయే ॥ఏక్ సవాల్॥









**జీనా దుష్వార్ హై** (బతుకు కష్టమైపోతోంది కదా అంటే ఊ అంటుంది)

**ఆజ్ సోమ్‌వార్ హై** (ఇవాళ సోమవారం కదా అంటే 'అబ్బ... అవును' అంటుంది)

అదే ధోరణిలో **'తుమ్ కో ముఝ్‌సే ప్యార్ హై'** అంటే తనూ అదే ధోరణిలో 'ఊ' అంటుంది. వెంటనే తప్పు తెలుసుకుని 'ననననన' అని గోల పెడుతుంది. గీతపరంగా, గానపరంగా, సంగీతపరంగా ఇది చాలా చక్కని సంవాదగీతం. (ఆరాధన - లతాతో)

సరిగ్గా సంవాదం కాకపోయినా, దాగుడు మూతల ఆట కోసం కూడా వీళ్ళు పాటలు పాడుకున్నారు.

చిత్రం : ఆర్‌పార్ రచన : మజ్రూహ్ సుల్తాన్‌పురి
సంగీతం : ఓ.పి.నయ్యర్ అభినయం : గురుదత్, శ్యామ

అ-సున్ సున్ సున్ జాలిమా ప్యార్ హమ్‌కో తుమ్సే హో గయా
దిల్‌సే మిలా లే దిల్ మేరా తుఝ్ కో మేరీ కసమ్
ఆ-జాజాజా బేవఫా కైసే ప్యార్ కైసే ప్రీత్ రే
తూ నా కిసికీ మీత్ రే ఝూఠ్ తేరీ ప్యార్ కీ కసమ్ ॥సున్ సున్॥
అ-ప్యార్ కి నజర్ సే దూర్ యూ న జిందగీ గుజార్
హుస్న్ తూ హై ఇష్క్ మై, కర్ దిలే నజర్ కో చార్
ఆ-చార్ మై నజర్ కరూ ఔర్ ఫిర్ హజూర్ సే
పాస్ యూ న ఆయియే, బాత్ కీజియే దూర్ సే ॥జాజాజా॥
సున్ సున్ సున్ జాలిమా జాజాజా బేవఫా
అ-దూర్ కబ్ తలక్ రహూ ఫూల్ తూ హై రంగ్ మై
మై కహూ తేరే లియే డోర్ తూ పతంగ్ మై
ఆ-హార్ గయీ పతంగ్‌జీ డోర్ ఆప్ న డాలియే॥2॥
ఔర్ కిసీకీ సామ్‌నే జాకే దిల్ ఉఛాలియే ॥సున్ సున్॥
జాజాజా బేవఫా సున్ సున్ సున్ జాలిమా
అ- బాత్ రహ్‌నే జాయే ఫిర్ వక్త్ యే గుజర్ న జాయ్
మేరే ప్యార్ కా యే హార్ టూట్ కర్ బికర్ న జాయ్
ఆ-ప్యార్ ప్యార్ కెహకే తూ దిల్ మేరా న లూట్ రే
కెహ్ రహో తూ జుబా సే ఝూట్‌మూట్ రే॥జాజాజా బేవఫా॥ ॥సున్ సున్॥
అరే సున్ సున్ సున్ జాలి జాజాజా బేవఫా



ఆ మేరే హమ్‌జోలీ ఆ - ఖేలే ఆంఖ్ మిచోలీ ఆ
గలియోమే చౌబారో మే - బాగోమే బహారో మే హా
మై ఢూంఢూ, తూ ఛుప్ జావో -
మై ఆవూ...? న,..న, మై ఆవూ...? న..న..న, ఆవూ.....?, ...ఆజా
(జీనేకీ రాహ్-లతా, బృందంతో)

దాగుడు మూతలాడదామని పిలిచి, రావచ్చా అని అతనడిగితే, ఆమె ఇప్పుడే కాదని రెండుసార్లు చెప్పి, తను దాక్కున్నాక, అప్పుడు రమ్మంటుంది. ఇలాంటి సంభాషణ పాట ఆసాంతం సాగుతుంది.

అబ్బాయి చాలా ఆర్తిగా తన ప్రేమను ప్రకటించుకుంటూ ఉంటే, దాన్ని కాలదన్నే విధంగా జవాబిచ్చే అమ్మాయిలూ ఉంటారు. అలాంటి పాటే ఇది.

'హమ్ ఆప్ కీ ఆంఖోమే ఇస్ దిల్ కో బసాదేతో' అని అతనంటే
'హమ్ మోంద్ కే పల్‌కోంకో ఇస్ దిల్‌కో గిరాదేతో' (ప్యాసా- గీతాదత్‌తో)

అని అతని హృదయాన్ని గాయపరిచే మాటలే అంటుందావిడ. పాటంతా ఇదే ధోరణి. తను అలసి సొలసి ఆమె పాదాలపై వాలిపోతానని అతనంటే, తను కొంగుతో విసరను కూడా విసరనని ఆమె అంటుంది

అతని ప్రేమను అర్థం చేసుకోవడం, నమ్మకపోవడం కూడా సంవాదంలో భాగమే!

'సున్ సున్ సున్ సున్ జాలిమా - ప్యార్ హమ్ కో తుమ్ సే హోగయా
దిల్ సే మిలాలే దిల్ మేరా - తుఝ్ కోమేరీ ప్యార్ కీ కసమ్'
అని అతను వేడుకుంటే,
'జా జా జా జా బేవఫా, కైసే ప్యార్ కైసే ప్రీత్ రే
తూన కిసీకీ మీత్ రే -తుఝ్ కో మేరీ ప్యార్ కీ కసమ్ '

(ఆర్ పార్ -గీతాదత్‌తో) అని తోసిపుచ్చుతుంది.

నాయకుడు ఆమెను ప్రేమ కోసం అర్థిస్తాడు. ఆమె అంగీకరించదు. నాయిక అతన్ని వదిలిపెట్టమంటుంది. అతను అంగీకరించడు. సరదాగా సాగే ఈ గీతం.

ప్యార్ సే దిల్ భర్ దే - నహీ నహీ
హమ్ పే కరమ్ కర్ దే - కభీ నహీ
వర్‌నా హమ్ మర్ జాయేంగే వో జాలిమ్ - జాన్ మేరా లేలే'

అని అతని ప్రార్థనలన్నీ ఆమె వీటో చేసి,

ఛోడ్ మేరీ రాహే అంటే అతను నహి నహీ అంటాడు. ఇలాగే ఇద్దరూ వాదులాడుకోవడం చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది. (కబ్, క్యూ, ఔర్ కహ - ఆశతో)

మరో సన్నివేశంలో ఆమె అలుగుతుంది. అతను బతిమిలాడతాడు. చస్తే అలక మాననంటుంది. అలిగి తీరుతానని గోలచేస్తుంది.

నరూఠో రూఠో నరూఠో మేరీ జా - ఇసీ బహనే ఆజ్ తేరీ మేరీ - హోగయి పెహచాన్ అని అతను, మై రూఠూంగీ తుమ్ సే రూఠూంగీ మై రూఠూంగీ తుమ్‌సే అని ఆవిడ పట్టుబడుతుంది. (జవా మొహబ్బత్ - ఆశతో ).

రఫీ, ఆశా కాంబినేషన్‌లో వాద సంవాదాలు చాలా కనిపిస్తాయి. 'కైసే సమ్ ఝూవూ బడీ నసమఝ్ హో' (సూరజ్), వో పరదా హటాదే జర ముఖ్‌డా దిఖాదే (మాధవి), 'దిల్ దేదే, నై, నై, నై' (జాల్), ఆప్ కో ప్యార్ ఛుపానే కీ బురీ ఆదత్ హై (నీలా ఆకాశ్) వంటివి ఎన్నో. వీటన్నిటిలోకి అద్భుతమైన పాటలు రెండు.

అచ్ఛాజీ మై హారీ చలో మాన్ జావో నా
దేఖీ సబ్ కీ యారీ మేరా దిల్ జలావోనా (కాలాపానీ)

నాయిక బతిమిలాడుకోవడం, క్షమించమనడం, నాయకుడు ససేమిరా అనడం - పాటంతా ఆపాతమధురంగా సాగుతుంది.

ఇక నాయకుడి వంతు, అప్పుడే తనని వదిలి వెళ్లవద్దని నాయికను బతిమిలాడుకోవడం.

'అభీ న జావో ఛోడ్ కర్ - కి దిల్ అభీ భరా నహీ' (హమ్ దోనో)

ఆమెకు వేళ మించిపోతోంది. అతనికి తనివి తీరడం లేదు. ఇద్దరి వాదనలు సబబుగానే ఉంటాయి. పాటయితే, ఎన్ని సార్లు విన్నా తృప్తి కలగనంత గొప్పగా ఉంటుంది.

నిజానికి వాద సంవాదాలు అద్భుతంగా అమరేది ఖవ్వాలీ లలో . ఇవి చాలా సార్లు హిందీ సినిమాల్లో పోటీ రూపంలో ఉంటాయి.

ముకాబ్‌లా హమ్‌సే న కరో - ముకాబ్‌లా హమ్‌సే నకరో
హమ్ తుమ్హే అప్‌నే రంగ్ మే రంగ్ డాలేంగే ఏక్ హీ పల్ మే'
(ప్రిన్స్ - లతాతో )

అంటూ నాతో నువ్వు పోటీ పడలేవు అని చెప్పేవి ఉన్నాయి.

మేరీ తస్ వీర్ లేకర్ క్యా కరోగే తుమ్ - మేరి తస్ వీర్ లేకర్ ' (కాలా సముందర్-గీతాదత్, మన్నాడేలతో), మై ఇధర్ జావూ యా ఉధర్ జావూ (తాజ్‌మహల్ - మన్నాడే, ఆశాలతో), 'రాజ్‌కీ బాత్ కెహదూ తోజానే మెహఫిల్ మే క్యాహోగా' (ధర్మా-ఆశతో) ఇలా ఖవ్వాలీ లక్షణమే వాద సంవాదం కనక, అందులో ఇలాంటి పాటలు అనేకం దొరుకుతాయి.

హిందీ సినిమాపాటల్లో వాద సంవాదాలకు ప్రత్యేక ప్రయోజనం లేకపోవచ్చు. కానీ ఏ విషయాన్నయినా కొత్తగా, ఉక్తివైచిత్రితో చెప్పడానికి ఇదో గొప్ప రచనాశిల్పం. అన్ని రకాల పాటల్లాగే వీటిలో కూడ రఫీదే పై చేయి. తక్కువ పాటలు పాడిన బల్బీర్, కమల్ బారోట్, ఉషా మంగేష్కర్, దిల్ రాజ్ కౌర్, కృష్ణా కల్లే వంటి గాయకులతో కలిసి, రఫీ ఎన్నో పసందైన వాద ప్రతివాద గీతాలు పాడాడు. ఇలాంటి పాటలు ఇప్పటికీ ఎంత సూపర్ హిట్టో గుర్తు తెచ్చుకోడానికి ఒక్క ఉదాహరణ చాలు.

'జానే కహా మేరా జిగర్ గయా జీ
అభి అభీ యహీ థా కిధర్ గయా జీ' అని అతనంటే
కిసికీ అదావోంపే మర్ గయాజీ
బడీ బడీ అఖియోంసే డర్ గయా జీ' (మిస్టర్ & మిసెస్ 55 లో గీతాతో)

అని ఆవిడ పరాచికాలాడిన హాస్య భరిత సంవాదం ఏనాటికైనా మరచేమా?

- మృణాళిని




# బూమ్ బాస్టిక్ షగ్గీ

స్టేజీపేరు
షగ్గీ
అసలుపేరు
ఓవిల్లీ రిచర్డ్ బ్యూరెల్
పుట్టిన తేది
22 అక్టోబర్ 1968
రాశి
లిబ్రా (తుల)
జన్మస్థలం
కింగ్స్‌టౌన్, జమైకా

ఇంటర్నేషనల్ హిప్ - హోప్, రెగ్గీ స్టార్ షగ్గీ దృష్టి ఇప్పుడు బాలీవుడ్ మీద పడింది. రెండేళ్ళ క్రితం ముంబాయిలో జరిగిన ఛానల్ 'వి' అవార్డుల ఉత్సవంలో 'బూమ్ బాస్టిక్' గీతాన్ని పాడిన షగ్గీ - కిందటి నెలలో ఢిల్లీ, ముంబాయిల్లో జరిగిన కార్యక్రమాలలో పాల్గొన్నాడు. అతను జన్మించిన జమైకాకు ఇండియాకు ఎంతో సామీప్యం వుందని, భారత్‌ను చూస్తే తన జమైకానే చూసినట్టు అనిపిస్తుందని ఈ పాప్‌సింగర్ చెబుతున్నాడు.

1968 అక్టోబర్ 22న జమైకాలోని కింగ్స్‌టౌన్‌లో జన్మించిన షగ్గీ అసలు పేరు ఓవిల్లీ రిచర్డ్ బ్యూరెల్. 18సంవత్సరాల వయసు వచ్చాక న్యూయార్క్‌లో వుండే తల్లి దగ్గరకు వచ్చి, ఆ పరిసరాల్లో వుండే జమైకావాసుల సమక్షంలో పాటలు పాడుతుండేవాడు.

1988లో నార్త్ కొరోలినాలో సైన్యంలో చేరినా, ఖాళీ సమయాలను తన సంగీతాన్ని సానబెట్టడానికి ఉపయోగించే వాడు. ఉద్యోగంలో ఏమాత్రం శలవు దొరికినా న్యూయార్క్‌కి వచ్చి రికార్డింగ్స్‌లో పాల్గొనేవాడు. ఇటు ఉద్యోగం, అటు సంగీత సాధనా చేస్తూనే 20 సంవత్సరాల వయసులో 'మ్యాన్ ఎ మి యార్డ్' అనే సింగిల్‌ను విడుదల చేశాడు. ఆ తర్వాత లాయడ్ క్యాంప్‌బెల్, షగ్గీతో 'బిగ్ హుడ్' అనే సింగిల్‌ను రూపొందించాడు. రేడియో డిజె గా పనిచేసే స్టింగ్‌తో ఏర్పడిన పరిచయంతో షగ్గీ రూపొందించిన 'మామ్‌మీ', 'బిగ్ఆప్' పాటలు న్యూయార్క్‌లోని రెగ్గీ అభిమానుల్ని అలరించాయి.

ఇంతలో మిలట్రీలోవున్న షగ్గీ 1991లో 'ఆపరేషన్ డిజర్ట్ స్టార్మ్' లో పాల్గొనేందుకు 5 నెలలు కువైట్‌కి వెళ్ళాల్సి వచ్చింది. అక్కడ నుండి తిరిగి న్యూయార్క్‌కి తిరిగి వచ్చాక 'ఓ కరోలినా' సింగిల్‌ను విడుదల చేశాడు. ఇది అమెరికాలోనే కాకుండా విదేశాలలోనూ మంచి ఆదరణ పొందింది. లండన్‌లో 'ఓ కరోలినా' ను 1992లో గ్రీన్స్‌లీవ్స్ కంపెనీ విడుదల చేసింది. బ్రిటిష్ పాప్ ఛార్ట్స్‌లో ఈ సింగిల్‌కి స్థానం దక్కింది. 1993లో 'ప్యూర్ ప్లజర్' ఆనే ఆల్బమ్‌ను షగ్గీ విడుదల చేశాడు. అదే సంవత్సరం గ్రీన్స్‌లీవ్స్ కంపెనీ, షగ్గీ సింగిల్స్‌ను 'ఒరిజినల్ డాబెర్‌మ్యాన్' పేరుతో విడుదల చేసింది.

1995లో 'బూమ్ బాస్టిక్' ట్రాక్‌తో తన సత్తా యేమిటో నిరూపించుకున్నాడు షగ్గీ! పదిలక్షలకు పైగా కాపీలు అమ్ముడు పోవడమేకాక పాప్ చార్ట్‌స్‌లోనూ, ఆర్ & బి చార్ట్స్‌లోనూ స్థానం సంపాదించుకుంది సింగిల్! అలానే గ్రామీ అవార్డుల్లో బెస్ట్ రెగ్గీ ఆల్బమ్‌గా ఎంపికయ్యింది. దెబ్బకి అంతర్జాతీయంగా గుర్తింపు వచ్చి షగ్గీ దాదాపు 75 దేశాలలో ప్రదర్శనలను నిర్వహించగలిగాడు.

**డిస్కోగ్రఫీ**

**ఆల్బమ్**

లక్కీడ్, ఒరిజనల్ డొబెర్‌మాన్, హాట్ షాట్, ఆల్ వర్జిన్స్, మిడ్‌నైట్ లవర్, బూమ్‌బాస్టిక్, ప్యూర్‌ప్లజర్.

**టాప్ సింగిల్స్**

ఏంజల్, బూమ్‌బాస్టిక్, ఓ కరోలినా, ఇన్‌ద సమ్మర్ టైమ్, దట్ గర్ల్, లవ్‌మీ, ఇట్ వాజ్ నాట్ మీ.

## బాలీవుడ్‌లోనూ పాటలు..!

ఇప్పటికే రెండుసార్లు భారత్ పర్యటించిన షగ్గీకి ఈ దేశం పట్ల అపరిమితమైన అభిమానం పెరిగింది. "భారతీయ సంగీతం చక్కటి అనుభూతిని కలిగిస్తుంది. ఈ సంగీతంలో వుండే ఆధ్యాత్మిక భావన హృదయం లోలోతులకు వెళుతుంది. ఆ భావనే ఈ దేశం పట్ల నాకు మరింత ప్రేమను కలుగచేస్తోంది" అంటున్నాడు షగ్గీ.

హిందీ చిత్రాలకు పాటలు పాడాలని వుందని, మంచి అవకాశం కోసం ఎదురు చూస్తున్నానని చెబుతూనే "భారత్‌లో సంగీత ప్రపంచానికి గట్టి దెబ్బ పైరసీ వల్ల కలుగుతోంది. పైరసీని అదుపులో పెట్టనంతవరకూ మ్యూజిషియన్లకు, సింగర్లకు నష్టమే. దాన్ని నివారించగలిగితే భారత్ చక్కటి మార్కెట్‌గా గుర్తింపు పొందుతుంది. ఆ రోజు కోసం ఎదురుచూస్తున్నాను" అని చెబుతున్నాడు షగ్గీ.

ఈసారి ఏపని పెట్టుకోకుండా భారత్‌కు వస్తానని, అప్పుడు కేవలం పర్యటన మాత్రమే చేస్తానని... ఇక్కడ చూడాల్సిన ప్రదేశాలు ఎన్నో వున్నాయని - ముఖ్యంగా 'తాజ్‌మహల్ వీక్షణ' తనకెంతో ప్రధానమని అంటున్నాడు.

ఆ మధ్య ఓ ప్రదర్శనలో పాల్గొనడానికి భారత్ వచ్చిన 'టాటాయంగ్' ఆ తర్వాత 'ధూమ్' చిత్రంలో ఓపాట పాడటమే కాకుండా వీడియోలో నటించే అవకాశాన్ని పొందింది! రేపు షగ్గీ కూడా ఏ బాలీవుడ్ చిత్రం ప్రమోషన్ ఆల్బమ్‌లోనే నటించొచ్చు!

**- వి.అరుణ సత్యవతి**

**రచన: దాశరథి — గానం: సుశీల**

రాజనర్తకి
రారా ! ప్రియా ! సుందరా !
కౌగిలిలో నిన్ను కరగింతురా ॥రారా॥
వెన్నెలవేళ విలాసాలతేల, వేచితి నీకై క్షణాలే యుగాలై
విరహముతో నేను వేగినదాన, సరగున నన్నేలరా ॥రారా॥

**పోతన 'భాగవతం' నుండి — గానం: మాధవపెద్ది సత్యం**

హిరణ్యకశిపుడు
సీ॥ భుజశక్తి నా తోడ పోరాడ శంకించి
మున్నీట మునిగిన మునుగుగాక
అలయించి పెనగు నా అచల సంభ్రమమున
కెరగి వెన్నిచ్చిన నిచ్చుగాక
జగడంబు సైపక సౌకర్యకాంక్షియై
యిలక్రింద నీగిన నీగుగాక
క్రోధించి యటుగాక కొంత పౌరుషమున
హరి భంగి నడరిన నడరుగాక
ఆ॥ కఠిన శూలధార కంఠంబు విగళించి
వాని శోణితమున వాడి మెరసి
మత్సహోదరునకు మహితర్పణము చేసి
మరలి వత్తు మీకు మేలుదెత్తు॥

**రచన: పాలగుమ్మి పద్మరాజు — గానం: జానకి**

లీలావతి :
జననీ ! జననీ॥
జననీ వరదాయనీ త్రిలోచని
నీపద దాసిని కావగదే ॥జననీ॥
పతి ఎడబాటే సైపగలేక ! పశుపతిలోన సగమైనావే
కాంతుని చూపే కరవైపోయె ! (యిన .....యిన)
దీనను దయగన రాదా ॥జన॥
నా పతి ఏగతి తాపసియై
ఘోరాటవిలో కృశియించేనో
తపమును వేగమె సఫలము జేయవే (జేసీ...జేసీ)
విజయము ఈయవె దేవీ ॥జన॥

**రచన: దాశరథి — గానం: బాలమురళీకృష్ణ**

నారదుడు :
ఆది అనాదియు నీవే దేవా
నింగియు నేలయు నీవే కావా ॥ఆది॥
అంతట నీవే ఉండెదవు
శాంతివై కాంతివై నిండెదవు ॥ఆది॥
దీనజనావన నారాయణా
మదమోహిత దానవ సంహరణా
మాయని జ్యోతివో, తీయని గీతివో
ఏమని వర్ణింతురా
తరుణ బిందువున, విరళసింధువున
ఎచట చూచినను నీవేకదా
కనులలోన మనసులోన నీ రూపమే ॥ఏమని॥
నారద సన్నుత నారాయణా
నరుడవో సురుడవో
శివుడవో లేక శ్రీసతి పతివో
నారద సన్నుత నారాయణా
దానవ శోషణ మానవ పోషణ
శ్రీచరణా భవ హరణా
కనక చేల భయశమన శీల
నిజ సుజనపాల హరి సనాతనా
క్షీర జలధిశయనా ! అరుణ కమలనయనా
గాన మోహనా! నారాయణా!

**రచన : ఆరుద్ర — గానం : జానకి,బాలమురళీకృష్ణ**

లీలావతి:సిరిసిరి లాలి చిన్నారి లాలి
నోముల పంటకు నూరేళ్ల లాలీ
ఊగుమా ! ఊయలా ॥సిరి॥
పాలకడలిలో జాబిలిరీతి
వరలుము రతనాల గారాల బాల
ముద్దుల మూట మురిపాల తోట
ముసిముసి నవ్వుల ముత్యాలకోట
ఊగుమా ! ఊయలా ॥సిరి॥
నారద: పదునాల్గు లోకాల తరియింపజేయ
ప్రభవించి నావయ్య వరభక్తశీల
కలలెన్నో నీ కొరకు కాచుకొని పూచే
ఫలియింపజేయుమా అరుదైన బాల
ఊగుమా ! ఊయలా ॥సిరి॥
లీలా: కులదీపమై వెలుగు కొమరుని జూచి
దీవించు నీ తండ్రి ఎచ్చోటనున్నా
నీవారి ఆశలు నెత్తావులీని
నిరతము నీ కీర్తి వికసించునన్నా
ఊగుమా ! ఊయల

**పోతన 'భాగవతం' నుండి — గానం : మాధవపెద్ది సత్యం**

హిరణ్యకశిపుడు :
గాలిం కుంభిని అగ్నిన్ అంబువుల ఆకాశ స్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములన్ దమః ప్రబల భూరిగ్రాహ రక్షోమృగ
వ్యాళాదిత్యనరాది జంతు కలహ వ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ యిప్పింపవే॥

**రచన: సముద్రాల జూనియర్ — గానం : సుశీల,జానకి,రాజ్యలక్ష్మి**

రంభ, మేనక, ఊర్వశి, తిలోత్తమ
జయహో !
సమస్త దానవ సామ్రాజ్య సంస్థాపన ధురీణా
జయహో ! జయహో ! జయహో !
అందని సురసీమ నీదేనోయీ
అందరు ఆశించు అందాల హాయి
అందించే నెరజాణలమోయి ॥అందని॥
రంభ: మంజులవల్లి నికుంజములోన,
రంజిలగా మోవి అందీయనా
పాలవెన్నెలా జాలునా, వాలుకన్నులా ఏలనా
అందమందు చిందులందు, దృఢ పరిరంభమందు
నాకు సాటి నేనే ॥అందని॥
మేనక: కోరికేమొ సెలవీర, సుకుమార! రణధీర
సోయగాల నడలా
వాలి ఒడిలో సోలిపోయేనా
లాలించి రాగ రసడోలా
తేలింతు ప్రేమభోగాలా
మేన కానరాని వలపుతీరుల
మెలగి మేను మరువజేయు మేటిని ॥అందని॥
ఊర్వశి: మై మరుతువులేరా! మగరాయా వగదీర
మనసార కౌగిలీర, వయసు తలపులూర
వలపేరు పొంగువార, మరుని కోర్కెతీర
మనసేల ఊర్వశేరా ॥అందని॥
తిలోత్తమ: వన్నెలా కడకన్నులా విన్యాసాలలోనా
సరి సరికేళీ విలాసాలలోన, పనిదప రిగ మదపమ
సరిగపమ రిమదీ - సగరి - సనిదపదసరిగ
ప్రేమసితార సుతారాల తార
జాణతిలోత్తమయే...... జాణతిలోత్తమయే ॥జాణ॥

**రచన : కొసరాజు** | **గానం : మాధవపెద్ది, పిఠాపురం**

చండా: హిరణ్యకశిపుని దివ్య చరిత్రము
నవరస భరితమురా ॥హిర॥
వినవినవెంతో వీనుల విందై వింత గొల్పుగదరా॥హిర॥
చండా: వెడలెను రాక్షసనాధుడు
విజయ దుందుభులు మొరయుగ ॥వెడ॥
చండా: బేలలగుచు దిక్పాలకులందరు
భీతి జెంది గొందులబడిపారగ ॥వెడ॥
చండా: ఓరోరి వరుణా రారా! చర్మమొలిపించెదను చూడరా
నెల మూడు వానాలు
అమర్క: కురిపించుటలు మాని
అహ పైరు పచ్చల పెంపు
అమర్క: గావించుటలు మాని
దేశదిమ్మరులగుచుయ తిరుగుచున్నారట
ఓరోరి వరుణా రారా! చర్మమొలిపించెదను చూడరా

**రచన : కొసరాజు** | **గానం : సుశీల**

చెట్టుమీదా ఒక్క చిలుకుంది!
దాని పక్కగానే జామపండుందీ!
చూసీ చూడకుండా చప్పరించకుండ!
ఎగిరిపోతే లాభమేముంది! అయ్యో! ఎగిరిపోతే లాభమేముంది
॥చెట్టు॥
ఊర్వశి తా వచ్చి వొయ్యార మొలికింప
మొగము తిప్పకొని వచ్చావు
రాజాధిరాజ హిరణ్య మహారాజా
వలపు జూపక మనసు దాచేవు -అయ్యో
మెత్తని నీ మనసు దాచేవు ॥చెట్టు॥
చందమామ వచ్చి ముందునిల్చిన ఏమొ
వెచ్చంగ వుందయ్యా దేహం -అబ్బ
వెచ్చంగ వుందయ్యా దేహం నా దేహం
చల్లని నీ చేయి తగిలితేనే చాలు
తీరిపోతుందయ్యా మోహం
చల్లారిపోతుంది తాపం విరహతాపం ॥చెట్టు॥

**రచన : దాశరథి** | **గానం : సుశీల**

ప్రహ్లాదుడు
కరుణలేని మనసు కఠిన పాషాణంబు
జాలి గలుగువాడె సజ్జనుండు
సాధు జంతువులను బాధింపవలదయ్యా
ప్రాణిహింస ఘోరపాపమయ్యా

**రచన : వేదం** | **గానం : సుబ్రహ్మణ్య శాస్త్రి, పద్మ**

చండామార్కులు, ప్రహ్లాదుడు
ఓం అగ్నిమీళే పురోహితం, యజ్ఞస్య దేవ మృత్విజం, హొతారం
రత్నధాతమం
ఓం ఇషేత్వోర్జేత్వ వాయవస్థో పాయవస్థ
దేవోవత్సవితా ప్రార్పయతు। శ్రేష్ఠతమాయ కర్మణే
ఓం అగ్న ఆయాహి వీతయే , గ్రిణానో హవ్యదాతయే
నిహోతా నత్సి బర్హిషి॥
ఓం శన్నో దేవి రభిష్టయ ఆపోభవంతు పీతయే
శంయో రభిస్రవంతునః

**పోతన 'భాగవతం' నుండి** | **గానం : సుశీల**

ప్రహ్లాదుడు
కం॥ చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖ్యశాస్త్రంబులు నే
చదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ॥

**పోతన 'భాగవతం' నుండి** | **గానం : సుశీల**

ప్రహ్లాదుడు
ఉ॥ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటి నూతిలోపలం
ద్రెళ్లక వీరు మేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్ అతని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లము జేర్చి తారడవి నుండుటమేలు నిశాచరాగ్రణీ॥

**పోతన 'భాగవతం' నుండి** | **గానం : సుశీల**

ప్రహ్లాదుడు
సీ॥మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురితచకోరకం
బరగునే సాంద్రనీహారములకు
తే॥అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల॥

**పోతన 'భాగవతం' నుండి** | **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
సీ॥కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవన కుంభిత చర్మ బస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరి పూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
తను కుడ్యజాల రంధ్రములుగాక
ఆ॥చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగము తోడి పశువుగాక॥

**పోతన 'భాగవతం' నుండి** | **గానం : మాధవపెద్ది**

హిరణ్యకశిపుడు :
చ॥ పటుతర నీతి శాస్త్రచయ పారగు చేసెదనంచు బాలునీ
వటు గొనిపోయి వానికి ననర్థములైన విరోధి శాస్త్రముల్
కుటిలత జెప్పినాడవు భృగు ప్రవరుండ వటంచు నమ్మితిన్
కటకటా బ్రాహ్మణాకృతివిగాక యదార్థపు బ్రాహ్మణుండవే!

**రచన : సముద్రాల** | **గానం : బాలమురళీకృష్ణ**

నారదుడు :
వరమొనగే వనమాలీ !
నా వాంఛితమ్ము నెరవేరునుగా ॥వర॥
తామసవాదుల దర్పముతొలగీ
ధర్మపాలనా ధరణివెలయుగా
దాసుల బ్రోచీ శాంతినిలుపగా
పన్నగశయనుడు సరసిజనయనుడు
అవతరించుగా! ॥వర॥
ఎందువెదకిన కనరాక హేమకశిపు
హృదయమున తిష్టవేసి తబ్బిబ్బుజేసి
నిసుగు నుసికొల్పి ఆడించు నీదులీల
పరులకు గ్రహింప శక్యమా! గరుడగమనా! ॥వర॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల బృందం**

ప్రహ్లాదుడు :
ఓం!నమో ! నారాయణాయ!
నారాయణ మంత్రం శ్రీమన్నారాయణ భజనం ॥నారా॥
భవ బంధాలూ పారద్రోలీ
పరము నొసంగే సాధనం
గాలిని బంధించీ హరించీ గాసిల పనిలేదు
జీవుల హింసించీ క్రతువులా చేయగ పనిలేదు
మాధవా ! మధుసూదనా ! అని
మనసున తలచిన చాలుగా ॥నారా॥
తల్లియు తండ్రియూ నారాయణుడే!
గురువూ చదువూ నారాయణుడే!
యోగము యాగము నారాయణుడే!
ముక్తియు దాతయు నారాయణుడే!
భవబంధాలూ పారద్రోలీ
పరము నొసంగే సాధనం ॥నారా॥
నాధ హరే! శ్రీనాథ హరే!
నాధ హరే జగన్నాధ హరే!

**పోతన 'భాగవతము' నుండి** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
క॥ బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు ప్రాణులకును
బలమెవ్వండు అట్టి విభుడు బలమసురేంద్రా!!

**రచన : సముద్రాల** **గానం : సుశీల, జానకి**

హే జ్యోతి స్వరూపా...
నారాయణా...
ప్రహ్లా : కనులకు వెలుగువు నీవే కావా
కనబడు చీకటి మాయేకాదా
నిను గనలేని ప్రాణీ బ్రతుకే
నిజముగ చీకటి యౌగా దేవా ॥కను॥
లీలా: పేరుకు నేను తల్లినెగానీ ! ఆదుకొనాలేనైతి
పాలనుత్రాపీ ఆకలిబాపే! భాగ్యమునైనా నోచని నాకూ
ఏల జనించితివయ్యా! నాకేల జనించితివయ్యా
ప్రహ్లా: అండగనుండా విధాతవీవూ! ఆకలిదప్పుల బాధేలేదు
నారాయణ నామామృత రసమే
అన్నము పానముగావా దేవా! ॥కను॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల బృందం**

ప్రహ్లాదుడు :
ఆదుకోవయ్యా! ఓ! రమేశా! ఆదుకోవయ్యా
పతితపావన శ్రితజనావన సుజన జీవన మాధవా!
భువననాయక ముక్తిదాయక భక్తపాలక కేశవా ॥ఆ॥
బృందం:
సర్వలోక కారణా! సకలశోక వారణా!
జన్మజన్మ కారణా! జన్మబంధ మోచనా!
దుష్టగర్వ శిక్షణా! శిష్ట శాంతి రక్షణా! శాంతి రక్షణా!

**పోతన 'భాగవతము' నుండి** **గానం : మాధవపెద్దిసత్యం**

హిరణ్యకశిపుడు :
శా: పంచాబ్దంబులవాడు తండ్రినగు నా పక్షంబు నిందించి !య
త్నించిబ్భీతియులేక ! విష్ణున్ సహితుం కీర్తించుచున్నాడు వ
ల్దంచున్ చెప్పిన మానడు! అంగమున పుత్రాకారతన్ జాతి జ
న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీమీ
పటుత్వంబులన్

**రచన : సముద్రాల** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు
జీవము నీవేకదా దేవా జీవము నీవే కదా!
బ్రోచే భారము నీదేకదా నా భారము నీదే కదా!!
జనకుడు నీపై కినుక వహించీ నను వధియింప మదినెంచే
చంపెదెవరూ సమసేదెవరూ సర్వము నీవేకదా స్వామీ॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు
నిన్నేగానీ పరులనెరుంగా!
రావే! వరదా! బ్రోవగ రావే! వరదా! వరదా!
అని మొరలిడగా కరివిభు గాచిన
స్వామివి నీవుండ భయమేలనయ్యా॥
జీవము నీవేకదా॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
హే! ప్రభో! హే ! ప్రభో!
లక్ష్మీ వల్లభ! దీనశరణ్యా! కరుణా భరణా! కమలలోచన!
కన్నులవిందువు చేయగరావే! ఆశ్రిత భవ బంధ నిర్మూలనా!
లక్ష్మీ వల్లభా ! లక్ష్మీవల్లభా

**రచన : కొసరాజు** **గానం : పిఠాపురం నాగేశ్వరరావు, ఎల్.ఆర్.ఈశ్వరి, బృందం**

పాములవాళ్లు :
సూరి: పాములోళ్లమయ్యా! మా పెగ్గ చూడరయ్య బల్లె ॥పా॥
సూరి: ఈరిగాడు తమ్ముడు బంగారుగాడు ఉన్నడు
సుబ్బిగాడి అల్లుడు చిన్నబ్బి గాడు ఉన్నడు
సింగి: కంకణాల కాటిగాడు లంకణాల కోటిగాడు
సూరి: సింకికళ్ల పోతడు మా జాతికెల్ల మొనగాడు ॥పా॥
సింగి: గొర్రెనైన బర్రెనైనా గుటకేసే కొండసిలవ
మడిసినైన మాకునైన మట్టుబెట్టు మిన్నాగు
సూరి: యిసము గక్కు బొక్కబెరుడు
తరిమికరసు తాడిగిరి ఆహో
ఇద్దరు: యీటిపాలబడ్డవాడు బతికి బట్టగట్టలేడు ॥పా॥
సూరి: బొమ్మజెముడు పొదకాడ బుస్సు బుస్సు మన్నది
తస్సదియ్య, దీని తస్సదియ్య
చెయ్యిపెడితె కస్సు కస్సు మన్నది
సింగి: కట్టుగట్టి పడితేను కదలకుండ ఉన్నది ఓహెయ్!
సూరి: ఒదిలిపెడితే పేణాల గావుపడుతనన్నది
సింగి: పగబట్టినపుడు దీని పరవళ్లు సూడాలి కాటేసేటపుడు
దీని కవ్వింపు సూడాలి
అబ్బో అబ్బో అబ్బో
సూరి: అచ్చమైన తాచు దీని కచ్చె యెవుడు కానలేడు
ఆహో ఓహో
పడిగె తిప్పి కొట్టినంటె బెమ్మకూడ తిప్పలేడు ॥పా॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
నిన్నే నమ్మి నీపద యుగళీ, సన్నుతిజేసే భక్తావళికీ
మిన్నాగుల గన భయమదియేలా, పన్నగశయనా నారాయణా॥
॥జీవము నీవేకదా ॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
మదిలో వెలిలో చీకటిమాపీ,
పథము జూపే పతితపావనా!
॥ జీవము నీవేకదా॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
భవజలధినిబడి తేలగలేనీ, జీవులబ్రోచే పరమపురుషా! నను
కాపాడి నీ బిరుదమునూ, నిలువుకొంటివా శ్రితమందార
॥జీవము నీవేకదా॥

**పోతన 'భాగవతము' నుండి** **గానం : మాధవపెద్ది సత్యం**

హిరణ్యకశిపుడు :
ఉ: ముంచిత్ వార్థులన్ గదలమొత్తితి, శైల తటంబులందు ద్రో
బ్బించితి !శస్త్రరాజి బొడిపించితి మీద నిభేంద్ర పంక్తిరొ
ప్పించితి! ధిక్కరించితి శపించితి ఘోర దవాగ్నులందు త్రో
యించితి! పెక్కుపాట్ల నలయించితి చావడు యిదేమి చిత్రమో!

**రచన : సముద్రాల** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు:
విశ్వమునిండీ వెలిగే నీవే, నాలోనుండీ నన్నుకావగా!
విషమునుద్రావా వెరువగనేలా విషధర శయనా!
విశ్వపాలనా! ॥జీవము నీవేకదా॥

**పోతన 'భాగవతము' నుండి** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
కలడంభోధి గలండు గాలి గలడాకాశంబునం కుంభినిన్
కలడగ్నిన్ దిశలం పగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
కలడోంకారమునంత్రిమూర్తుల త్రిలింగ వ్యక్తులందంతటన్
కలడీశుండు కలండు తండ్రీ! వెదకంగా నేల యీ యాయెడన్!

**పోతన 'భాగవతము' నుండి** **గానం : సుశీల**

ప్రహ్లాదుడు :
ఇందుగలడు అందులేడను
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
అందందే గలడు దానవాగ్రణి, వింటే॥

**రచన : సముద్రాల** **గానం : సుశీల, బాలమురళీ బృందం**

ప్రహ్లాదుడు :
శ్రీమానినీ మందిరా! భక్తమందారా!
త్రైలోక్య సమ్మోహనాకారా! ప్రేమావతారా!
జగన్నాథా! లోకాధినాథా!
మత్స్యావతారుండవై సోమకుంధ్రుంచి
వేదాళి రక్షించి, దేవాసురుల్ క్షీర
వారాన్నిధిన్ ద్రచ్చగా గోర, కూర్మావతారుండవై
మందంరంబెత్తి శ్రీ మోహిని వేష ముంబూని
పీయూషదానంబు గావించి, వారాహ రూపంబునన్
భంగ పాటొందు భూదేవి రక్షించి, ఈనాడు
నీ తత్వముల్ నమ్మగా లేని అజ్ఞానికిన్
సత్యదీపంబు చూపించి, మోహంబు వారించి
నీ విష్ణు భావంబు రూపించి, నీదాసకోటిన్ కటాక్షింపగా
ఈ విచిత్రా కృతింబూని వేంచేసినావా
పరంధామా! వైకుంఠధామా!
నమో ! నారసింహా!
నమో! భక్తపాలా!
విధాతాదులే వెరగు చెందు నీ
ఉగ్రరూపమూ ఉపశమింపుమా!
త్రిలోకాలకూ ప్రియంబైన నీ
ప్రసన్నాకృతి ప్రసాదింపుమా! ॥నమో॥

# కథా సంగ్రహం

విష్ణు సందర్శనమునకై సనక సనందనాదులు వైకుంఠమునకు రాగా -ద్వారపాలకులు జయ విజయులు వారిని అడ్డగించుటయే గాక అపహాస్యము చేస్తారు. అందుకు ఆ మనులు కుపితులై "భూలోకమున రాక్షసులుగ జన్మింతురుగాక" అని జయ, విజయులను శపిస్తారు. ఆ శాప ఫలితంగా జయ, విజయులు దితిగర్భమున హిరణ్యకశిప, హిరణ్యాక్షులుగా జన్మిస్తారు.

హిరణ్యాక్షుడు భూదేవిని హింసించగా, ఆమె శ్రీహరికి మొరబెట్టుకుంటుంది. శ్రీహరి వరహావతారమెత్తి హిరణ్యాక్షుని సంహరిస్తాడు.

శ్రీహరిపై పగతీర్చుకొనుటకు తగిన బలము సంపాదించుటకై హిరణ్యకశిపుడు బ్రహ్మదేవుని గూర్చి తపము చేసి వరములు పొందుతాడు.

హిరణ్యకశిపుడు యింటలేని సమయమున, దేవేంద్రుడు, లీలావతికి పుట్టబోయే బిడ్డను వధించు ఉద్దేశముతో ఆమెను చెరబడతాడు. కాని, నారదుని హితవచనములు విని, లీలావతిని నారదాశ్రమంలో వదిలి వెళతాడు. ఆ ఆశ్రమంలో లీలావతి మగ శిశువునుకంటుంది. అతనికి "ప్రహ్లాదుడని" నామకరణం చేస్తారు.

హిరణ్యకశిపుడు వైకుంఠముపై దండెత్తగా శ్రీహరి అతనికి కనిపించడు. తరువాత హిరణ్యకశిపుడు ముల్లోకములను జయించి దేవేంద్రాది దిక్పాలకులను తన దాసులుగా చేసుకుంటాడు.

దిక్పాలకులు శ్రీహరికి మొరబెట్టుకొనగా కాలము కూడివచ్చినప్పుడు హిరణ్యకశిపుని సంహరిస్తానని చెపుతాడు.

ప్రహ్లాదుడు ఐదేళ్ళవాడవుతాడు. హిరణ్యకశిపుడు తన కుమారునిపై ఎన్నెన్నో ఆశలు పెట్టుకుంటాడు. యుక్త వయసు రాగానే దానవ సామ్రాజ్య పట్టభద్రుని చేయాలని ఎన్నో కలలుగంటాడు. కుమారునికి సకల శాస్త్రములు బోధించి, నీతి కుశలుని చేయమని గురుపుత్రులు చండా మార్కులకు అప్పగిస్తాడు.

ప్రహ్లాదుడు గురువులవద్ద సకల శాస్త్రములు, వేదములు అభ్యసిస్తాడు. హిరణ్యకశిపుడు తన పుత్రుని విద్యాకౌశలము పరీక్షింప ప్రయత్నింపగా-ప్రహ్లాదుడు శ్రీహరిని స్తుతిస్తాడు. హిరణ్యకశిపుడు ఆగ్రహావేశుడవుతాడు. హరిభక్తి మానమని ఎంత బ్రతిమాలిననూ ప్రహ్లాదుడు వినడు. కుమారుని బుద్ధిమార్చుటకు హిరణ్యకశిపుడు ఎన్నో విధాల ప్రయత్నిస్తాడు. తిండి, నీరు లేకుండా, చీకటి గదిలో బంధిస్తాడు. గదా ప్రహారములచే హింసింపచేస్తాడు. అప్పటికీ ప్రహ్లాదుడు హరిభక్తి మాననందువల్ల అతనిని వధింపమని ఆజ్ఞాపిస్తాడు.

భటులు ప్రహ్లాదుని కత్తులతో నరుకుతారు. ఏనుగులచే త్రొక్కిస్తారు. పర్వతాగ్రంనుండి పడద్రోస్తారు. పాములచే కరపిస్తారు. అగ్నిలో పారవేస్తారు. కాళ్ళు, చేతులుకట్టి నడిసముద్రంలో పారవేస్తారు. శ్రీహరి ప్రభావమున ప్రహ్లాదునకు ఏ అపాయము వాటిల్లదు.

హిరణ్యకశిపుడు స్వయముగ ప్రహ్లాదునికి విషమిచ్చినా అతడు చావడు. చివరకు ఆవేశముతో "నీ హరి ఎక్కడున్నాడని" ప్రశ్నిస్తాడు. అన్నిచోట్ల ఉన్నాడని ప్రహ్లాదుడు జవాబు చెబుతాడు.

"ఈ స్తంభంలో ఉన్నాడా" అని స్తంభాన్ని విరగ్గొడతాడు. స్తంభంలో నుంచి నరసింహస్వామి ప్రత్యక్షమై హిరణ్యకశిపుని వధిస్తాడు.

ధర్మము నశించిన త్రిభువనములలో ధర్మము పునరుద్ధరించమని ప్రహ్లాదుని ఆదేశించి శ్రీహరి అంతర్ధానమవుతాడు.

-శుభమ్-

## తారాగణం

ఎస్.వి. రంగారావు, బాలమురళీకృష్ణ, రేలంగి,
ధూళిపాళ, రమణారెడ్డి, నాగయ్య, అంజలీదేవి,
జయంతి, కనకం,
**నూతన బాలనటి బేబీ రోజారమణి**
మరియు
ఎల్. విజయలక్ష్మి, గీతాంజలి, వాణిశ్రీ, నిర్మల, శాంత,
విజయలలిత, మీనాదేవి, మంజుల, సునీత, సుశీల,
వి.శివరామ్, డా॥శివరామకృష్ణయ్య,
మాల్లాది సత్యనారాయణ, వేమూరి రామయ్య,
గోవిందరావు, మండా సుబ్బారెడ్డి, డా॥రమేష్,
సురేంద్రనాథ్, కృష్ణమూర్తి రాజారావు, కోటేశ్వరరావు,
కోళ్ళ సత్యం, కాశీనాధ్ తాతా, జగ్గారావు,
అజాద్, పినిశెట్టి శ్రీరామమూర్తి, పి.వి.వి.పంతులు


ఏ.వి.మెయ్యప్పన్


చిత్రపు నారాయణమూర్తి


సముద్రాల


కొసరాజు


పద్మరాజు


ఆరుద్ర


జూనియర్ సముద్రాల


దాశరథి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| పాటలు | : సముద్రాల, దాశరథి, కొసరాజు, ఆరుద్ర, పద్మరాజు, సముద్రాల (జూ) |
| నేపథ్యగానం | : మాధవపెద్ది సత్యం, పిఠాపురం నాగేశ్వరరావు, పి.సుశీల, ఎస్. జానకి, శూలమంగళం రాజ్యలక్ష్మి, ఎల్.ఆర్.ఈశ్వరి |
| ఛాయాగ్రహణ దర్శకుడు | : విన్సెంట్ |
| ఛాయాగ్రహణం | : పోలు భాస్కరరావు, ఎ.వెంకట్ |
| సహాయకులు | : డి. బాలకృష్ణన్, ఆర్.ఎమ్.సేతు |
| శబ్దగ్రహణం,రీ-రికార్డింగ్ | : జె.జె. మాణిక్యం |
| మాటలు | : వి.ఎస్.ఎమ్. గోపాల్‌రామ్ |
| సహాయకులు | : కె. సంపత్ , జి.వి.రామమూర్తి, ఎన్.వి.సుందరం, ఎస్.ఇస్మాయిల్ |
| కళ | : ఎ.కె. శేఖర్ |
| సహాయకులు | : ఎన్.మోహన్‌రాజ్, పి.ఎల్. షణ్ముగం, ఎన్.కుప్పుస్వామి, ఎన్.శంకరలింగం |
| నాట్యాచారులు | : వెంపటి సత్యం, పి.ఎస్.గోపాలకృష్ణన్, కె.ఎస్.రెడ్డి |
| కూర్పు | : ఆర్.విఠల్ |
| సహాయకులు | : కె.ఆర్. రామలింగం, కె. రామన్ |
| ప్రాసెసింగ్ | : జెమిని స్టూడియోస్ లాబొరేటరి |
| మేకప్ | : కె.ఎస్.కిని,టి.ఎమ్.రామచంద్రన్, పీతాంబరం, పోతరాజు, భద్రరావు, సత్యం |
| సహాయకులు | : ఎల్.ముత్తప్ప, టి.ఎన్.రామచంద్రన్ |
| సెట్టింగులు | : ఆరుముగ ఆచారి, నాగన్ ఆచారి |
| దుస్తులు | : కె.వి. రహిమాన్ |
| స్టిల్సు | : ఇ.వి.కె. నాయర్ |
| ప్రొడక్షన్ ఎక్జిక్యూటివ్ | : ఆర్. రంగస్వామి, జి.వి. నాగేశ్వరరావు, |
| ప్రొడక్షన్ మేనేజర్లు | : ఎస్.కె. మోహన్‌రావు, జి. జయరాం |
| కథా సంవిధానం, సంభాషణలు | : డి.వి. నరసరాజు, బి.ఎ. |
| సంగీతం | : ఎస్. రాజేశ్వరరావు |
| సహాయకులు | : రాజగోపాల్, కృష్ణన్ |
| దర్శకత్వం | : చిత్రపు నారాయణమూర్తి, బి.ఎ. |
| సహాయ దర్శకులు | : టి.ఎస్.రామారావు, వి.తులసిదాసు |
| సహనిర్మాతలు | : ఎమ్.మురుగున్, ఎమ్.కుమరన్, ఎమ్. సరవణన్ |
| నిర్మాత | : ఏ.వి.మెయ్యప్పన్ |
| స్టూడియో | : ఏ.వి.ఎమ్. |


మాధవపెద్ది సత్యం


పిఠాపురం నాగేశ్వరరావు


పి.సుశీల


ఎస్.జానకి


ఎల్.ఆర్.ఈశ్వరి

# నేను కలగన్న భారతదేశం

"అతి పేద వ్యక్తికి కూడా ఇది తన దేశమని దీన్ని రూపొందించడంలో తన మాటకు కూడా విలువ ఉన్నదని భావించే భారతదేశం కోసం; ఉన్నత తరగతి, అధమ తరగతి అన్న వర్గీకరణ లేని భారతదేశం కోసం; అన్ని మతాల వారు సంపూర్ణమైన సామరస్యంతో మనగలిగే భారతదేశం కోసం నేను కృషి చేస్తాను."

\- మహాత్మా గాంధీ



## సమానత్వం గల భారతదేశం

**ఆయన స్వప్నం**

**మన లక్ష్యం**

**జాతిపిత 135వ జయంతి సందర్భంగా దేశం ఆయనకు నివాళులు సమర్పిస్తోంది.**

**అక్టోబరు 2, 2004**

సమాచార, ప్రసార మంత్రిత్వ శాఖ, భారత ప్రభుత్వం

davp 2004/239

HYDERABAD

# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 23

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మన్ కూతురు అశ్విని తండ్రంటే భయపడే పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించి తండ్రిని ఒప్పించి పెళ్లాడింది. వారి శోభనం జరగడానికి కొన్ని గంటల ముందు ఓ సాధువు ఎక్కడినుండో వచ్చి కోడలు గర్భం దాలిస్తే నీకు చావు తప్పదని శ్రీరామ్ తండ్రి వీరభద్రాన్ని హడలగొడతాడు. దాంతో ఒకే చూరుకింద ఉన్నా కొత్తదంపతులు కలవకూడదని ఆంక్షలు విధిస్తాడాయన. ఎడబాటు భరించలేక వారు ఎవరికీ చెప్పకుండా విజయవాడలో 'హనీమూన్' జరుపుకుందామని ప్లాను చేస్తారు. అశ్విని ముందే ఊరెళ్లిపోతుంది. శ్రీరామ్ తన ఫ్రెండు పెళ్లి వంక పెడతాడు. - ఇక చదవండి

"ఏమిటీ? నీ వివాహమునకు ఆ సుబ్బారావు వాళ్లావిడతో వచ్చాడా? అలాంటప్పుడు నీవిపుడు వాడి పెళ్లికి వెళ్ళుట ఏమిటి? ఆ తలమాసినవానికి ఇప్పుడు జరుగుతున్నది ద్వితీయ వివాహమా? అటులైన గ్రీటింగు కొట్టుట కూడ అనవసరము!" అన్నాడు వీరభద్రం విసురుగా.

తను కొంచెం 'ఓవర్' గా యాక్ట్ చేయబోయి 'డైలాగ్'ను తడబడి చెప్పిన సంగతి గ్రహించాడు శ్రీరామ్.. వెంటనే సర్దుకుంటూ అన్నాడు-

"అంటే... అదీ.. వాడిది లవ్ మేరేజ్ అన్నమాట! కాలేజిలో చదివేటప్పుడు ఓ అమ్మాని ప్రేమించాడు. ..ఆ అమ్మాయినే వెంట బెట్టుకుని నా పెళ్ళికి కొచ్చాడు... ఆ అమ్మాయినే పెళ్ళి చేసుకుంటున్నాడు.. అదన్నమాట !"

"బావున్నది ! కాలేజీ చదవుతోపాటు మీరిద్దరూ ప్రేమాయణాలు కూడా సాగించారన్నమాట! ఒకే రూమునందు అఘోరించినందుకు ఒకేరకమైన బుద్ధులు కూడా ఒంట బట్టినట్టున్నవి!"

అంతలోనే పార్వతమ్మ వెండిగ్లాసుతో మజ్జిగ తెచ్చింది.. భర్త మాటలు ఆమె చెవిన కూడా బడ్డాయి..

"అబ్బ! మీకు ఆ ఆరాలన్నీ ఎందుకు చెప్పండి? వాడింకా చిన్నపిల్లాడా ఏవన్నానా? ఏం చెయ్యాలో , చెయ్యకూడదో వాడికి తెలీదా?.. పాపం... పెళ్ళయి నాలుగు నెలలు కావస్తున్నా -పెళ్లాంతో ఓ పుణ్యక్షేత్రానికి కూడా వెళ్లిరాలేకపోయాడు. కనీసం స్నేహితుడి పెళ్లికూడా వెళ్ళద్దు పొమ్మంటే ఎలా ? అయినా రెండ్రోజులు భాగ్యానికి -ఇంత హడావిడి చెయ్యాలా?" గ్లాసు భర్తకు అందిస్తూ అడిగింది.

గ్లాసులో మజ్జిగ తాగుతూనే ఆలోచించాడు వీరభద్రం. ఆ తర్వాత ఓ నిర్ణయానికి వచ్చిన వాడిలా చెప్పాడు....

"సరే.. అఘోరించమను!"

అశ్విని వేసిన పథకం అక్షరాలా అమలు జరుగుతున్నందుకు ఆనందంతో ఎగిరి గంతేయ బోయాడు శ్రీరామ్. కానీ తండ్రికి అనుమానం వస్తుందేమోనన్న ఆలోచనతో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

వెంటనే సెల్‌ఫోన్ తీసి - గబగబా నంబర్లు నొక్కి ఫోన్లో చెప్పాడు ఉత్సాహంగా-

"ఒరే సుబ్బారావ్ ! నువ్ చెప్పినట్టే నీ పెళ్లికి వచ్చేస్తున్నాన్రా!"

అయితే శ్రీరామ్ సెల్‌ఫోన్ నొక్కిన నంబరు - అశ్వినిదనీ, 'ఒరే సుబ్బారావ్' అని శ్రీరామ్ సంబోంధించింది 'అశ్విని'ననీ -వీరభద్రానికీ, పార్వతమ్మకు తెలీదు..

* * *

భుజాన 'ఎయిర్ బ్యాగ్ ' వేసుకుని 'టౌన్ బస్టాండు' లో బస్సు దిగేడు శ్రీరామ్.

తనను 'రిసీవ్' చేసుకునేందుకు -అశ్విని పంపిస్తానని చెప్పిన కారు -బస్టాండు బయట ఉంటుందని ఊహించి -హుషారుగా ఈల పాట పాడుకుంటూ, అటువైపు వేగంగా నడిచాడు..

పదడుగులు వేశాడోలేదో 'చిన్నయ్యగోరూ' అంటూ పిలుపు వినిపించింది. బహుశా అశ్విని పంపిన కారుడ్రైవరు తనకోసం వచ్చినట్టున్నాడని పక్కకు తిరిగి చూశాడు. పరుగులాంటి నడకతో తనవైపు వస్తున్న వ్యక్తిని చూసి గతుక్కుమన్నాడు శ్రీరామ్.

ఆ వ్యక్తి - కారు డ్రైవరు కాదు!... స్కూలు బంట్రోతు వీరయ్య!

"నేను పస్టుబస్సులోనే వచ్చేశానండయ్యా !తమరుకూడా అందులోనే వచ్చేస్తారనుకున్నాను. పర్లేదులెండి.. రైలుకింకా టైముంది !" అన్నాడు కొంచెం వగరుస్తూ. విషయం బోధపడలేదు శ్రీరామ్‌కి.

"నేనొస్తానని నీకెలా తెలుసు? అయినా నువ్వెందుకొచ్చావనలు?" మనసులో చెలరేగుతున్న అలజడుల్ని అణిచిపెట్టుకుంటూ అడిగాడు.

"నిన్న సాయంత్రం స్కూలొందిలింతర్వాత -పెద్దయ్యగోరు పిల్సి చెప్పారండయ్యా!"

"ఏం చెప్పారు?"

"అదేనండి! తమరిపుడు ఇశాఖపట్నం ఎడతారంట కదండీ? టౌన్‌దాకా సాయంవెళ్లి బస్టాండునించి సిన్నయ్యగోర్ని టేసన్‌కి తీసుకెళ్లి -ఇశాఖపట్నానికి టిక్కెట్టుకొనీ-జాగ్రత్తగా రైలెక్కించూ అన్నారండి! మల్లా.. ఎల్లుండి తమరు రైల్లొంచి దిగగానే-వెంట పెట్టుకునీ -ఎకాఎకి బస్సులో మనూరు తీసుకొచ్చేయ మన్నారండీ!" వివరించాడు వీరయ్య.

"ఆయనకేమన్నా మతిపోయిందా? ఈ టౌన్లో చదువుకున్నవాణ్ణి...ఇక్కడ తిరిగినవాణ్ణి ..నాకు సాయం ఎందుకూ?" లోపల అనుకోబోయి, పైకి అనేశాడు శ్రీరామ్.

"ఆ సంగతే నాకు తెలియక 'నా' మతోయిందండి!"

తండ్రిచేసిన ఆ ఏర్పాటు వెనుక ఎలాంటి కుట్ర వుందో వెంటనే గ్రహించాడు శ్రీరామ్.

"సర్లే! వచ్చినవాడివి ఎలానూ వచ్చావ్. హాయిగా ఉడిపి హోటల్లో భోంచేసి-శారదా టాకీసులో సినిమా చూసి వెళ్లిపో ! నేను స్టేషన్‌కి వెళ్లి టిక్కట్టు కొనుక్కుని రైలెక్కగలనులే"! అన్నాడు.

"అయ్యో... కుదర్దండి! పెద్దయ్యగోరు సెప్పినట్టు సెయ్యకపోతే నా ఉద్యోగం ఊడిపోద్దండి! అసలే ఆడపిల్లలు గలవోణ్ణి...పైగా ఇందులో ఇంకో మతలబు కూడా ఉందండి!" చెప్పాడు వీరయ్య.

"మతలబా!?అంటే ...?"

"తమరు ఎట్టి పరిస్థితిలోనూ- తమరి మావగారింటికి ఎల్లకూడదటండి! అందుకే మీ కూడానే వుండీ -మిమ్మల్ని బస్సుదిగ్గానే నేరుగా టేసిన్‌కి తీసుకెళ్లి రైలెక్కించమన్నారండి! ఈ డ్యూటీ చేస్తున్నందుకు -కర్సులు కాకుండ పైన వెయ్యి రూపాలిచ్చారండి!"

"నేనిపుడు రెండువేలిస్తాను.. చెప్పినట్టు చెయ్యి!" జేబులోంచి పర్సు తీస్తూ అన్నాడు శ్రీరామ్. అర్థం కానట్టు చూశాడు వీరయ్య.

"వెంటనే తిరుగు బస్సులో మనూరెళ్లిపో. నేను ఆదివారం తిరిగి మనూరొచ్చేదాకా హాయిగా నీ ఇంట్లో -పెళ్లాం పిల్లల్తో కాలక్షేపం చెయ్యి. మానాన్నగారికి అనుమానం రాకుండా -నేను చూస్తాలే!" పర్సులోంచి నోట్లు తీసి ఇవ్వబోయాడు.

"కానీ... అయ్యగోరు ..." నోట్లవైపు చూస్తూ నీళ్లు నమిలాడు వీరయ్య.

"భయంలేదన్నాగా! మా నాన్నగారితో - నువ్వీ రెండ్రోజులూ ఇక్కడే నాకోసం వున్నావని చెప్తాను! వెళ్లు.. అసలే ఆడపిల్లలు గలవాడివి.. ఈ డబ్బు వాళ్ళకెందుకైనా ఉపయోగ పడుతుంది!" అంటూ వాటిని వీరయ్య చేతిలో పెట్టేడు..

రెండు క్షణాలు ఆలోచించాడు వీరయ్య.

"సరేబాబూ! తమరు సెప్పినట్టే సేస్తా! తర్వాత నాకు ఆపదరాకుండా మీరే చూసుకోవాల!" అంటూ నమస్కారం చేసి బస్సు వైపు నడిచాడు.

శ్రీరామ్ తృప్తిగా నిట్టూర్చి రోడ్డువైపు నడిచాడు!!

* * *

విజయవాడ స్టేషన్‌లో రైలుదిగి అశ్వినీ,



శ్రీరామ్ -ఆటో ఎక్కి ఓ లాడ్జికి చేరుకున్నారు.

రిసెప్షన్ కౌంటర్లో - తీరుబడిగా పేపరు చదువుకుంటూ కూర్చున్న మేనేజరు దగ్గరకు వచ్చిన శ్రీరామ్ -"మాకు 'రూం' కావాలి.. డబుల్ రూం!" అన్నాడు.

మేనేజరు -వాళ్ళిద్దరి వైపూ పరిశీలనగా చూశాడు. తర్వాత మళ్లీ పేపర్లో తల దూర్చాడు.

శ్రీరామ్‌కి చిర్రెత్తుకొచ్చింది.

"మిమ్మల్నే అడుగుతున్నాను! మాకు రూమ్ కావాలి!"మళ్లీ అడిగేడు.

మేనేజరు -పేపర్ని పక్కన పెట్టి -అశ్వినిని ఆపాదమస్తకం చూశాడు.

శ్రీరామ్‌కి అరికాలిమంట నడినెత్తికెక్కింది.

"అడుగుతున్నది నేను! తనవైపు చూస్తారేమిటీ!" హెచ్చరిస్తున్నట్టుగా బల్లమీద చేత్తో కొట్టి విసుగ్గా చూస్తూ అడిగాడు.

"అ...అబ్బే! మరేం లేదు..ఇస్తాను!... రూమ్ ఇస్తాను!" అంటూ ఓ రిజిస్టర్ తీసి శ్రీరామ్ ముందుంచాడు.

"ఇందులో మీ పేరూ అడ్రస్సూ రాయండి!" అన్నాడు..

శ్రీరామ్ రాస్తుంటే -అతను అశ్వనివైపు తదేకంగా చూశాడు. ఈ లోగా రిజిస్టర్‌లో అడ్రస్సు రాసి - అడ్వాన్సు కూడా ఇచ్చాడు శ్రీరామ్.

"ఒరే సాంబా! అయ్యగార్నీ, అమ్మగార్నీ పదమూడో నంబరు రూమ్‌కి తీసుకెళ్లు!" అంటూ 'బోయ్' ని పిలిచి 'రూమ్' తాళం చెవి ఇచ్చాడు మేనేజరు.

ఇద్దరూ- బోయ్ వెంట రూమ్‌లోకి వచ్చారు..

"చూడు ! ముందు మాకు రెండు స్ట్రాంగ్ కాఫీ పట్టుకురా!" సూట్‌కేసూ, బ్యాగూ బల్లమీద వుంచి బయటకు వెళ్లిపోతున్న బోయ్‌తో చెప్పాడు శ్రీరామ్.

"థాంక్‌గాడ్! మొత్తానికి మనం అనుకున్నట్టుగా జరుగుతోంది! ప్లాన్ ప్రకారం రూమ్‌లోకి వచ్చి పడ్డాం!" మంచం మీద కూర్చున్న అశ్విని తేలిగ్గా నిట్టూరుస్తూ చెప్పింది.

"కానీ మనం తొందరపడుతున్నమేమో అనిపిస్తోంది అశ్వినీ!" తన బ్యాగ్‌లోంచి బట్టలు తీస్తూ అన్నాడు శ్రీరామ్.

"ఇప్పటికీ ఆలస్యం చేశాం." అందామె కొంటెగా చూస్తూ!

"త్వరగా స్నానం చేసి ఫ్రెష్షయితే -ముందు దుర్గగుడికి వెళ్లొద్దాం!" చెప్పాడు శ్రీరామ్..

అయిదు నిమిషాల్లో స్నానం చేసి వచ్చింది అశ్విని ...తెల్లని సిల్కు చీర కట్టుకుంది... అంతకు ముందు రైల్వేస్టేషన్‌లో కొనుకున్న మల్లెపూలు తలలో పెట్టుకుంది.

"లోపల వేణ్ణీళ్లు వస్తున్నాయా?" - అడిగేడు శ్రీరాం, టవలు భుజం మీద వేసుకుంటూ.

"ఆహా ! ప్రాణానికి ఎంత హాయిగా వుందో.. బాత్‌రూం బావుంది!ఈ రూమ్ కూడా విశాలంగా వుంది!" చుట్టూ కలయచూస్తూ చెప్పింది.

"అన్నీ బాగానే వున్నాయికానీ- ఆ మేనేజరే అదోలా వున్నాడు! ఆడవాళ్ళను ఎపుడూ చూడని వాడిలాగా-నీవైపు ఎలా చూశాడో తెలుసా! నాకైతే ఒళ్లు మండిపోయింది.. పళ్లురాలగొడదామనుకున్నాను తెలుసా?"

"కూల్‌డౌన్ మైడియర్ హజ్బెండ్ సర్ ! ఈ సమయంలో 'మండిపడటాలు', ఉండకూడదు! మైమరపులే వుండాలి! ఇంత 'ప్లాన్' వేసుకుని మావయ్యగార్ని కూడా మభ్యపెట్టి వచ్చాం! మనసారా మాట్లాడుకుని ముద్దు ముచ్చట్లు తీర్చుకోవాలేతప్ప 'మూడ్' పాడుచేసుకోకూడదు! అయినా, ఆ మేనేజరుగాడికి బహుశ మనిద్దరం మొగుడూ పెళ్లాలం కాదేమోనన్న అనుమానం వచ్చుంటుంది...అందుకే ఎగాదిగా చూసుంటాడు !" అద్దం ముందు నిలబడి -నుదుట బొట్టుబిళ్ళ అంటించుకుంటూ చెప్పింది అశ్విని.

"నాన్సెన్స్....మొగుడూ పెళ్లాలం కాకపోతే -ఒకే 'రూం' ఎందుకు తీసుకుంటాం?"- అమాయకంగా అడిగేడు శ్రీరామ్.

అతనికి ఎలా చెప్పాలో తెలీక నిస్సహాయంగా చూసి - ఆ తర్వాత అందామె-

"హూఁ! ఆ శ్రీరామచంద్రుడి పేరు పెట్టినందుకు-పితృవాక్యపరిపాలకుడివే ననుకున్నాను కానీ ఇంత 'లోకజ్ఞానం' తెలియని వాడివనుకోలేదు!"

"అంటే ..?" పౌరుషం వచ్చిందతనికి.

"మొగుడు పెళ్లాలు 'కాని' వాళ్లు కూడా -'ఔ'నని చెప్పేసుకుని - అప్పుడప్పుడు ఇలాంటి లాడ్జీలో దిగుతుంటారట. ఓసారెపుడో పేపర్లో చదివాను! ఆ తర్వాత పోలీసులొచ్చి రైడింగులు చేస్తే -అపుడు నిజం బయటపడి - వాళ్ళ హోటల్ ప్రిస్టేజీ పోతుందని భయం!... అందుకే ఆ మేనేజరుగాడు, మనల్ని అంత 'డీప్'గా చూసుంటాడు!"

"నా బొందలా వుంది !" అన్నాడు శ్రీరామ్.

అంతలో 'బోయ్' కాఫీ తెచ్చి -ఇద్దరికీ అందించాడు. కాఫీ తాగింతర్వాత శ్రీరామ్ 'బాత్‌రూం' కి వెళ్లాడు.

"ఎంత హాయి ఈరేయి, ఎంత మధురమీ హాయి. లాలలాల లాలాల..." పాట హమ్ చేస్తూ బెడ్‌మీది దుప్పటిని సరిచేస్తోంది అశ్విని.

సరిగ్గా అపుడే బజర్ వినిపించింది. ఖాళీ అయిన కప్పులు తీసుకువెళ్లేందుకు'బోయ్' వచ్చి వుంటాడనుకున్న అశ్విని - "కమిన్ !" అంది.

తలుపు తోసుకుని పోలీసు ఇన్‌స్పెక్టరూ - కానిస్టేబులూ లోపలకు ప్రవేశించారు. వాళ్లెందుకొచ్చారో అర్థంకాక తెల్లబోయింది అశ్విని.

"ఎవరు కావాలీ?" అడిగింది..

"మీరే కావాలి?" అంటూ మరో రెండడుగులు ముందుకొచ్చాడు ఇన్‌స్పెక్టరు.

"ఏడీ? వాడెక్కడ?" కుడిచేతిలో వున్న లాఠీని ఎడంచేతితో కొట్టుకుంటూ-చుట్టూ కలయచూస్తూ అడిగేడు మళ్లీ..

"ఎవడు?"

"వాడా ! నిన్ను లేపుకొచ్చినవాడు!"

"ఛ ! లేపుకు రావటం ఏమిటీ?...ఇద్దరం భార్యాభర్తలం !...దుర్గ గుడికొచ్చాం!" ధైర్యాన్ని కూడ దీసుకుంటూ చెప్పింది.

అపుడే -టవల్‌తో తల తుడుచుకుంటూ 'బాత్‌రూం' లోంచి బయటకొచ్చిన శ్రీరామ్‌కి - అక్కడేం జరుగుతోందో అర్థంకాలేదు.

"ఏమిటి సార్? ఏం జరిగిందీ?" అయోమయంగా చూస్తూ అడిగాడు.

"కిడ్నాప్ జరిగింది!" చెప్పాడు ఇన్‌స్పెక్టరు.

"కిడ్నాపా?"

"యస్! ...కిడ్నాపే! అభం శుభం తెలియని ఓ ఆడపిల్లను 'కిడ్నాప్' చేసి తీసుకొచ్చినందుకు నిన్ను అరెస్టు చేస్తున్నాను!" జేబులోంచి బేడీలు తీస్తూ చెప్పాడు.

"వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్ !..నేను కిడ్నాప్ చెయ్యటం ఏమిటీ ?"

"నటించకు మిస్టర్! నాకంతా తెలుసు!"

"ఏమిటి తెలుసూ? వంకాయ పులుసు?" ఇన్‌స్పెక్టరు మీదకి విసురుగా వచ్చాడు శ్రీరామ్.

"వంకాయ పులుసో, గోంగూర పులుసో -పోలీస్‌స్టేషన్లో తెలుస్తుంది. పద!" లాఠీ ఝుళిపించాడు ఇన్‌స్పెక్టరు.

"పోలీస్‌స్టేషన్‌కా ? మేం ఎందుకు రావాలీ?"

"సీతామాలక్ష్మి అనే ఈ పెళ్ళికాని ఆడపిల్లను



నువ్ మోసం చేసి తీసుకొచ్చినందుకు!"

"నో ! నా పేరు సీతామాలక్ష్మి కాదు.. అశ్విని" వాళ్ళ మధ్యకు వచ్చిందామె.

"శభాష్ పారిపోయివచ్చింది చాలక పేరు కూడా మార్చేసుకున్నావన్నమాట!"

"ఆల్‌రైట్. మీ నాన్నగారి పేరు జగన్నాథం! అదైనా కరెక్టా?" ఆమె చుట్టూ తిరుగుతూ అడిగేడు.

"కాదు... కానే కాదు.. మా డాడీ పేరు విష్ణుమూర్తి!"

పగలబడి నవ్వేడు ఇన్‌స్పెక్టరు.

"విష్ణుమూర్తా? పాల సముద్రంలో వుంటాడు కదూ?" వెటకారంగా అడగేడు.

"యస్ ! మా మేడపేరు పాలసముద్రమే !" చెప్పింది అశ్విని.

"చాల్లే ఊరుకో! నెల్లూరినించి పారిపోయి వచ్చినందుకు నెరజాణలాగే మాట్లాడుతున్నావ్."

వ్యవహారం ముదురుతోందని గ్రహించిన శ్రీరామ్ కల్పించుకున్నాడు-

"చూడండి ఇన్‌స్పెక్టర్... మీ కెవరో తప్పుడు సమాచారం ఇచ్చారు.. ఆమెది నెల్లూరు కాదు. కేశవపట్నం .. వాళ్ళనాన్నగారి పేరు నిజంగానే విష్ణుమూర్తి ! పెద్ద బిజినెస్ మాగ్నెట్...నేను ఆమెకు తాళికట్టిన భర్తని! మాదిరాజుపాలెం! మా పెళ్ళయి నాలుగు నెల లయింది! కావాలంటే వాకబు చేసుకోండి." అన్నాడు.

"వాకబులు అనవసరం! మతలబులు తెల్సినవాణ్ణి! అసలు నాపేరేమిటో తెలుసా? ఆవలింతల అప్పారావ్.. ఎదుటివాడు ఆవలించకుండానే పేగులు లెఖ్ఖ పెట్టి చెప్పగలను.. బొంబాయ్ రెడ్‌లైట్ ఏరియాలోనూ, శ్రీకాకుళం నక్సలైట్ ఏరియాలోనూ పనిచేసొచ్చిన వాణ్ణి! సర్వీసెంతో తెలుసా?...ట్వంటీ ఇయర్స్! అమ్మాయిల్ని లేపుకొచ్చి లాడ్జీల్లో పెట్టేవాళ్ళు ఎలాంటి కథలు చెప్తారో నాకు బాగా తెలుసు!" మీసం మెలివేస్తూ చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

శ్రీరామ్‌కి విసుగొచ్చింది..సహనం నశించి పోయింది. తాము భార్యభర్తల మన్న విషయాన్ని అతని చేత ఎలా నమ్మించాలో అర్థం కాలేదు..

ఈలోగా అశ్వినికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది..

"ఇదిగో ! ఇన్‌స్పెక్టరుగారూ.. మీరు మర్యాద లేకుండా మాట్లాడుతున్నారు, నా మెడలో మావారు కట్టిన మంగళసూత్రం చూడండి! కాలికి మట్టెలు కూడా వున్నాయి.. ఇవిగో!"-అంటూ వాటిని చూపించింది.

"బందర్లో వంద రూపాయలు పారేస్తే.. అలాంటి గిల్ట్ కవరింగు వస్తువులు బోలెడు దొరుకుతాయి తల్లీ!"

" ఇంతకీ ఏవంటారు మీరూ?" సీరియస్‌గా అడిగేడు శ్రీరామ్

"మళ్లీ అనమంటావా! అయితే విను! ఈ అమ్మాయి పేరు సీతామాలక్ష్మి .. ఊరు నెల్లూరు. నువ్వు మోసం చేసి తీసుకొచ్చావు. మాలాంటి వాళ్ళకు అనుమానం రాకూడదని 'గిల్టు' మంగళ సూత్రం మెడలో కట్టేవ్. వీళ్ల నాన్నగారు పోలీసు కంప్లయింటిచ్చారు. ఇవాళ్టి పేపర్లో ఈ అమ్మాయి ఫోటో వేయించి ప్రకటన కూడా ఇచ్చారు!" చెప్పాడతను. శ్రీరావ్ ఆశ్చర్యపోయాడు.

"ఫోటో వేయించి ప్రకటన ఇచ్చారా?" అడిగేడు.

'యస్! ఇదిగో పేపరుకట్టింగు!" జేబులోంచి తీసి అతని చేతికిచ్చాడు. ఆత్రంగా ఆపేపరు కట్టింగులో వున్న బొమ్మ వైపు చూశాడు... అశ్వినికీ - ఆఫోటోలోని అమ్మాయికీ -అసలు పోలికే కన్పించలేదు.

"ఈఫోటోలో అమ్మాయికీ -మా అశ్వినికీ పోలికే లేదు కదా సర్?" తిరిగిచ్చేస్తూ అడిగాడు శ్రీరామ్.

"ఆఫ్ కోర్స్ ! ఒకోసారి ఫోటోలో మనిషికీ అసలు మనిషికీ తేడాలుంటాయి!"

"మరి అలాంటపుడు... మా ఆవిడే ఈ 'ఫోటోలో అమ్మాయని' ఎందుకనుకోవాలీ? మీ అవిడో-లేకపోతే మీ వెనకాల వున్న ఆ కానిస్టేబుల్‌గారి ఆవిడో అయ్యుండచ్చుగా?" చిరాకు పడుతూ అడిగేడు.

"జోకా?సంతోషించాంకానీ, నవ్వురాలేదు! ఆ ఫోటో కింద ఏం రాసుందో అది చదువు !" ఇన్‌స్పెక్టర్ కూడా చిరాగ్గానే అన్నాడు..

"మీరే చదివి వినిపించండి!"

"ఉఁ! శ్రద్ధగా విను! అమ్మాయి పేరు సీతామాలక్ష్మి.. ఇంట్లోంచి వెళ్లిపోయినపుడు చిలకాకుపచ్చ రంగు చీరా, నీలిరంగు బ్లౌజూ వేసుకుంది.. రంగు చామనఛాయ.. చెవులకు రింగులున్నాయి.. బహుశా బెజవాడ ప్రాంతాల్లో వుండవచ్చు.. ఆచూకీ తెలియపరిచినవారికి యాభైవేల బహుమతీ ఇవ్వబడుతుంది. చూశావా? ఎంత కరెక్టుగా సరిపోయాయో" పేపరు కటింగ్‌లో విషయాన్ని చదివి వినిపించి మళ్లీ జేబులో పెట్టుకున్నాడు ఇన్‌స్పెక్టరు!

శ్రీరామ్‌కి ఒళ్లు మండిపోయింది..

"ఏమిటండీ సరిపోయింది? చూడండి..తన కట్టుకున్నది చిలకాకు పచ్చరంగు చీరా? తను వేసుకున్నది -నీలిరంగు బ్లౌజా?" వాటిని పట్టి చూపిస్తూ అడిగాడు.

"చూడు మిస్టర్! తెలివితేటలు నీకే సొంతమనుకోకు! డిపార్ట్‌మెంట్‌లో 'ట్వంటీ ఇయర్స్' సర్వీసున్నవాణ్ణి.. ఆవలించకుండానే పేగులు లెఖ్ఖ పెట్టగలవాణ్ణి....! ఇప్పుడంటే ఆ అమ్మాయి తెల్లచీర కట్టుకుంది కానీ - మీరీ హోటల్లోకి 'ఎంటరై'నప్పుడు చిలకాకు పచ్చరంగు చీరే కట్టుకుంది. నీలం రంగు బ్లౌజు వేసుకుంది. తన 'కలర్' కూడా చామనఛాయే! అదిగో, చెవులకు రింగులు కనిపిస్తూనే వున్నాయి. కరెక్టుగా బెజవాడ లోనే దొరికింది! ఇవన్నీ చూసిం తర్వాతనే - ఈ హోటలు మేనేజరు మాకు 'ఇన్ఫర్మేషన్' ఇచ్చాడు! ఇక వాదించి ప్రయోజనం లేదు.. పదండి స్టేషన్‌కి!"

-(ఇంకావుంది)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | : కుళందైయుం దైవముం | లేతమనసులు |
| రచన | : కణ్ణదాసన్ | ఆరుద్ర |
| సంగీతం | : విశ్వనాథన్ | విశ్వనాథన్ |
| గానం | : సుశీల | సుశీల |

'చలన చిత్రాలలో పాటలు అసహజమైన అలంకారాలు' అని కొందరు అంటూ ఉంటారు. ఆనందం కానీ దుఃఖం కానీ ఉద్రేకం కానీ మరి ఇంకే భావమైనా కానీ పట్టలేని స్థితిలో మాట పెగలడమే కష్టం. మరి అటువంటి సన్నివేశాలలో పాటలు ఎలా వస్తాయి? తమిళనాడులోని కొన్ని గ్రామాలలో ఎవరయినా చనిపోతే ఆ చనిపోయిన వారి గొప్పలు చెప్పి ఏడవడానికి కూలికి మనుషులను ఏర్పాటు చేసే ఆనవాయితీ ఉంది. 'రుడాలి' చిత్రంలోని నాయికది కూడా ఇటువంటి వృత్తే. కూలికి ఏడవడంలో ఆత్మీయత ఉండదు. అందుకే మనసుపెట్టి చెయ్యని పనిని ఎగతాళి చేస్తూ తమిళంలో 'కూలికి గుండె బాదుకొన్నట్టు' అనే అర్థం వచ్చే సామెత పుట్టింది.

సినిమాలలోని పాటలే అసహజమైనవంటే వాటిలో చిన్నపిల్లలు పాడే పాటలు మరింత అసహజమైనవి. సాధారణంగా చలన చిత్రాలలో పిల్లలు - తమ ఈడుకు తగ్గట్టు ప్రవర్తించరనీ మాటాడరనీ చాలా మంది అంటుంటారు.

'కుళందైయుం దైవముం' తమిళ చిత్రంలో, ఆ చిత్రం ఆధారంగా నిర్మించిన 'లేతమనసులు' తెలుగు చిత్రమూ రెండూ- ఇద్దరు చిన్నపిల్లలు విడిపోయిన తమ తల్లితండ్రులను కలిపిన కథను చెప్పాయి. ఒకరికిద్దరు పిల్లలు, ...అందులోనూ కవలలు ఉన్నందువల్ల వాళ్లకు తగ్గ పాటలు రెండు చిత్రాలలోనూ ఉన్నాయి.

వాటిలో ఒకటి - తమిళ చిత్రం పేరును ప్రస్తావించే 'కుళందైయుం దైవముం'అని మొదలయ్యేపాట. ఈ పాట తాను నేర్చుకొన్నానని చెబుతూ - కవలలలో తండ్రి దగ్గర పెరిగే అమ్మాయి- తరగతిగదిలో పాట పాడి వినిపిస్తుంది.

కణ్ణదాసన్ రాసిన పాటను పి.సుశీల పాడారు. సంగీత దర్శకులు : ఎం.ఎస్.విశ్వనాథన్. ఆ తమిళగీతం ఇది :

కుళందైయుం దైవముం
గుణత్తాల్ ఒండ్రు
కుట్రంగళై మఱందువిడుం
మనత్తాల్ ఒండ్రు
నడంద దెల్లాం నినైప్పదుదాన్
తుయరం ఎండ్రు
జ్ఞానిగళుం మేదై గళుం
శొన్నార్ అండ్రు
పిఱందు వందపోదు నెంజం
తిఱందిరుందదు - అంద
ప్పిళ్ళైయోడు దైవం వందు
కుడి ఇరుందదు
వయదు వంద పిఱగు నెంజిల్
మయక్కం వందదు -అంగు
వాళ్న్దిరుంద దైవం కొంజం
విలగిచ్చెండ్రదు
ఉచ్చి వెయ్యిల్ సూరియనై
మేగం మూడుదు - నమ్
ఉళ్ళం ఎనుం సూరియనై
కోబం మూడుదు
కాట్రువందాల్ మఱుబడియుం
మేగం ఓడుదు
పేశి కలందువిట్టాల్ కోబం మాఱి
నేశమాడుదు
పిళ్ళై గళాయ్ ఇరుందవర్‌తాన్ పెరియవరానార్
అంద పెరియవర్‌గళ్ కోబత్తినాల్ శిఱియవరానార్
కళ్ళమిల్లా ఉళ్ళత్తినాల్ పిళ్ళై గళెల్లాం - ఎండ్రుం
కణ్ణెదిరే కాణుగిండ్ర దైవంగళానార్



తమిళగీతానికి భావానువాదం :

బిడ్డా (శిశువు) దైవమూ
గుణం రీత్యా ఒక్కటే
తప్పులను మన్నించే
మనసు రీత్యా ఒక్కటే
జరిగినదాన్ని గుర్తుచేసుకోవడం
దుఃఖం అని
జ్ఞానులూ మేధావులూ అన్నారూ ఆనాడు
పుట్టివచ్చినప్పుడు హృదయం
తెరచి ఉన్నది - ఆ
పాపతో బాటు దైవం వచ్చి
కొలువైనది (కొలువైనాడు)
వయసు వచ్చాక (పెరిగాక) హృదయంలో

మైకం కలిగింది -అక్కడ
కొలువైన దైవం కాస్త
తొలగి పోయింది
మిట్ట మధ్యాహ్నం సూర్యుణ్ణి
మేఘం మూస్తుంది - మన
మనసనే సూర్యుణ్ణి
కోపం మూస్తుంది
గాలి వీస్తే మళ్లీ
మేఘం పరుగెడుతుంది
మాటాడి కలిసిపోతే కోపం తొలగి
స్నేహమవుతుంది
పిల్లలుగా ఉన్నవారే పెద్దలయ్యారు
ఆ పెద్దలు కోపంతో చిన్నవారయ్యారు (పిన్నలయ్యారు)
కల్లకపటంలేని మనసులతో పిల్లలందరూ
కళ్లెదుట కనిపించే దైవాలయ్యారు

గుణగణాలను బట్టిచూస్తే పిల్లలకూ దేవుడికీ తేడా లేదంటూ మొదలయ్యే ఈపాట చిత్రంలో పూర్తిగా ఒకసారీ, పల్లవితోనూ ఒక చరణంతోనూ మరొకసారీ వినిపిస్తుంది.

'లేతమనసులు' తెలుగు చిత్రంలోని పాటను ఆరుద్ర రాశారు. సుశీల పాడారు.

ఆ పాట ఇది :

పిల్లలూ దేవుడూ చల్లనివారే
కల్ల కపట మెరుగని కరుణామయులే
తప్పులు మన్నించుటే దేవుని సుగుణం
ఇది గొప్ప వాళ్లు చెప్పినట్టి చక్కని జ్ఞానం ॥పిల్లలూ॥
పుట్టినపుడు మనిషి మనసు తెరచియుండును
ఆ పురిటి కందు మనసులో దైవం ఉండును
వయసు పెరిగి ఈసు కలిగి మదము హెచ్చితే
అంత మనిషిలోని దేవుడే మాయమగునులే ॥పిల్లలూ॥
వెలుగుతున్న సూర్యుణ్ణి మబ్బు మూయును
మనిషి తెలివి అనే సూర్యుణ్ణి కోపం మూయును
గాలి వీచ మబ్బు తెరలు కదలి పోవులే
మాట కలుపుకొన్న కోపమే చెలిమియగునులే ॥పిల్లలూ॥
పెరిగి పెరిగి పిల్లలే పెద్దలౌదురు
ఆ పెద్దలేమో కలహిస్తే చిన్నబోదురు
మాయామర్మమేమిలేని బాలలందరు
ఈ భూమిపైన వెలసిన పుణ్యమూర్తులే ॥పిల్లలూ॥



తమిళగీతంలో భావాలను తీసుకుని తెలుగుపాటను రాశారు ఆరుద్ర.

తమిళ గీతంలోని భావాలన్నీ తెలుగు పాటలో కనిపించవు. తమిళగీతంలో ఒక శిశువు ప్రస్తావన ఏకవచనంలో ఉండగా తెలుగు పాటలో 'పిల్లలు' అని బహువచనంలో ఉంది. 'దైవం' అన్న తమిళపదం తెలుగు పాటలో 'దేవుడు' అనే రూపంలో కనిపిస్తుంది. తమిళగీతంలో దైవానికీ శిశువుకూ తప్పులను మన్నించే మనసు ఉందని చెబితే - తెలుగు పాట తప్పులు మన్నించే గుణాన్ని దేవుడికి పరిమితం చేసింది.

దైవానికి సంబంధించి 'మనసు' అనే మాటను సాధారణంగా వాడరు. అందువల్ల 'ఆరుద్ర' తమిళంలోని మనసును తెలుగులోకి తెచ్చినట్టులేదు. తమిళగీతంలో జ్ఞానులూ మేధావులు గతం గురించి ఆలోచించడం దుఃఖం అని ఉన్నా - తెలుగు పాటలో గతాన్ని గురించిన చింత కనిపించదు. జ్ఞానులు మేధావులు- అని తమిళంలో ఉన్న రెండు మాటలనూ కలిపి 'గొప్పవాళ్లు' అని తెలియచేశారు ఆరుద్ర.

పుట్టినపుడు హృదయం తెరచి ఉందనీ ఆ పుట్టిన శిశువులో దైవమూ వచ్చి ఆ హృదయంలో నెలకొన్నదనీ తమిళంలో ఉన్న భావాలు తెలుగులో 'పుట్టినపుడు మనిషి మనసు తెరచి యుండును - ఆ పురిటికందు మనసులో దైవం ఉండును' అనే రూపాలలో కనిపిస్తాయి. తమిళగీతంలో వయసుతో బాటు మైకం కలుగుతుందని ఉండగా- తెలుగులో మదం హెచ్చుతుందని ఉంది. తమిళగీతంలో - దైవం కొద్దిగా తొలగిపోవడం మటుకే ఉంది. తెలుగు పాటలో దేవుడు మాయమై పోతాడని ఉంది.

తమిళ గీతంలోని సూర్యుడు - మధ్యాహ్న మార్తాండుడు. తెలుగు పాటలో ఈ సమయ సూచన లేదు. సూర్యుడు ఎప్పుడూ వెలుగుతూనే ఉంటాడు. మబ్బు తెరలు సూర్యుణ్ణి మరుగు పరిచినా గాలి వీస్తే మబ్బు తెరలు తొలగిపోతాయి. తెలివి అంటే వెలుతురే. సూర్యకాంతి వంటి తెలివిని కోపమనే మబ్బు కమ్మినపుడు అజ్ఞానమనే చీకటి ముసురుతుంది.

మాట మాటా పెరిగితే కోపం. మాటా మాటా కలిస్తే స్నేహం. తమిళగీతంలో కన్నా ఈ చరణంలోని పంక్తులు తెలుగులో ఎంతో భావయుక్తంగా సూక్తులలాగా అమరాయి.

తమిళగీతంలో- కలహించిన పెద్దలు పిన్నలవుతారని ఉంది. పెద్దలు కలహిస్తే చిన్నబోతారు అనడం ఆరుద్రముద్ర. మాయామర్మంలేని పిల్లలు దైవాలయ్యారు అని తమిళగీతం పిల్లలకూ అమరత్వం ఆపాదిస్తుండగా - ఆరుద్ర ఆ పిల్లలను భూమిపైన వెలసిన పుణ్యమూర్తులనడం ఆలోచించి రాసినదే.

'పిల్లలూ దేవుడూ చల్లనివారే' అనడంలో ఉన్న సొగసు 'కల్లకపట మెరుగని కరుణామయులే'అనడంలో లేదు.

పిల్లలు ప్రవర్తనలో కల్లాకపటం లేకపోవడం సబబే. కాని పిల్లలను కరుణామూర్తులనడం సమంజసంగా కనిపించదు. తెలుగు పాటలో సుశీల 'జ్ఞానం' అనే పదాన్ని పలికిన తీరు కొంత ప్రత్యేకంగా ఉంటుంది.

తమిళగీతంలో జ్ఞానుల మేధావుల ప్రస్తావన వచ్చినప్పుడు ఆ సన్నివేశంలో ముందుగా టాల్‌స్టాయ్ చిత్రాన్ని ఆ తర్వాత మహాత్మాగాంధీజీ చిత్రాన్నీ చూపించారు. తెలుగుపాటలో గొప్పవాళ్ల ప్రస్తావన వచ్చినప్పుడు ముందు మహాత్మా గాంధీజీ చిత్రాన్నీ ఆ తర్వాత టాల్‌స్టాయ్ చిత్రాన్ని చూపించారు. టాల్‌స్టాయ్ ప్రభావం గాంధీ మహాత్మునిపై ఉన్నా - మనకు గొప్పవాళ్లంటే ముందుగా గుర్తుకు వచ్చేది గాంధీజీయే కదా!

కవలపిల్లలిద్దరూ విహారయాత్రకు వెళ్లి గొడవ పడతారు. ఆ ఇద్దరినీ శిక్షించడానికి ఒక గదిలో ఉంచేస్తారు. తక్కిన పిల్లలు ఆడుతూ పాడుతూ ఉండగా అందులో ఒక అమ్మాయి 'పిల్లలూ దేవుడు చల్లనివారే' పల్లవితో బాటు 'వెలుగుతున్న సూర్యుణ్ణి' అని మొదలయ్యే చరణం పాడుతుంది. తమిళ చిత్రంలోనూ ఆ సన్నివేశంలో ఆ పాట అలాగే ఉంది.

కవల పిల్లలు కలతలు మరచి కలిసిపోయి- తల్లిదండ్రులను కలపడానికి ప్రయత్నించడానికి ఈ పాట నాంది అవుతుంది. పెద్దలు నేర్పిన పాట కనుక- కొన్నిమాటలూ భావాలూ పెద్దరికంతో కనిపిస్తాయి!

**- పి.ఎస్.గోపాలకృష్ణ**



మహాసహస్రావధాని

డా॥ గరికపాటి నరసింహారావు

# పలకరిస్తే పద్యం...

1116 పృచ్ఛకులతో 750 పద్యాలను ఏకధాటిగా ధారణ చేసి 'మహాసహస్రావధాని'గా కీర్తి ప్రతిష్టలనందుకున్న డా॥ గరికపాటి నరసింహారావుగారు సాగించిన అవధానయజ్ఞాలలో చమత్కారంగా దొర్లిన ఆశు పద్యాలివి. ఈ పద్యాలకు పృచ్ఛకులుగా వ్యవహరించినవారు శ్రీకాంత్, మంజుల, కుమార్, జ్యోతి, సాయి... చిత్తగించండి....

**◆ అవధాని గారూ... ఈ రోజున ఆంధ్ర రాష్ట్రాన్ని ఉర్రూతలూగిస్తున్నవి రెండే రెండు. ఒకటి అవధానం, రెండోది క్రికెట్ మ్యాచ్. అవధానం చేయటం గొప్పదా, క్రికెట్ మ్యాచ్ ఆడటం గొప్పదా?**

సమన్వయంతో చెప్పాలంటే క్రికెట్ మ్యాచ్ ఆడినట్లుగా అవధానం చేయడం గొప్పది.అవధానరంగంలో సుప్రసిద్ధులైన తిరుపతి వేంకట కవీశ్వరుల్ని 'మీ అవధానం ఎలాంటిది?' అని ప్రశ్నిస్తే వాళ్లు చాలా గమ్మత్తుగా జవాబిచ్చారు.

**అష్టావధాన కష్టావలంబనమన్న**
**కరతలామలకంబు కాదె మాకు**
**శతఘంట కవనంబు సలుపు**
**సంగతియన్న నందికొండయ్య దండనంబు మాకు**

ఇలా చెప్పుకుంటూ వెళ్లారు. ఆ మాటలు ఇప్పుడు పెద్దగా అర్థం కాకపోవచ్చు గానీ ఇప్పుడు నన్నే 'మీ అవధానం ఎలాంటిది?' అంటే దాన్ని తప్పకుండా క్రికెట్ మ్యాచ్‌తో పోల్చవలసిన అవసరం ఒకటుంది, నవీన కాలం కాబట్టి -

**అష్టావధాన కష్టావలంబనమన్న**
**సచిన్ టెండూల్కర్ షాట్ మాకు**
**శతఘంట కవనంబు సలుపు**
**సంగతియన్న కపిలదేవ్ బౌలింగు కరణిమాకు**
**ఆశుధారా కవిత్వాండంబరంబన్న**
**బౌండరీల, సిక్సర్‌ల భంగి మాకు**

ఒక దెబ్బకు నాలుగు, ఒక దెబ్బకు ఆరు చొప్పున ఆశుపద్యాలు చెప్పుకుంటూ వెళ్లటం మా అలవాటు. అందుకని

**ఆశుధారా కవిత్వాండంబరంబన్న**
**బౌండరీల, సిక్సర్‌ల భంగి మాకు**
**అప్రస్తుతంబులను అడ్డుకొనుటయన్న**
**సాచి కొట్టిన బంతి క్యాచి మాకు**
**వేయి పద్యాలు ధారణసేయుటనిన**
**హేలగా గవాస్కర్ సెంచరీలు మాకు**
**ప్రకటితంబవధానంబు క్రికెటు కేళి**
**జయముగోర్చ అంపైర్ సంచాలకుండు**

అవధాన కథకు సంచాలకుడుగా వ్యవహరించే ఆయన అంపైర్‌గా వ్యవహరించి చివర్లో జయాన్ని ప్రకటిస్తారు. జయోనన్త అవధానవిధియాయై.

**◆ అవధానాన్ని క్రికెట్‌మ్యాచ్‌తో పోల్చి చెప్పారు... చాలా బాగుంది. అయితే ఈ మధ్యకాలంలో క్రికెట్‌లో మ్యాచ్ ఫిక్సింగ్స్ జరుగుతున్నాయి కదా. ఈ అవధానంలో కూడా ఏమైనా మ్యాచ్ ఫిక్సింగ్స్ అనేవి ఉన్నాయంటారా?**

క్రికెట్‌లో ఉన్నట్లుగా అవధానంలో మ్యాచ్ ఫిక్సింగ్ ఉండే అవకాశం లేదు. ఎందుకంటే

**గెలుపుకై మెదడెల్ల తొలిచివేయుటేగానీ**
**మ్యాచ్ ఫిక్సింగన్న మాట లేదు**

మెదడు తొలిచి తొలిచి అప్పటికప్పుడు సమాధానాలు చెప్పవలసిందే తప్ప, ముందుగా ఫిక్సింగ్ చేసుకోవటానికి పృచ్ఛకులకు మాకు ఏ రకమైన సంబంధాలు ఉండవు కదా... ఎవరు పృచ్ఛకులో మాకు తెలియదు కదా... పైగా మాకు సమస్యలను పరిష్కరించటమే తెలును, సృష్టించటం తెలియదు.

**గడ్డు సమస్యల గొడ్డాడుటేగానీ**
**మేమే సమస్యయౌ వాము లేదు**

మేము సమస్యలను పరిష్కరిస్తామే తప్ప, క్రికెట్‌లో మ్యాచ్ ఫిక్సింగ్ వీరుల్లాగా మేము ఏనాడు దేశానికి సమస్య కాలేదు... కాబోము. అంతేకాకుండా

**బహిరంగ వేదిపై పద్యమల్లుటయేగానీ**
**చాటు ఒప్పందాల చేటు లేదు**

బహిరంగంగా అప్పటికప్పుడు అడిగిన అంశం మీద సమస్యలు, దత్తపదులు పూర్తిచేస్తూ పద్యం చెప్పటమే తప్ప, తెరచాటుకు వెళ్లి వ్యవహారం చేసే అవకాశం లేదు. ఇంత కష్టపడి అవధానం చేసినా, మ్యాచ్‌ఫిక్సింగ్ వీరులకు మాకు ఒక ప్రధానమైన తేడా ఒకటుంది

**శాలువా దండల సన్మానములేగానీ**
**బ్యాంకు లాకర్ల పై భ్రాంతి లేదు**

కష్టపడి అవధానం చేస్తే ఒక శాలువ కప్పాం మహా అయితే దుశ్శాలువా కప్పాం అంటారు తప్ప అంతకుమించి బ్యాంకు లాకర్లలో దాచుకోవలసిన అవసరం వచ్చేంత డబ్బిచ్చే వాళ్లు ఎవరూ లేరు కదా... అందుకని క్రికెట్‌లో ఉండే మ్యాచ్ ఫిక్సింగ్ ఇందులో ఉండదు.

**కాననవధాన విద్యకు**
**మానహీన సకల గుణహీన బలహీన సర్వహీనమైన**
**ఈ క్రికెట్టాటకు ఎందు పోలికయే లేదు**
**గోటితో తూల గలము**

ఇందాక క్రికెట్ మ్యాచ్‌తో అవధానాన్ని పోల్చారు కదా... ఇప్పుడు అవధానానికి క్రికెట్ మ్యాచ్ సరిపోదు అంటున్నారేమిటి అంటారు... అందుకే చెప్పారు కవి నాలుక్కి రెండు వైపులా పదును. అవధాని నాలుక్కి ఆరువైపులా పదును..అని అందుచేత మీ ప్రశ్నకి సమాధానం

**గెలుపుకై మెదడెల్ల తొలిచివేయుటే గానీ**

మ్యాచ్ ఫిక్సింగన్న మాట లేదు
గడ్డు సమస్యల గొడ్డాడుటేగానీ
మేమే సమస్యయౌ వాము లేదు

బహిరంగ వేదిపై పద్యమల్లుటయేగానీ
చాటు ఒప్పందాల చేటు లేదు
శాలువా దండల సన్మానములేగానీ
బ్యాంకు లాకర్ల పై భ్రాంతి లేదు

కాననవధాన విద్యకు
మానహీన సకల గుణహీన బలహీన సర్వహీనమైన
ఈ క్రికెట్టాటకు ఎందు పోలికయు లేదు
గోటితో తూల గలము

**◆ తెలుగు పద్యానికి ప్రజాకర్షణ కలుగజేయటానికి గత దశాబ్దంగా మీరు చేసిన కృషి సాటిలేనిది. నేడు మీ కృషి సఫలమైంది. ప్రజలు నేడు పద్యాన్ని ఆనందంగా స్వీకరిస్తున్నారు. పండితులు కూడా పద్యాలల్లటానికి పోటీ పడుతున్నారు. మీరు సభకు వస్తే మంచి పద్యం చెబుతారని, అదీ ఆశువుగా, అందంగా, యవ్వన ప్రారంభంలో ఉన్న అమ్మాయి అల్లరిలా అలరించేలా చెబుతారని సభ్యులకు గొప్ప నమ్మకం. ఎంతో వైవిధ్యంతో మీరు చెప్పే ఈ ఆశుపద్యం విశేషాన్ని కొంచెం వివరిస్తారా?**

మీ ప్రశ్నకి సమాధానం చెప్పే ముందు నాకీ విద్యను అనుగ్రహించిన మాతృదేవతను పద్యరూపంలో ఉపాసన చేసి ప్రారంభిస్తాను.

నెమ్మది నేలపై బడియు
నేత్రయుగమ్మును విప్పినంత మా అమ్మయే
ఆత్రభావ మెదనంటగా వాతెర జేర్చి విల్వ మా అమ్మయే
తెలుగు పుస్తకము నాతురతన్ పుట ద్రిప్ప అందు మా అమ్మయే
ఈ ప్రపంచమది అంతయు మా అమ్మ యటంచు తోచెడిన్

ఆశువుగా చెప్పే పద్యం అప్పటికప్పుడు చెప్పిందే అయినప్పటికీ ఎప్పుడూ గుర్తుండే విధంగా చెప్పగలగడం ఒక గొప్ప కళ, గొప్ప విద్య. అది అందరికీ సాధ్యం కాకపోవచ్చు కానీ, అసాధ్యం మాత్రం కాదు. ఆశువుగా చెప్పటానికి ముందుగానే అవధాని మనన్సు కవితాపరంగా, స్పందనాపరంగా అన్ని విధాలా సంసిద్ధంగా ఉండాలి. ఇందుకు అవధాని నిత్య జీవితంలో అభ్యాసం చేయాలి. పద్యజీవి అయితే తప్ప ఏ అవధాని అయినా ఆశువుగా మంచి పద్యం చెప్పలేడు. ఒకప్పుడు అల్లసాని పెద్దన తన మనుచరిత్రలో మహాసరస్వతిని ప్రార్థన చేశాడు. ఆవిడ 'ఉపనిషత్తులు బోటులై ఓలగింపగా కూర్చున్నటువంటి' సరస్వతి. ఇవాళ అవకతవకల విద్యావిధానంలో... ఈ చూచిరాతల సోకు మీరిపోయిన సందర్భంలో అటువంటి మహాసరస్వతిని మనం ఊహించలేం. ఇవాళ సరస్వతి స్వరూపాన్ని ఊహిస్తే... అది ఎలా ఉంటుందంటే

పూట పూటకు పెక్కు పోటీ పరీక్షల
తలనొప్పిచే మేను తల్లడిల్ల
బస్తాలబరువున్న పుస్తకాలను
మోసి బంగారు మైదీవ కృంగిపోవ

ఈ రోజు ఓ ఎల్.కె.జీ. విద్యార్థి మోస్తున్న కేజీల బరువు చూస్తే మనకు ఆశ్చర్యం వేస్తుంది. వాడు చదివేది ఎల్.కె.జీ, వీపు మీద టెన్ కె.జీ., చద్దన్నం ఓ కె.జీ, వాటర్ బాటిల్ లీకెజీ. ఇన్ని కేజీలు కలిస్తే వాడి ఎల్‌కెజీ విద్య అవుతుంది ఒకనాటికి. అందువల్ల

బస్తాలబరువున్న పుస్తకాలను
మోసి బంగారు మైదీవ కృంగిపోవ
కాపీలు సాగించు కన్నబిడ్డలగాంచి
కాటుక మొగమెల్ల క్రమ్ముకొనగ
పాండిత్యమే లేని పంతులయ్యల చూసి
నిర్వేణి సవరంపు నీడ నిలువ

ఈ బాధపడలేకే... పుస్తకాల్లోని పాఠాలన్నీ సీడీ ల్లోకి ఎక్కించుకున్నాను....



అనేకరకాల పరీక్షల్లో కృతార్థులు కాలేకపోయినవారినే తప్పనిసరై ఉపాధ్యాయులుగా నియమించవలసిన పరిస్థితి కూడా ఉంది. ఇటువంటి పంతులయ్యల పాండిత్యాన్ని చూసి సరస్వతీ దేవి జుట్టు పీకేసుకుంది. అందుకని ఆవిడకు కూడా సవరం అవసరమైంది. ఇట్టి పరిస్థితుల్లో ఉపనిషత్తులు బోటులై ఓలగింపగా కూర్చున్నటువంటి సరస్వతిని మనం ఊహించలేం కదా. కానీ ఇప్పుడు సరస్వతి లో కూడా కొన్ని ఉంటాయి. కానీ అవి ఉపనిషత్తులు కావు

టెస్టు పేపర్లు గోటులై తీవి నిలుప
గైడులే సైడుగా శ్రుతి గలిపి పాడ
తెగిన వీణను వాయించు తెగువ చూపు
ఆధునిక సరస్వతి వ్యథ అరయలేరే

**◆ అవధాని గారూ... ఓ సాహితీ సభలో సరస్వతీ దేవి పటాన్ని ఓ కుర్చీలో పెట్టారు. దానికి మూడు కాళ్లే ఉన్నాయి. నాలుగో కాలుకు బదులు ఇటుకలు పెట్టారు. మీ వంటి అవధానులు ఇటువంటి దృశ్యాన్ని చూస్తే ఎలా స్పందిస్తారు?**

**ఈ ప్రశ్నకు అవధానిగారు చెప్పిన సమాధానం ఎలా ఉంటుందో వచ్చే సంచికలో.....**

రసజ్ఞులైన పాఠకులు కూడా ఈ 'పలకరిస్తే పద్యం' శీర్షికలో పాల్గొనవచ్చు. సంచికకు రెండు ప్రశ్నల చొప్పున పద్యాలు చెప్పడానికి మహాసహస్రావధాని గరికపాటి నరసింహారావు గారు అంగీకరించారు. 'హాసం' పాఠకులకే పరిమితమైన ఈ అమూల్య అవకాశాన్ని రసజ్ఞులందరూ వినియోగించుకుంటారని ఆశిస్తున్నాం. పద్యాన్ని కోరే పాఠకులు తాము ఇవ్వాలనుకుంటున్న సమస్యను ఈక్రింది చిరునామాకు పంపాలి.

పలకరిస్తే పద్యం
హాసం, హాస్య - సంగీత పత్రిక,
502, శ్రీ బాలాజీ నిలయం,
బి.యస్.పి.కాలనీ, మోతీనగర్,
హైదరాబాద్ -500 018

అవధాని గారి పద్యాలకు ఎంపికైన సమస్యలను పంపే పాఠకులకు తగిన బహుమతి ఉంటుంది.

జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...



బాల్యపు లేతదనం మళ్లీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం



పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ ఎమ్బీయస్ ప్రసాద్

2వ భాగం

చిత్ర పరిచయం 5

సమన్వయం మంజీర

(జరిగిన కథ - డా॥ జాన్ డూలిటిల్ తన పెద్దకూతురు షెరెజ్‌ను బుజ్జగించడానికి యూరోప్ ట్రిప్ ప్లాను చేస్తాడు. ఇంతలో ఆంబోతు అనే జంతువుల అండర్‌వరల్డ్ డాన్‌నుండి జాన్‌కు కబురు వస్తుంది. కొందరు కలపవర్తకులు విచక్షణారహితంగా చెట్లు కూల్చేసి జంతువులను నిర్వాసితులను చేస్తున్నారని, దానివల్ల తన సామ్రాజ్యం కుచించుకుపోతోందని, తమ బాధను మానవులకు తెలియజేయాలని జాన్‌ని కోరుతుంది ఆంబోతు. పరిస్థితి కళ్లారా చూసిన జాన్ విచలితుడవుతాడు. - ఇక చదవండి)

**జా**న్ భార్య లీసా లాయర్‌గా ప్రాక్టీసు చేస్తోంది. కలప వర్తకులు అడవిలో చేసిన బీభత్సం చూడగానే జాన్ చేసిన మొదటిపని భార్యకు ఫోన్ చేయడం!

సంగతంతా వివరించి 'అడవిని కాపాడాలంటే మనమేం చేయాలి?' అని అడిగాడు జాన్.

'మీరనుకుంటున్నంత సులభం కాదది. ఈ కాంట్రాక్టర్లున్నారే వాళ్లు పెద్ద పెద్ద కంపెనీలు నడుపుతున్నారు. ఇంకా పెద్ద లాయర్లను పెట్టుకుంటారు. మనమేదైనా గొడవ పెట్టి, చెట్లు కొట్టడం ఆపిద్దామంటే వాళ్ల జీవనాధారం పోతోందనో, మరోటో చెప్పి ఆర్డర్ కాన్సిల్ చేయిస్తారు. వాళ్లతో తలపడడం మాటలు కాదు, జాన్" అంది లీసా. భర్త భావాలను అర్థం చేసుకుంటూనే వాస్తవ పరిస్థితిని అతనికి అర్థమయ్యేట్లా చెప్పింది.



"అయితే మనమేమీ చేయలేమంటావా? ఈ ఘోరకలిని చూస్తూ ఊరుకోవడమేనా?" వాపోయాడు జాన్.

లీసా కరిగింది. కాస్సేపు ఆలోచించి ఓ సలహా చెప్పింది - "ఈ చెట్లు కొట్టడం ఆపడానికి ఓ ఉపాయం ఉంది. కొన్ని రకాల వన్యప్రాణులను అరుదైనవిగా గుర్తించి ప్రభుత్వం వాటి రక్షణకు అన్ని రకాల జాగ్రత్తలు తీసుకుంటుంది. వాటికి ఆపద కలిగించినవారిని దండిస్తుంది. ఆ అడవిలో అలాటి జాతులకు చెందిన ప్రాణులేవైనా ఈ అడవిలో ఉన్నాయేమో చూడాలి. ఉంటే వాటి సంరక్షణకై.. అంటూ మనం కేసు పెట్టి చెట్ల నరికివేతను ఆపించవచ్చు.."

జాన్‌కు ఉత్సాహం కలిగింది. "భలే, భలే.. మరి అలాటివేమైనా ఇక్కడున్నాయా?" భార్యనే తిరిగి అడిగాడు.

"ఏడిసినట్టుంది. నేనెలా చెప్పగలను? ఎవరైనా జంతుశాస్త్రజ్ఞులను అడగాలి. జూకి వెళ్లి అక్కడ చీఫ్ నడిగితే చెప్తాడు."

చీఫ్ జాన్ సమస్యను అర్థం చేసుకున్నాడు. ఓ బాలచింపాంజీని ఎత్తుకుని జూలో తిప్పుతూనే జాన్ చెప్పినదంతా విని అతనికి ఓపిగ్గా వివరించాడు - "..ఉందండీ, ఒకే ఒక్క అరుదైన భల్లూక జాతికి చెందిన ఆడ ఎలుగుబంటి ఉంది. దాని తల్లిని ఈ కలప కంట్రాక్టర్లు చంపేశారు పాపం. ఇక అదొక్కటే మిగిలింది."

"మరింకేం? దాన్నే కాపాడుదాం. అది మాత్రం బతకాలిగా! అందునా తల్లిలేని పిల్ల!" ఉద్రేకపడ్డాడు జాన్.

"కంగారు పడకండి. ఆ మాట గవర్నమెంటుకి రాసి చూశాను. కానీ ఈ కంట్రాక్టర్ల లాబీ ఉందే, భలే పలుకుబడి వుంది వాళ్లకి. వాళ్ల లాయరంటాడూ, 'అది ఉన్నది ఒక్కతే ఆడ భల్లూకం. దాని జాతి మగ ఎలుగుబంటి ఎలానూ అందుబాటులో లేదు. ఇక వాళ్లకు సంతానం పుట్టడం, ఆ జాతి అంతరించి పోకుండా కాపాడడం - అంతా కల్ల! జరిగేపని కాదు. ఎలాగూ కొన్నాళ్ల తర్వాత ఒంటరిగా చావవలసినదే! ఆ పనేదో ఇప్పుడే చేసినా కొంప మునగదు. ఆ



ఒంటరిజీవికోసం ఈ వ్యాపారం పై ఆధారపడి వున్న వేలాది కుటుంబాలు వీధిపాలు కావాలా? అని ఉత్తరం రాశాడు. నిజమేగా అన్నారు గవర్నమెంటు వాళ్లు ."

"మగతోడు అందుబాటులో లేకపోవడం అంటే.. అసలీ భూప్రపంచంమీద అలాటి జీవే లేదనా...?" అడిగాడు జాన్.

"ఉందిలెండి. కానీ ఏం లాభం?" పెదవి విరిచాడు జూ చీఫ్.

"అదేమిటండీ అలా అంటారు? దాన్ని పట్టుకొచ్చి అడవిలో ఈ ఆడ భల్లూకం దగ్గర పడేస్తే చాలు.. ప్రకృతి తన పని తాను చేసుకుపోతుంది. అవి చేరువ కావడం, జతకట్టడం జరిగి తీరుతుంది. ఇక పిల్లలు పుట్టుకురావడం తథ్యం, అడవి రక్షింపబడడం ఖాయం!"

"మామూలు పరిస్థితుల్లో మీరు చెప్పేది జరిగేదే కానీ, ఈ మగ భల్లూకం తరహా వేరు. చిన్నప్పటినుండీ సర్కస్‌బోనులో పెరిగింది. అలా నాలుగుగోడల మధ్య పెరిగిన జంతువులు సహజవాతావరణానికి అలవాటు పడలేవు. అడవిలో సుఖంగా బతకలేవు. జత కట్టలేవు. ఇది అందరికీ తెలిసిన వాస్తవమే! అందువల్ల ఇలాటి మగ ఎలుగు ఉన్నా, ఊడినా ఒకటే! ఆ ఉద్దేశంతోనే.."

జాన్ ఉబలాటపడ్డాడు - "చూడండి, అదంతా పాతకథ! అప్పట్లో నాలాటి జంతుభాష తెలిసిన డాక్టర్లు లేరు. ఇప్పుడు చూడండి. నేను దాన్ని తీసుకెళ్లి ప్రకృతి పరిసరాలకు అలవాటు చేసి.. దాని మనసులో ప్రేమ పుట్టించి, వాళ్లిద్దరినీ సంధానపరచి, వాళ్ల జాతి అభివృద్ధి పొందేట్లు చేస్తాను..."

జాన్ తన భవిష్యత్ప్రణాళికను ఇంకా వివరించేవాడేమో కానీ ఇంతలో ఓ జిరాఫీ జాన్‌ను 'ష్..మాట' అని పిలిచింది.

అంతరాయానికి చిరాకుపడుతూ జాన్ జిరాఫీ దగ్గరకు వెళ్లి, "ఏమిటీ కొంప మునిగిపోయినట్లు పిలిచేవ్?" అని అడిగాడు.

"మా జూ చీఫ్ లేడూ, ఆయన ప్యాంటు జిప్పు పెట్టుకోలేదు. కాస్త చెబుదూ" రిక్వెస్టు చేసింది జిరాఫీ.



జాన్ చూపులను గమనించిన చీఫ్ 'సంగతేమిటి?' అన్నాడు. ఇక తప్పలేదు. "ఏం లేదు, మీరు జిప్పు పెట్టుకోలేదట, జిరాఫీ గారికి ఇబ్బందిగా ఉందిట"

"సారీ, మీరు వెయిట్ చేస్తున్నారంటేనూ.. హడావుడిగా వచ్చేశా" అంటూ జాన్‌పై తప్పు నెట్టేశాడా పెద్దమనిషి జిప్ పెట్టుకుంటూ!

అంతా బాగానే ఉంది గానీ తను షెరెజ్‌కి చేసిన వాగ్దానం గురించి చింత పట్టుకుంది జాన్‌కి.



అందుకని ఇంటికొస్తూనే ఆమె గదికి వెళ్లాడు. "నువ్వు చాలా నిరాశపడి వుంటావు కదూ" అన్నాడు ఉపోద్ఘాతంగా.

"నిరాశా? ఛ, ఛ, అదేం మాట నాన్నా? నువ్వే నా స్థానంలో ఉంటే నిరాశపడేవాడివా? నేనూ అంతే!" అంది షెరెజ్ కచ్చగా.

ఆమె మాటలో వ్యంగ్యాన్ని అర్థం చేసుకునికూడా ఆమెను నిందించలేకపోయాడు జాన్. సమాజంపట్ల తన బాధ్యత పెరిగిన కొద్దీ కుటుంబసభ్యుల పట్ల తను శ్రద్ధ వహించడం తగ్గిపోతోంది. వారి దృష్టిలో సహజంగా తను దోషేగా!

"అడవిని కాపాడతానని నేను మాట ఇచ్చాను. దాన్ని అమలు చేద్దామని ఈ క్షణం వరకూ అనుకుంటున్నాను. కానీ నువ్వు వద్దంటే అడవికి వెళ్లడం మానేస్తా. పద యూరోపే వెళదాం." అన్నాడు అనునయంగా.

"..అవును, నువ్వు మానేస్తావ్. ఆ తర్వాత జీవితాంతం నేను గిల్ట్‌ఫీలింగుతో కుమిలి కుమిలి ఏడవాలి. అంతేగా!" నిరాశపడుతూనే షెరెజ్ నిజం పలికింది.

"అంతేనమ్మా! జీవితమే చాలా విషయాలు ఇలాగే జరుగుతాయి. మనసు బాధపడుతుంది. కానీ వివేకం కట్టిపడేస్తుంది." అన్నాడు జాన్ ఆమెను ఊరడిస్తూ.

ఇంతలో మాయా గదిలోకి వచ్చింది. తండ్రిలాగే జంతువులంటే తెగ ఇష్టం కదా! "మన ప్రయాణం ఎప్పుడు నాన్నా?" అంది.

"ఇదిగో కోర్టు ఆర్డరు రానీ, తక్షణం బయలుదేరుదాం." అన్నాడు జాన్.

మాయా కంటె ముందే గదిలోకి వచ్చి జాన్, షెరెజ్‌ల సంభాషణ వింటూన్న లీసా "ఓహో, మరి కోర్టు ఆర్డరు ఎవరు తెప్పిస్తారో!" అంది.

సమాధానంగా జాన్ కళ్లెగరేసి లీసా కేసే దృష్టి నిలిపాడు.

"నేనా? చాల్లెండి!" అంది లీసా కోపం నటిస్తూ.



"లేకపోతే.. ఇంత పెద్ద లాయర్ని ఇంట్లో పెట్టుకుని.."

"..ఇదేం కిట్టుబాటు వ్యవహారం కాదు.. నో ప్లీజ్"

"..యస్ ప్లీజ్"

"నో.. నో అంటే నోయే!"

"యస్..య్యస్..డబల్ య్యస్"

"నో అన్నానా..?"

"నాకోసం కాదు, నోరులేని మూగజీవాల కోసం, ... ప్లీజ్"

తనివితీరా మొగుడిచేత బతిమాలించుకుని చివరకు సరేనంది భార్యామణి.

ఇంట్లో అంతలా గునిసింది కానీ కోర్టులో ఝుమాయించి మాట్లాడింది లీసా - "నో యువరానర్! మేం అడిగేది ఓ ఇంజంక్షన్ ఇమ్మని. అడవిలో



చెట్ల నరికివేతను తాత్కాలికంగా ఆపమని కోరుతున్నామంతే! దానివల్ల ప్రపంచంలోనే అరుదైన ఓ జాతి అంతరించి పోకుండా చూసి తోటి ప్రాణుల పట్ల మన బాధ్యతను నెరవేర్చిన వాళ్లమవుతాం."

డిఫెన్సు లాయర్ ఊరుకుంటాడా? అందునా కలపకంపెనీ వాళ్లు బోల్డంత ఫీజిచ్చి పెట్టుకున్నప్పుడు..! ఇంకా ధాటీగా లీసా వాదనను కొట్టి పారేశాడు - "ఇదంతా పబ్లిసిటీకోసం పాకులాట తప్ప మరేమీ కాదు యువరానర్! అరుదైన జాతి గురించి లెక్చర్లు దంచుతున్నారు. అసలా మగ భల్లూకం గురించి ఆవిడకు తెలుసా అని! ఎందరో పేరు కెక్కిన జువాలజిస్టుల స్టేటుమెంట్లు నా దగ్గర ఉన్నాయి చూడండి. అందరూ ముక్తకంఠంతో ఒకే మాట చెప్తున్నారు -

'సర్కస్‌బోనులో పెరిగిన ఎలుగుబంటుని మళ్లీ అడవిలో వదలడం ప్రమాదకరం. అది బాధ్యతారహితమైన చర్య! ఎందుకంటే సర్కస్‌లో వేళకింత తిని పడేస్తే తిండి తినడం మరిగిన ఆ జంతువు అడవిలో తనంతట తాను తిండి వెతుక్కోలేక కడుపుమాడి ఛస్తుంది. తిండే లేనప్పుడు ఇక



ఆడ ఎలుగుబంటితో జతకట్టడం మాట హుళక్కే! అసలు శీతాకాలం వచ్చేటప్పటికే దీని పని ఆఖరు. సర్కస్‌లో వెచ్చగా పడుక్కోవడం అలవాటు పడ్డ ప్రాణి అడవిలో చలి తట్టుకోగలదా? వీళ్లెళ్లి దుప్పట్లు కప్పి కాపురాలు చేయిస్తారా ఏమన్నానా? డార్విన్ ఏమన్నాడు? సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్ అన్నాడు. ఇలా సర్కసుబోనులో పెరిగిన ఎలుగుబంటికి నిజమైన ఎలుగుబంటి ఎదురయితే ఏం చేయాలో కూడా తోచదు. పోట్లాటకు దిగితే ఛస్తుంది కూడా! జంతుప్రేమికులమంటూ వీళ్లు హడావుడి చేయడం తమ ప్రచారం కోసం తప్ప.."

జడ్జిగారికి ఈ వాదనలో సబబు ఉన్నట్టు తోచింది. ఆయన ముఖకవళికలు గమనించిన మాయా కళవెళపడింది. తల్లి "ఐ అబ్జెక్ట్ యువరానర్.." అంటూండగానే లేచి నిలబడి "డార్విన్‌కు మా నాన్న తెలీదు కాబట్టి అలా అన్నాడు.." అనేసింది.

కోర్టులో ఉన్నవారంతా ఎవరా ఈ చిన్నపిల్ల అని తిరిగి చూశారు. జడ్జిగారికి చికాకేసింది. "ఇదిగో పాపా! అలా మధ్యలో మాట్లాడ్డం మర్యాద కాదు. మీ నాన్న గురించి చెప్తున్నావు. ఆయనెవరో చెప్పు. మీ అమ్మాయికి మంచీ చెడ్డా నేర్పలేదా? అని అడుగుతాను." అన్నాడు.



పక్కనే కూచున్న జాన్ లేచి నిలబడక తప్పలేదు. "సారీ యువరానర్, ఆ నాన్నను నేనే! నా పేరు డూలిటిల్" అని చెప్పుకున్నాడు.

"డాక్టర్ డూలిటిల్" అని గర్వంగా చెప్పుకుంది మాయా.

జడ్జిగారికి డాక్టర్ డూలిటిల్ ఘనత తెలుసు. అతని విద్యలూ తెలుసు. మర్యాద చూపుతూ, "మీరేనా డాక్టర్ డూలిటిల్? అయితే డాక్టర్, మీరు సర్కస్‌లో ఆ సుతారమైన ఎలుగుబంటుని అడవికి అలవాటు చేయగలరా? ఆడ భల్లూకానికి అది మచ్చికయ్యేట్లు చేయగలరా? ఇది సాధ్యమయ్యే పనేనా?" అని అడిగాడు.

"సాధ్యమే అనుకుంటున్నాను యువరానర్" అన్నాడు జాన్ వినయంగా.

అన్ని విషయాలు అప్పటికే ఆకళింపు చేసుకున్న జడ్జి "అయితే డాక్టర్, మీకు ఒక నెల గడువు ఇస్తున్నాను. కంట్రాక్టర్ల పనులు ఒక నెల ఆపేయమని ఆర్డరు వేస్తున్నాను. నెలంటే నెలే! గుర్తుంటుందిగా!"

"అఫ్‌కోర్స్, థాంక్యూ సర్"



జడ్జి అంతటితో ఆగలేదు "ఇంకో మాట డాక్టర్, ఆ భల్లూకం ఇన్నాళ్లూ పట్నంలో తిరిగివున్న బాపతు. అడవిలో ఉండలేక ఊళ్లోకి వచ్చి పడుతుందేమో, అది అలా అడుగుపెట్టిన మరుక్షణం ఈ ఆర్డరు వెనక్కి తీసేసుకుంటాను. అలా జరక్కుండా చూసుకోవలసిన బాధ్యత మీదే మరి!"

"తప్పకుండా సర్" జాన్ వినయంగా తలవంచాడు.

"థాంక్యూ యువరానర్" అంది లీసా ఆనందంగా. డాక్టర్ డూలిటిల్ పేరు విని వెనక్కి తగ్గిన డిఫెన్సు లాయర్ సాలోచనగా తల పంకించాడు.

కోర్టులోంచి బయటకు వస్తున్న జాన్‌ను ప్రెస్ విలేఖరులు చుట్టుముట్టారు. ప్రశ్నలు గుప్పించారు.

" అడివిలో పెరిగిన జంతువులకూ, సర్కస్‌లో పెరిగినవాటికీ భాషలో, యాసలో తేడా ఉంటుందా?"

"... మీకు అన్ని రకాల యాసలూ అర్థమవుతాయా?"

"..ప్రేమభాషలో భల్లూకానికి ట్రెయినింగ్ ఇస్తారా?"

"... మీరెప్పుడైనా ఇంతకుముందు పెళ్లిళ్ల పేరయ్యగా పనిచేశారా?"

"..మీ వద్ద మన్మథబాణాలేమైనా ఉన్నాయా?"

"...అవెలా పనిచేస్తాయో ఎప్పుడైనా ఉపయోగించి చూశారా?"

"..పోనీ హంసరాయబారాలు నడిపారా?"

వీటన్నిటికీ జాన్ సమాధానం ఒక్కటే - "నాకు ఈ సర్కస్ భల్లూకం గురించి ఏమీ తెలియదు. పేరు ఆర్చీ అని మాత్రమే తెలుసు. జంతువులకు అడవిలో ఉండడమే సహజగుణం కాబట్టి, ముందులో కష్టంగా తోచినా అది క్రమక్రమంగా అడవికి అలవాటు పడుతుందని నాకు గట్టి నమ్మకం."



జాన్ ఇంటర్వ్యూ ఇస్తూండగా అతని భార్యా పిల్లలు అతన్ని దాటుకుంటూ వెళ్లారు. లీసా చిరునవ్వు చిందిస్తూ భర్తను ఎంకరేజ్ చేసింది. షెరెజ్ రుసరుసలాడుతూ వెళ్లింది. ఈ కేసు ఓడిపోతుందేమో యూరోప్ ట్రిప్ దక్కుతుందేమోనని ఆమె పెట్టుకున్న ఆశ చీదేసింది. అందుకనే తండ్రిని మింగేసేట్టు చూస్తూ బయటకు వెళ్లి నిలబడింది. మాయా మాత్రం తండ్రి సాధించిన విజయానికి పొంగిపోయింది.

జాన్ సర్కస్‌లో 'ఆర్చీస్ షో' చూడబోయాడు. మన భల్లూకం హీరో ఆర్చీపేర ఏర్పాటు చేసిన షో అది. అది సైకిల్ తొక్కింది. పాటలు పాడింది, డాన్సు చేసింది.



షో అయిపోయాక సర్కస్ గుడారంలో ఆర్చీని కలిశాడు జాన్. అది ఓ టబ్‌లో కూచుని చెమట పోయేట్లు ఒళ్లు కడుక్కుంటోంది. తను ఫలానా అని చెప్పుకుని అడివిలో ఉన్న ఆడ భల్లూకం ఫోటో ఆర్చీ కళ్లకెదురుగా పెట్టాడు జాన్.

పెళ్లిళ్ల పేరయ్య చూపించిన ఫోటోలు చూసి పెదవి విరిచే పెళ్లికొడుకు స్టయిల్లో, "బాగా లావుగా ఉంది కదూ" అంది ఆర్చీ నోరు చప్పరిస్తూ.

"లావనే చెప్పాలి" అన్నాడు వృత్తికి కొత్తగా వచ్చిన పేరయ్య.

"ఎక్సర్‌సైజులూ అవీ చేస్తుందా?" కాస్త సిగ్గుపడుతూనే అడిగాడు పెళ్లికొడుకు.

"చేయదు కానీ అటువంటిది దొరకడం నీ అదృష్టమే అనుకో"

మామూలు పెళ్లికొడుకులాగానే ఆర్చీ కూడా గొప్పలకు పోయింది. "ఆ మాటకొస్తే నాకు గర్ల్‌ఫ్రెండ్స్‌కి లోటేమీ లేదనుకో.." అని. కాస్సేపాగి, జాన్‌ను నమ్మించడం కష్టం అనుకుంటూ నిజం ఒప్పేసుకుంది.

"నిజం చెప్పాలంటే నాకెవరూ గర్ల్‌ఫ్రెండ్స్ లేరు. నువ్వోసారి దాన్ని



వెంటబెట్టుకు తెచ్చావనుకో. నేన్నీకు ఋణపడివుంటాను. అలా అని ఎప్పుడు పడితే అప్పుడే తీసుకొచ్చావ్! సోమవారం అయితే నాకు ఖాళీ! శనాదివారాలు షోలు ఎక్కువగా ఉంటాయి. సోమవారం జనాలు పెద్దగా రారు. అందువల్ల మనకు కాస్త తీరిక!"

జాన్ కంగారుపడ్డాడు - తన పని డాక్టరు నుండి మరోదానికి మారిపోతున్నందుకు!

"అబ్బెబ్బే, తను ఇక్కడకు రాదు. నువ్వే అక్కడకు వెళ్లాలి."

"అక్కడెక్కడికి?"

"అడవికి. తను ఉండేది అక్కడే!"

"అడవా!?" పట్నవాసంవాళ్లు కొట్టే పోజంతా కొట్టింది ఆర్చీ - "అడవులు పట్టిపోవలసిన ఖర్మ నాకేమిటి? అవి నాకు పడవు. ఇక్కడ నాకు హాయిగా ఉంది. పట్నం వదిలి చెట్టూ, పుట్టా పట్టుకుని వేళ్లాడవలసిన గతి రాలేదింకా నాకు"

అటునుంచి నరుక్కు వద్దామనుకున్నాడు జాన్. తన పుట్టుక ఎంత ఉత్కృష్టమైనదో గ్రహిస్తే మాట వింటుందనుకున్నాడు. ఉపోద్ఘాతంగా "ఆర్చీ, నీ వెలాటి భల్లూకానివో తెలుసా?"

ఆర్చీ పోజు కొట్టింది. "చెప్పమంటావా? నేను సింగర్ని, డాన్సర్‌ను, మూడు సంవత్సరాలపాటు ట్యాప్ డాన్సు నేర్చుకున్నాను, రెండు సంవత్సరాలేమో జాజ్.."

ఉద్యోగానికి దరఖాస్తు చేసేవాళ్లు రాసుకునేట్లు తన అర్హతలు అప్పజెబుతున్న ఆర్చీని ఆపి "అవన్నీ పక్కన బెట్టు. నువ్వు ఎన్‌డేంజర్డ్ స్పీసీస్‌వి."

ఆర్చీ కంగారు పడింది. "నాకు డేంజరా? ఎవరి వల్ల?"

"అబ్బ, అది కాదు, నువ్వు అంతరించుపోతున్న జాతి దానివని అర్థం"

"అంతరించడమేమిటి? నీ ఎదుటే ఉన్నానుగా.."

"అబ్బ, అదికాదు. అతి త్వరలో అంతరించిపోతావని నా భావం."

"ఇదిగో మిస్టర్! పెద్దమనిషివని ఇక్కడదాకా రానిచ్చాను. నువ్విలా బెదిరిస్తే మా లాయర్ని పక్కన బెట్టుకుని మాట్లాడాల్సివస్తుంది జాగర్త"

"మహాప్రభో, ఇదేమీ బెదిరింపు కాదు. నేను చెప్పవచ్చినదేమిటంటే - నీది అరుదైన జన్మ! మీవాళ్లు అతితక్కువ మంది ఉన్నారు. 'పసిఫిక్ వెస్టర్న్ బేర్' అనే జాతికి చెందిన ప్రాణివి నీవు. నేను చెప్పేది నీ కర్థం అవుతోందా..?"

"అయ్యిందయింది. నువ్వు పసిఫిక్ అను, అట్లాంటిక్ అను. ఎలాటి బేర్ వేషమయినా సరే నేను వేయగలను. ఇప్పటికే గ్రిజ్లీ బేర్, పండా బేర్ పాత్రలు ధరించాను. ఎవ్వరూ తేడా కనుక్కోలేకపోయారు."

ఈ సెల్ఫ్‌డబ్బా ఎలుగుబంటికి సూటిగా చెప్పకపోతే లాభం లేదనిపించింది జాన్‌కి.

"అసలు విషయం నీ కర్థం కావటం లేదు. నీ పూర్వీకులు కాలిఫోర్నియాలోని పర్వతాలలో నివసించేవారు. ఆరేళ్ల వయస్సులో నిన్ను తల్లివడినుండి వేరుచేసి దొంగలెవరో సర్కస్‌వాళ్లకు అప్పగించారు. వీళ్లు నీకు డాన్సనీ మరోటనీ చెప్పి ఒళ్లూపడం నేర్పారు. నువ్వేమో ఇదే పెద్ద గొప్ప విద్యనుకుంటున్నావ్. నా వద్దకు వస్తే నిన్ను అసలైన భల్లూకంగా మారుస్తాను. నీ తండ్రితాత మసలిన ప్రదేశాలకు తీసుకెళ్లి నువ్వక్కడ స్థిరపడేట్లా చేస్తాను."

'మార్చడం, గీర్చడం జాన్తానై. నా కిలాగే బాగుంది. ఇప్పుడీ వూళ్లో ఎవర్నైనా అడుగు. 'ఆర్చీ' ఎవరంటే ఎవరైనా సరే ఠక్కున చెప్పేస్తారు. ఆ దిక్కుమాలిన అడవుల్లోకి వెళ్లి నేను చేసేదేముంది? పాట పాడినా, డాన్సు చేసినా చప్పట్లు కొట్టే దిక్కుకూడా లేదు. ఇక్కడయితే మనకో పేరూ, ప్రఖ్యాతీ ఏడ్చాయి." అంది ఆర్చీ.

జాన్ ఆ పాయింటు దొరకబుచ్చుకున్నాడు. "నేను చేపట్టిన ప్రాజెక్టు ఎంత గొప్పదో నీకు తెలియదు. నువ్వు నాతో సహకరించి నేను చెప్పినట్టు చేసి చూడు. వద్దన్నా పేరు వచ్చిపడుతుంది."

ఆర్చీకి కొద్దిగా ఆశ పుట్టింది - "టీవీలో వస్తుందే 'విన్నీ ది ఫ్వూ' అని ఓ ఎలుగుబంటి సీరియల్! దానిలో ఫ్వూ కంటె ఎక్కువ పేరొస్తుందా?"

"భలేదానివి. నేను చెప్పినట్టు నడుచుకో. అసలా సీరియల్ కేసే ఎవడూ చూడడు. కొన్నాళ్లకు ఫ్వూ అంటే ఎవరు? అని అడుగుతారు. 'విన్నీ ది హూ?' అని పేరు మార్చుకోవాలి టీవీవాళ్లు."

ఆర్చీ మెత్తబడింది. "సరే నీ మాటే కానీ డాక్టర్" అంది.

జాన్ ఆర్చీని ఒప్పించి అడవులకు తీసుకెళ్తున్న వార్త టీవీలో ప్రసారమయింది.



"ఇప్పటివరకు కనీవిని ఎరగని విధంగా జాన్ డూలిటిల్ అనే డాక్టర్ ఓ సర్కస్ భల్లూకాన్ని అడివికి తీసుకెళుతున్నారు. ఈ క్రమంలో అడవిలో విధ్వంసాన్ని ఆపాలని డాక్టర్ జాన్ ప్రయత్నం. ఇట్ ఈజ్ డార్విన్ వెర్సస్ డూలిటిల్!.." అని సాగుతోంది వార్తావాహిని.

కానీ ఆ న్యూస్ రీడర్ కేం తెలుసు అది డూలిటిల్ వెర్సస్ కంపెనీ కాంట్రాక్టర్స్ అని! కోర్టులో వారి తరపున వాదించిన లాయర్, ఇద్దరు కంట్రాక్టర్లు ఆ గదిలోనే కూచుని పళ్లు నూరుకుంటున్నారు, పథకాలు రచిస్తున్నారు!

-(సశేషం)




నిర్మించేది సాంఘికమైనా, జానపదమైనా, పౌరాణికమైనా అభిరుచి విషయంలో తమకంటూ కొన్ని విలువల్ని 'తమ బ్రాండ్'గా ముద్ర వేసుకుని యాంబ్లెమ్ మ్యూజిక్‌తో సహా తమ చిత్రాల్లోని సంగీతాన్ని గుర్తుంచుకునేలా చిత్రాల్ని నిర్మించిన విజయా సంస్థ నుంచి 1961 లో వచ్చిన మరో మంచి చిత్రం




ఈ చిత్రానికి దర్శకుడు కె.వి.రెడ్డి. మాటలూ, పాటలూ, పద్యాలు మొత్తం రచనా బాధ్యత అంతా పింగళి నాగేంద్రరావుది. ఎన్.టి.ఆర్., బి.సరోజాదేవి, ఎల్.విజయలక్ష్మి, రేలంగి, గిరిజ, రాజనాల, సి.యస్.ఆర్., ముక్కామల, లంకసత్యం ముఖ్య తారాగణం. అంత వరకూ ఘంటసాల, యస్. రాజేశ్వరరావు మాత్రమే సంగీతాన్ని ఇచ్చిన ఆ సంస్థలో పెండ్యాల నాగేశ్వరరావు ఈ చిత్రంతో ప్రవేశించారు. ఆయన కూడా ఆ బాధ్యతను ఎంత పవిత్రంగా నిర్వర్తించారో చెప్పాలంటే -నిద్రలో లేపి అడిగినాసరే చటుక్కుని చెప్పే విధంగా ఈనాటికీ ప్రజల నోట నర్తిస్తున్న పది పాటలు సాక్ష్యంగా నిలబడతాయి. వాటిలో తప్పని సరిగా పేర్కొనవలసిన కొన్నిటిలో ఓ మూడింటి గురించి ఈ సంచికలో ...

జలకాలాటలలో
కలకల పాటలలో
ఏమి హాయిలే హలా
ఆహా ఏమి హాయిలే హలా ॥జలకా॥
ఉన్నది పగలైనా అహ వెన్నెల కురిసేనే ॥ఉన్నది॥
అహ వన్నెచిన్నెల కన్నెమనసులో
సన్నవలపు విరిసే
అహ వన్నెచిన్నెల కన్నెమనసులో
సన్నవలపు విరిసే ॥జలకా॥
తీయని రాగమెదో మది హాయిగ పాడెనే ॥తీయని॥
తరుణ కాలమేలే అది వరుని కొరకు పిలుపే
అది వరుని కొరకు పిలుపే ॥జలకా॥






ఈపాటను పి.లీల, పి.సుశీల, బృందం పాడగా బి. సరోజాదేవి, యల్.విజయలక్ష్మి, జయంతి, (అప్పుడు కమలకుమారి), బాలపై చిత్రీకరించారు. సన్నివేశ ప్రాధాన్యంగా మధ్యమధ్య ఎన్.టి.ఆర్. కూడా కనిపిస్తారు. పల్లవికి కీరవాణి రాగాన్ని, చరణాలకు నటభైరవి రాగాన్ని, పల్లవికి దారితీసే చరణాలలోని ఆఖరు వాక్యాలకు తిరిగి కీరవాణి రాగాన్ని ఉపయోగించారు. ఆనాటి నుంచి ఈ నాటి వరకూ సినిమాల్లో స్నానం చేస్తూ పాడుకునే పాటలెన్ని వచ్చినా సరే ఈ పాట ప్రథమ స్థానంలో ఉందంటే అందుకు కారణం - వినగానే నోటికి సులువుగా వచ్చేసే ట్యూన్, విలువలు కోల్పోకుండా సామన్యుడికి అర్థమయ్యేలా వాడిన సరళమైన భాష అనే చెప్పుకోవాలి. తర్వాత వచ్చిన కొన్ని సినిమాల్లో ఈ పాట పల్లవిని డైలాగ్స్‌కి, ట్యూన్‌ని

పాటల మధ్య ఇంటర్ లూడ్స్‌కి వాడుకోవటం కూడా జరిగింది. 'అల్లరిమొగుడు' చిత్రంలోని యోగా పాటకు ఈపాట పల్లవిని ఇంటర్ లూడ్‌గా ఉపయోగించుకోవటం ఓ ఉదాహరణ. రాగం కీరవాణి కాబట్టి ఆ చిత్ర సంగీత దర్శకుడు కీరవాణి అలా ఉపయోగించుకొని ఉంటాడు అని సంగీత ప్రియుల మధ్య అప్పుడప్పుడు వినిపించే మాటని కేవలం ఛలోక్తిగానే తీసుకోవాలి. వీటన్నిటికన్నా ఈ పాటలో పింగళి వాడిన 'హలా' అనే మాట గురించి అతి ముఖ్యంగా చెప్పుకోవాలి. 'హలో ' అనడానికి బదులు చమత్కారంగా ఈ మాటను పింగళి ప్రయోగించారనుకున్నారు ఆ రోజుల్లో చాలామంది. నిజానికది కావ్యప్రయోగమే. పూర్వం ఎన్నో సంస్కృత నాటకాలలో ఈ ప్రయోగం జరిగింది. చెలికత్తెను 'హలా' అని సంభోదించాలని అమరంలో కూడా ఉంది. ఏది ఏమైనా విరళంగా (అరుదుగా) లభ్యమయ్యే పదాల్ని అటు తరళంగాను (ప్రకాశించేట్టుగా) ఇటు సరళంగాను వాడిన పింగళికి తెలుగు సినీ సంగీత సాహిత్యాభిమానులు ఋణపడి ఉండక తప్పదు.

ఓ దివ్య రమణులారా... నేటికి కనికరించినారా
కలకాదు కదా సఖులారా
ఓసఖీ ఓహో చెలీ ఒహో మదీయమోహినీ ॥ఓ సఖీ॥
కలలోపల కనిపించి వలపించిన చెలులోహో
కనులవిందు చేశారే
కనుల విందు చేశారిక ధన్యుడనైతిని నేనహా ॥ఓ సఖీ॥
నయగారము లొలికించి
ప్రియరాగము పలికించి
హాయి నొసగు ప్రియలేలే
హాయి నొసగు ప్రియలే మరి
మాయలు సిగ్గులు ఏలనె ॥ఓ చెలి॥
కనుచూపులు ఒకవైపు
మనసేమో నావైపు ॥కను॥
ఆటలహో తెలిసేనులే
ఆటలహో తెలిసెను
చెలగాటముయ నా కడ చెల్లునె ॥ఓ సఖీ॥








ఈ పాట సాకితో మొదలై 'ఓ సఖీ ఓహోచెలీ ఒహోమదియా మోహిని' అనే పల్లవితో సాగే పాటను ఘంటసాల పాడగా ఎన్.టి.ఆర్., బి.సరోజాదేవి, యల్.విజయలక్ష్మి, జయంతి, బాల అభినయించారు. దేశ్ రాగానికి ఈ పాట అతి చక్కని ఉదాహరణ. ఈ పాట వేసుకున్న ముద్ర ఎంత పటిష్టమైనదంటే - విజయా వారు సుమారు 35 సంవత్సరాల తర్వాత 'భైరవద్వీపం' అనే చిత్రాన్ని తియ్యాల్సి వస్తే అందులోని 'ఎంత ఎంత ఎంత మోహమో, రతి కాంతుని శృంగారమంత్రమో అనే పాటకి ఈ 'ఓ సఖీ' పాటనే ప్రేరణగా చేసుకోవలసి వచ్చింది. 'అహో ఓహో' అనే పదాల్ని ప్రయోగించటంలో పింగళి వారికో ప్రత్యేకత ఉంది. 'శ్రీకృష్ణార్జున యుద్ధం' (1963) చిత్రంలోని 'అన్నీ మంచి శకునములే' పాటలో 'మనసున మంగళ వాద్యమహా మ్రోగెలే' అన్న అను పల్లవి విన్న తర్వాతే ఈవిషయాన్ని చాలామంది గమనించగలిగారు. ట్యూన్ పరంగా ఈ పాటలో ఓ తమాషా ఉంది. ఎప్పటి నుంచో ప్రాచుర్యంలో ఉన్న 'భలే మంచి చౌక బేరము'అనే పాటలోని రాగాన్ని పక్కని పెట్టేసి నడకను మాత్రం తీసుకొని జాగ్రత్తగా గమనిస్తే ఆ తరహా పోకడ ఈ పాటలో అక్కడక్కడ కనిపించే అవకాశం ఉంది. అయితే దీన్ని కేవలం ఆత్మాశ్రయమే కాని నిరూపణకు దొరకని విషయంగా పేర్కొనాలి.

వరించి వచ్చిన మానవ వీరుడు ఏమైనాడని విచారమా
ఔన చెలీ ఔన సఖీ ఔన చెలీ ఔన సఖీ
అయితే వినవే మా మాట అయితే వినవే మా మాట
నీవు చేసిన మాయలుమించి నవ మన్మధుడే ఆయెనే
అహ నవ మన్మధుడే ఆయెనే
మన్మధుడై నిన్నావేశించి మైమరపించేనే హలా
నిను మైమరపించేనే హలా ॥వరించి॥
అలగిన చెలిని లాలనసేయా మలయానిలుడే ఆయెనే
ఓహో మలయానిలుడే ఆయెనే
మలయానిలుడై చల్లగ చెలిపై వలపులు విసిరేనే హలా
అహ వలపులు విసిరేనే హలా ॥వరించి॥
చెలి అడుగులలో పూలు చల్లగా లలిత వసంతుడె ఆయెనే
అహ లలిత వసంతుడె ఆయెనే
వసంతుడై నిను కోయిల పాటల చెంతకు పిలిచేనే హలా
తన చెంతకు పిలిచేనే హలా ॥వరించి॥






ఈ పాటను పి.లీల, పి. సుశీల, బృందం ఆలపించగా బి.సరోజాదేవి, యల్.విజయలక్ష్మి, జయంతి, బాల అభినయించారు. ఈ పాటను మధ్యమావతి రాగంలో స్వరపరిచారు. అయితే ఆ రాగంలో రాకూడని గాంధార, దైవత స్వరాలను వినసొంపుగా ఉండటం కోసం జతచేసుకోవటం జరిగింది. ఈ పాటను కొందరు 'ఔనె చెలి ఔనె సఖీ' అంటూ పాడతారు. నిజానికి పింగళి రాసింది, గాయనీమణులు పాడింది -'ఔన చెలి ఔన సఖీ'అనే.

చరణాలలోని వాక్యాలకి తరువాత వచ్చే వాక్యాలతో లింకు ఉండటం ఈ పాట ప్రత్యేత. ఇంకొక విశేషం ఏమిటంటే -కొన్నేళ్ళ క్రితం పెండ్యాల ఓ పత్రికలో సమాధానాలు ఇస్తున్నప్పుడు 'ఈపాట మొదలవడానికి ముందు వినిపించే ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్ చాలా కొత్తగా ఉందండీ...అది ఏవాద్యం?' అని కొందరు అడిగితే దానికాయన "దాన్ని క్లేవయొలిన్ అంటారు. అది ఎలక్ట్రికల్‌గా ఆపరేట్ చేసే వాయిద్యం" అంటూ సమాధానమిచ్చారు. 'అంత చిన్న బిట్ కూడా ప్రేక్షకులకి గుర్తుండిపోయిందంటే అలాంటి పాటలు స్వరపరిచే అవకశం నాకు కలిగినందుకు నేనెంతో పుణ్యం చేసుకున్నానో' అంటూ మిత్రుల మధ్య జరిగే పిచ్చాపాటీలో కన్నీళ్ళు పెట్టుకు మరీ చెప్పేవారు పెండ్యాల.

(వచ్చే సంచికలో మరికొన్ని పాటల గురించి...)

# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## రాజమండ్రి

విక్రమహాల్లో జరిగిన అక్టోబరు కార్యక్రమానికి ఎప్పటికంటె ఎక్కువగా ప్రేక్షకులు విచ్చేశారు. తొలుతగా అడవిబాపిరాజు (రాజమండ్రిలో నివసించిన చిత్రకారుడు, రచయిత), అల్లు రామలింగయ్య, రాజబాబు, వైణికులు చిట్టిబాబు గార్లకు నివాళులు, ఆలీ, పేకేటి శివరామ్ గార్లకు జన్మదిన శుభాకాంక్షలు అందించడం జరిగింది. 'ఆంధ్రా కిషోర్'గా పేరుబడ్డ జిత్‌మోహన్‌మిత్ర అక్టోబరు 13 కిషోర్ కుమార్ వర్ధంతి సందర్భంగా ఆయన పాటలను ఆలపించి వినిపించారు. అయ్యగారి వేంకట్రామయ్య హాస్యపద్యాలతో, పవన్ కుమార్ (భాస్కరభట్ల రవికుమార్ సోదరుడు), పారడీ పాటలతో సభను రంజింపజేశారు.

ఈ సారి 5 స్కిట్లు ప్రదర్శింపబడడం విశేషం -

'జోడుగుళ్లు'
- డా॥ డి.యస్.వి.సుబ్రహ్మణ్యం, సీత

'శ్రీమతి నషశ్రీగారితో పరిచయం'
- శ్రీపాద పద్మ, వి.శారద

'సందేహాల్రావు-సమాధానల్రావు' - జిత్‌మోహన్‌మిత్ర, అప్పారావు

'బధిరోపాఖ్యానం' (చిలకమర్తి)
- ఫణి నాగేశ్వరరావు, అయ్యగారి

'అర్ధాంగి సహాయనిరాకరణ'
- హనుమంతరావు, విజయలక్ష్మి

సర్వేశ్వరరావు, నారాయణమూర్తి, నాగభూషణం, రవికిరణ్, శర్మ, ఆదినారాయణ, మంగశర్మ, రాధ, కాశ్యప్, శరశ్చంద్ర జోకులు చెప్పి, విజయలక్ష్మి, అపర్ణ, కోదండరావు, అవధాని, దీనారత్నం, జ్యోతి, జయలక్ష్మి పాటలు పాడి సదస్యులను అలరించారు. రాజేష్‌ఖన్నా, ఎన్.లక్ష్మి జోక్స్‌కై, బేబీరత్నం, సూర్యపద్మ కుమారి పాటలకై బహుమతులు గెల్చుకున్నారు.

తదుపరి కార్యక్రమం విక్రమహాలులో నవంబరు 21 న జరుగుతుంది.

## విశాఖపట్నం

హైదరాబాద్‌కు చెందిన గ్రాఫిక్ ఆర్టిస్ట్ శంఖవరపు శ్రీనివాసరావు సౌజన్యంతో ప్రేమసమాజం ఆడిటోరియంలో జరిగిన అక్టోబరు కార్యక్రమంలో అనేకమంది ప్రముఖులు పాల్గొన్నారు. గొల్లపూడి మారుతీరావు, రాంభట్ల నృసింహశర్మ జోక్స్ చెప్పారు. ఆచార్య కోలవెన్ను మలయవాసిని 'రామాయణంలో హాస్యం' అవసరాల రామకృష్ణారావు 'జీవితంలో హాస్యం' వివరణాత్మక ప్రసంగాలు చేశారు. ముద్దంశెట్టి హనుమంతరావు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. అడపా రామకృష్ణ బహుమతిప్రదానం చేశారు. కళ్లు చిదంబరం మాట్లాడుతూ 'హాసం క్లబ్'కు ఆదరణ చాలాబాగా పెరిగిందని, తాను కుర్చీకోసం వెతుక్కోవలసి వచ్చిందని అన్నారు. హ్యూమర్‌క్లబ్ నిర్వాహకులు నండూరి ప్రభాకర్, రావి గోపీకృష్ణ జోక్స్ చెప్పగా, కె.వి.శివరామకృష్ణ మిమిక్రీ చేశారు. గుండాన జోగారావు చిలిపి కవితలు, టి.యల్.ప్రసాద్ ప్యారడీపాటలు సభను ఆకట్టుకున్నాయి. బాలమురళీకృష్ణ అనువదించిన పురందరదాసు కీర్తనను డా॥ఎస్.బాలసుబ్రహ్మణ్యం పాడారు.



వెంట్రిలాక్విజమ్ చేసి కళ్లు చిదంబరం నుండి రూ॥ 116/- నగదు బహుమతి అందుకుంటున్న చి॥ ప్రశాంత్, మైకు వద్ద న్యాయ నిర్ణేతగా వ్యవహరించిన రచయిత ముద్దంశెట్టి హనుమంతరావు

చక్రంధర్ 'కిటుకులరావు-చిటుకులరాణి' స్కిట్‌ను మేడా మస్తాన్ రెడ్డితోను, 'జ(గ)డ్డిమాలోకం' స్కిట్‌ను లక్ష్మిప్రసాద్‌తోను కలిసి ప్రదర్శించారు. పాటలకు, స్కిట్‌లకు కీబోర్డుపై జగన్, తబలాపై సాయికృష్ణ సహకారం అందించారు. బహుమతి విజేతలలో ప్రశాంత్, మాధవీసనారా, కోనే ఆంజనేయులు, విజయలక్ష్మి, భూపతిరావు, జోగారావు ఉన్నారు.

వచ్చే కార్యక్రమం 21 11 2004 నాడు సాయంత్రం 6 గంటలకు ప్రేమసమాజంలో జరుగుతుంది.

## ఏలూరు

అక్టోబరు సమావేశం 17 వ తారీకున జిల్లా కేంద్రగ్రంథాలయంలో ఆహ్లాదకరమైన వాతావరణంలో జరిగింది. ఎస్.రాజేశ్వరరావు వర్ధంతి (అక్టోబరు 26) సందర్భంగా వారి జీవితవిశేషాలను స్టేట్ కన్వీనర్ యస్.వి.రామారావు వివరించగా రాజేశ్వరరావు అభిమన్యునిగా నటించి, పాడిన 'మాయాబజార్'(1936) గీతం 'నను వీడగగలవే బాలా' పాటను రిటైర్డ్ డిప్యూటీ కలక్టర్, సంగీతదర్శకుడు కోకా రామారావు పాడి వినిపించడంతోబాటు, ఆ పాట వరసకు మూలమైన అలనాటి హిందీ కంపోజర్ శంకర్ గణేష్ వ్యాస్ ('రామ్‌రాజ్', 'భరత్‌మిలాప్' ఫేం) స్వరపరచిన 'మన్‌మోహన్ మురళీవాలా' అన్న గీతాన్ని కూడా వినిపించి సభను ఆశ్చర్యపరచారు. రాగవిశేషాలను వివరిస్తూ ఆ పాట 'దుర్గ' రాగం (కర్ణాటక లో 'శుద్ధసావేరి') లో స్వరపరచినట్లు తెలిపారు.



అన్నమాచార్య కీర్తన ఆలపిస్తున్న సీతాదేవి

మహతి మ్యూజిక్ ఎకాడెమీ ప్రిన్సిపాల్ చల్లపల్లి సీతాదేవి అన్నమాచార్య కీర్తన 'యేమి చిత్రంబేమి మహిమలు, యేమి నీ మాయా వినోదము' శ్రావ్యంగా ఆలపించగా నిడదవోలు నుంచి వచ్చిన టీచరు

విశాఖపట్నంలో ప్రదర్శించిన స్కిట్

## జ(గ)డ్డిమాలోకం



స్కిట్ ప్రదర్శించిన లక్ష్మీప్రసాద్, చక్రంధర్

రోడ్డు ప్రక్కన ఓ బక్కోడు గడ్డి పీక్కొని తింటూ ఉంటాడు. కారులో వెళుతూ ఆ దృశ్యం చూసిన దయానిధి కారు ఆపి అతని వద్దకు వస్తాడు.

**దయా :** ఒరేయ్, బక్కోడా.. ఇలా రా

**బక్కోడు :** ఆయ్, దయానిధి గారా.. నమస్కారం బాబూ

**దయా :** ఏం చేస్తున్నావ్‌రా?

**బక్కోడు :** కనబడుతోందిగా,.. గడ్డి తింటున్నాను బాబూ

**దయా :** పచ్చగడ్డి తింటున్నావా?

**బక్కోడు :** డౌటా? కావలంటే రుచి చూడండి.

**దయా :** ఏడిశావులే, అసలెందుకు తింటున్నావంటే..?

**బక్కోడు :** మీలాంటి గొప్పోళ్లు డబ్బుకోసం గడ్డి తింటారు. నేను డబ్బులేక గడ్డి తింటున్నానండి. అంతే! డబ్బుంటనే పుడ్డు.. లేపోతే గడ్డే! మా ఖర్మ!

**దయా :** ఎంత ఖర్మ కాలినా, పోయి పోయి ఇలాటి గడ్డి తింటారుట్రా.. నాతో రా.. కారెక్కు!

**బక్కోడు :** అయ్యబాబోయ్, కారెక్కడమంటే బయమండి. నా పేణాలు మూటగట్టి మీ చేతిలో పెడుతున్నానండి.

**దయా :** చేతిలో స్టీరింగు ఉండగా అవన్నీ ఎలా పట్టుకోగలన్రా? ఆ మూటేదో కారు బ్యాక్ సీట్‌లో పెట్టుకో. (కారు నడుపుతూ) అవునుగానీ ఆ రోడ్డు ప్రక్కన దుమ్ముధూళితో నిండిన ఆ గడ్డి ఎలా తింటున్నావ్‌రా, రోగం వస్తుందన్న భయం లేదూ..

**బక్కోడు :** (ఆశపడుతూ) ఏం చేస్తాం బాబూ, సగం సగం తింటూ ఏలాగోలా గెటాన్ అయిపోతున్నా బాబూ, ఏదో ఇన్నాళ్లకు మీ దయ మా మీద పడింది. కడుపునిండే రోజు వచ్చింది.

**దయా :** (గొప్పగా) కరక్టుగా చెప్పావ్! (కారు ఆపుతూ) చూశావా నీ అదృష్టం! రోడ్డు పక్కన గడ్డి తిని అనారోగ్యం తెచ్చుకోవలసిన ఖర్మ నీకేమిట్రా? ఇదిగో ఇలా చూడు, ఇక్కడ మా పెరట్లో గడ్డి ఎంత శుభ్రంగా ఉందో! హాయిగా, కడుపునిండా తిను.

**బక్కోడు :** (దిగాలుపడి) ఇక్కడ కొచ్చినా గడ్డేనా!?

**దయా :** అవున్రా, గబగబా మొదలెట్టు. గడ్డి పీకమంటే కూలీవెధవలు బోల్డంత అడుగుతున్నారు. ఇదిగో, నేను విజయనగరం వెళ్లి వచ్చేలోపున కాంపౌండంతా ఖాళీ అయిపోవాలి. తినకుండా వెళ్లావో, మా కుక్క నీ పని బడుతుంది. కడుపునిండా తింటావు కాబట్టి, హాయిగా ఊళ్లోకి నడిచి పోవచ్చు. రిక్షా అదీ ఎక్కకు! డబ్బు దండగ! చూశావా, నీ ఆరోగ్యం గురించి, ఖర్చు గురించి ఎంత వర్రీ అవుతున్నానో, అందుకే దయానిధి అంటారు నన్ను! (వెళ్లిపోతాడు)

**బక్కోడు :** (గడ్డి పీక్కుని తింటూ) ద..యా..నిధి! ఆహా, వాణ్ని కాదు నన్ననాలి. కారెక్కమంటే పుసుక్కుని ఎక్కిపోయాను, జాలి కారిపోయి, పంచభక్ష్య పరమాన్నాలు పెడతాడని. జడ్డి మాలోకాన్ని కాదు.. గడ్డి మాలోకాన్ని..(నుదురు కొట్టుకుంటాడు)

**- తాళాభక్తుల లక్ష్మీ ప్రసాద్**

జి.జోగినాథ్ 'నిన్నలేని అందమేదో' (పూజాఫలం-రాజేశ్వరరావు) ఆలపించి ప్రథమబహుమతి గెల్చుకున్నారు.

చిరంజీవులు భరత్, అనూప్ కీబోర్డుపై పాటలు పలికించి లైబ్రేరియన్ గాయత్రీదేవినుండి బహుమతి అందుకున్నారు. ఇంకా పుష్పరాజ్, బాలాత్రిపురసుందరి రసవత్తరమైన గీతాలు విన్పించగా గరికిపాటి శర్మ, మైలవరపు శర్మ, ఎంజె మూర్తి, రత్నమాల, కిషోర్ జోక్స్ చెప్పారు. డా॥ప్రసాద్ ప్రకటించిన లక్కీడిప్‌ను రిటైర్డ్ డియస్‌పి జక్కంశెట్టి శ్రీరామమూర్తి చే తీయించగా వారికే ఆ గిఫ్ట్ రావడం ఓ విశేషం!

వచ్చే కార్యక్రమం నవంబరు 21 సాయంత్రం 6-35 గం॥లకు జిల్లా కేంద్ర గ్రంథాలయంలో జరుగుతుంది.

### ఏలూరులో వినబడిన జోక్స్

తండ్రి : పరీక్షలు ఎలా అఘోరించావురా?
కొడుకు : మార్చాయ లిఖితం
సెప్టెంబరాయ పునర్లిఖితం
యూనివర్శిటీ పోషకార్థాయ
సంభవామి ఆర్నెల్లు ఆర్నెల్లకే!

### ఆర్.టి.సి. నిర్వచనం

ఆర్ అంటే రాదు, టైముకి రాదు
టి అంటే తెలీదు, బస్టాండుకి ఏ వైపొగుతుందో తెలియదు
సి అంటే చచ్చినా కదలదు, ఓ సారి ఆగితే కదిలే సమస్యే లేదు

'హాసం క్లబ్' ప్రారంభించదలచినవారు సంప్రదించవలసినది శ్రీఎస్.వి.రామారావు. 040-24160279, 9849139030

### ఈ పక్షం సమావేశాలు

| | | | |
|---|---|---|---|
| విజయనగరం | 01 11 04 | 6.00 pm | వివరాలకు- బాబు 9440943479 |
| జగ్గంపేట | 07 11 04 | 4.35 pm | Ph: 234185 |
| శ్రీకాకుళం | 14 11 04 | 6.00 pm | రామలక్ష్మణ్‌హాలువద్దగాయత్రిస్కూల్ |
| రాజమండ్రి | 21 11 04 | 6.00 pm | విక్రమహాలు |
| వైజాగ్ | 21 11 04 | 6.00 pm | ప్రేమసమాజం |
| ఏలూరు | 21 11 04 | 6.35 pm | జిల్లా లైబ్రరీ |
| హైదరాబాద్ | 27 11 04 | 6.35 pm | బాలానందసంఘం |
| పలాసా | 27 11 04 | 6.35 pm | డా॥రామినాయుడు క్లినిక్ |

కార్యక్రమాల సమగ్రవివరాలు 'హాసం క్లబ్ బులెటిన్'లో లభిస్తాయి

# పెళ్ళిపుస్తకం

**దర్శకత్వం : బాపు**

వెండితెర నవల **16**

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

### జరిగిన కథ

కుటుంబ బాధ్యతలున్న కృష్ణమూర్తి, భామలకు పెళ్ళవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. అది భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలకు దారితీస్తుంది. శ్రీధరం బావమరిది గిరి, భామను బ్లాక్‌మెయిల్ చేసి గెస్ట్‌హౌస్‌కు రమ్మంటాడు. అక్కడ శ్రీధరం భార్య అతనికి బుద్ధి చెప్తుంది. ఇటు వసుంధర విదేశాలనుండి వచ్చిన బావను తనకు కాబోయే భర్తగా కృష్ణమూర్తికి పరిచయం చేసి క్రిస్మస్ పార్టీకి పిలుస్తుంది. ఇంటికి తిరిగివచ్చిన భామకు భర్త వసుంధరతో కలిసి పార్టీకి వెళ్లాడని తెలియడంతో అపార్థం చేసుకుని రోదిస్తుంది. **-(ఇక చదవండి)**

**మం**చం మీద పడుకుని ముఖానికి దిండు నానించుకుని పెద్దగా ఏడుస్తున్నది. కళ్ళవెంట ధారాపాతంగా నీరు వర్షిస్తున్నది. దిండు పై వసుంధర లిప్‌స్టిక్‌తో చేసిన సంతకం కనిపించింది. గతంలో ఒక సందర్భంలో కృష్ణమూర్తి తో 'అందుకే ఐలైక్ యూ... ఐ లవ్ యూ' అని వసుంధర అన్న మాటలు జ్ఞప్తికొచ్చాయి. అంతలోనే ఆమె తన భర్తతో 'ఎనివే మనిద్దరికీ మొగుడు పెళ్ళాలు లేరు మనం పెళ్ళాడేస్తే?' అన్న మాటలూ గుర్తుకొచ్చాయి.

దుఃఖం మరింత ఎక్కువైంది. ఎదురుగా గోడమీద తన భర్త చిత్రించిన వసుంధర నిలువెత్తు ఫోటో కనిపించింది. చేతిలో ఉన్న దిండును విసిరేసింది భామ. అది వెళ్ళి వసుంధర ఫోటో ఫ్రేముకు తగిలింది. ఫోటో ఫ్రేమ్ పడిపోబోతోంది. అది తన మీద పడుతున్నట్లుగా తోచింది. వసుంధర ఏనాటికైనా తన భర్తను ఎగరేసుకుపోతుందేమోనన్న భావనతో ఆ ఫోటోను చూడగానే భామ కంపించసాగింది. గాలి ఉధృతమై ఫోటో గోడనున్న మేకునుంచి ఊడిపోయి దబ్బున తన మీద పడ్డ భావన కలిగి కెవ్వున కేక పెట్టింది సత్యభామ. కానీ ఆ కేక తనకు తప్ప ఎవరికీ వినిపించలేదు. అంతలోనే ఒకసారి కొండ్రావు అన్న మాటలు గుర్తుకొచ్చాయి. "అక్కడ అమెరికా అల్లుడు ఇల్లరికం రానూ అంటే వీడు బూర్ల గంపలో పడ్డట్లే. కోటీశ్వరుడి అల్లుడౌతాడు"! ఆ మాటలు నిజమౌతాయేమోనని వెక్కి వెక్కి ఏడ్వసాగింది సత్యభామ.

రాత్రి పన్నెండు గంటలైంది. మనోక్షోభతో కలత నిదుర కూడా రావడంలేదు. బయట జోరున వర్షం, ఉరుములు, మెరుపులు! వీధిలో ఆటో ఆగిన శబ్దం వినిపించింది. లేచి కిటికీ తలుపు తెరిచింది భామ.



కృష్ణమూర్తి, వసుంధర, ఆటోలోంచి దిగారు. వారిని చూడగానే హృదయం మండింది.

"బై బై... గుడ్‌నైట్" నవ్వుతూ వసుంధరకు వీడ్కోలు చెబుతున్నాడు కృష్ణమూర్తి. "గుడ్ కాదు, మార్వలెస్ నైట్.. థాంక్యూ కేకే" చెయ్యి కలిపింది వసుంధర.

"థాంక్యూ.... " చెయ్యి ఊపాడు కృష్ణమూర్తి.

"మెర్రి క్రిస్మస్...హ్యాపీ న్యూఇయర్.." షేక్ హ్యాండిచ్చింది వసుంధర డాన్స్ చేస్తూ.

"హ్యాపీ న్యూ ఇయార్.." ఆలపించాడు కృష్ణమూర్తి.

"యార్ అని సాగదీస్తే తాళం తప్పుతుంది. మెర్రి క్రిస్మస్... హ్యాపి న్యూ ఇయర్... తాళం తప్పితే మా డాన్సింగ్ ఆంటీ నన్ను చంపేస్తుంది కె.కె..." పాట పాడింది వసుంధర.

"డాన్సింగ్ ఆంటీ తాళంలోనే కాదు. ఎందులో తప్పినా చంపేస్తుంది. స్ట్రిక్ట్ ..వెరీ... " లోపలకు వెళ్ళబోయాడు కృష్ణమూర్తి.

కానీ వసుంధర వదిల్తే కదా? "వన్ మినిట్..వన్‌మినిట్.. లోపలకు పిలిచి పాపం .. నాకు కాస్త టీ ఇవ్వకూడదా కే.కే." అన్నది గారంగా.

వారి సంభాషణ వింటూ రగిలిపోయింది సత్యభామ. వారి సంబంధం మీద తీవ్ర అనుమానం పొడసూపింది.

"అమ్మో.... కూడదు. కూడదంటే కూడదు. అసలు నీకు గుడ్‌నైట్." చెయ్యి లాక్కున్నాడు కృష్ణమూర్తి.



"అరె ...స్నో....స్నో ఈజ్ ఫాలింగ్.." వర్షంలో కేరింతలు కొడుతూ అన్నది వసుంధర.

"మరే ..దాన్నే తెలుగులో వర్షం అని అంటారు". అని తొందర పెట్టసాగేడు కృష్ణమూర్తి.

ఎంత తొందరగా ఆమెను వదిలించుకోవాలా అనుంది కృష్ణమూర్తికి. ఆమెకు అలా లేదాయె! ఒంటిపై నున్న జర్కిన్‌ని గొడుగులా కప్పుతూ "నా గొడుగు నువ్వు...నీ గొడుగు నేను .. మా గొడుగు ఓ మామా..

ఎప్పుడిస్తావు?'' అంటూ పాట పాడసాగింది.



"సరె సరె....పద పద...'' విసుగ్గా అన్నాడు కృష్ణమూర్తి.

కానీ వసుంధర వింటేగా! కృష్ణమూర్తి నడుం మీద చెయ్యివేసి "నా గొడుగు నీవు... నీ గొడుగు నేను...'' అంటూ పాడుతూ డాన్స్ చెయ్యసాగింది.

విసుగెత్తి పోయింది కృష్ణమూర్తికి. ఓ వంక వర్షంలో తడిసి ముద్దైతుంటే అర్థం పర్థం లేని వసుంధర ఆకతాయితనం కోపం తెప్పించింది. వసుంధర నడుం చుట్టూ చేయి వేసి లాక్కునిపోయి ఆటోలో ఎత్తి కుదేసి "ఆటో ..పోనీయ్...'' అన్నాడు.

"గుడ్ నైట్ కే.కే...మార్వలెస్ నైట్...బై బై....'' చెయ్యి ఊపింది వసుంధర.

ఆమె వెళ్ళగానే ఊపిరి పీల్చుకుని లోపల కొచ్చాడు. తలుపు తట్టాడు. భామ వచ్చి తలుపు తీసి ఏమీ మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది. భామ కోపంగా ఉన్నట్లు గ్రహించాడు కృష్ణమూర్తి. తలుపు తీయబోయి ఆగాడు.

"పెద్దవాళ్ళు నిద్రపోతున్నారు. తలుపు కొట్టలేను, అరవలేను. బయటకు రా'' అన్నాడు చిన్న స్వరంతో.

భామ తలుపు తియ్యలేదు.

"నువ్వు తలుపు గడియ వేసుకోలేదు. చేరబడి వున్నావు. నా మాటలు వింటున్నావు. నువ్వేం చూశావో, ఏం విన్నావో తెలియదుగానీ నువ్వే మనుకుంటున్నావో తెలుస్తోంది''అన్నాడు

కృష్ణమూర్తి మాటలు వింటూ ఏడుస్తున్నది భామ. తలుపు మాత్రం తెరవలేదు. మనసు తలుపులే మూసేసిందామె.



"అది తప్పు. ఇటువస్తే చెప్పగలను. అసలు జరిగిందేమిటో తెలుసుకోకుండా కోపం తెచ్చుకోవడం తప్పు. ఆ కోపం కొద్దీ ఎదుటివాళ్ళను సాధించడం చాలా పెద్ద తప్పు. నీకిది తగదు. య్యాన్...ప్లీజ్ కమవుట్'' అన్నాడు కృష్ణమూర్తి.

కోపంగా బయటకొచ్చింది భామ. వర్షిస్తున్న మేఘంలా ఉందామె. "మీరేం చెప్పొద్దు. చెప్పినా నేను వినను. విన్నా నమ్మను. పెద్దవాళ్ళు నిద్రపోతున్నారు. అబద్ధాల సోది చెప్పి గొడవ చెయ్యకండి. మీరేం తప్పు చెయ్యలేదు. మీకు నచ్చిన దారిలో మీరు వెళ్తున్నారు. అంచేత నా దారి నాది. గుడ్ బై'' అన్నది.

"భామా...చెప్పేది వినకుండా నోటికొచ్చినట్లల్లా వాగడం, చాలా... చాలా బుద్ధితక్కువ పని'' అన్నాడు కృష్ణమూర్తి.



"బుద్ధి తక్కువవడం చేతనే చాలా పెద్ద తప్పు చేశాను... ఆరు నెలలనాడు నేను మీకు ఒక కప్పు టీ అందించాను. చూడటానికి బావుంది. కానీ వాడటానికి బాగా లేదు. చేదు కొట్టిందన్నారు. ఇవాళ, ఈ వెలిసిపోయిన పెళ్ళాం చేదు విరగడమే కాదు చప్పగా జావగారి పోయిందనుకున్నారు. ఈ టీ వద్దనుకున్నారు. ఇంకో టీ ని కోరుకున్నారు. అది మీ హక్కు. మీలాంటి మొగుడు నాకు వద్దనుకున్నాను... ఇది నా హక్కు. నేను నేనుగా బతగ్గలను. నేనూ సంపాదించుకుంటున్నాను డబ్బు'' సీరియస్‌గా అన్నది భామ.

భామ కళ్ళలోకి చూశాడు కృష్ణమూర్తి. చేయని నేరానికి తన జీవితంలో సగం అయిన అర్ధాంగి అపార్థం చేసుకుని శిక్షించబూనడం అతని మనసును తీవ్రంగా గాయపరిచింది. "అంతేనా... మనమధ్య సంబంధం డబ్బేనా?'' బాధగా అన్నాడు.



"అవును ఖచ్చితంగా డబ్బే... మనం ఏనాడు ప్రేమించుకోలేదు. ప్రేమలేఖలు రాసుకోలేదు. ఫలానా రోజు కలుసుకోవాలని ఎంగేజ్ మెంట్ ఉత్తరాలు రాసుకున్నాం. కలిశాం. పెళ్ళిచూపులవేళ మనం మాట్లాడుకున్నది మన మనసులు గురించి కాదు- మనీ పర్సులు గురించి. నా జీతం ,నీ వాటా, నా కోటా- నా అప్పులు నీ బాకీలు- ఇవేగా! పెళ్ళి కాంట్రాక్ట్ కుదుర్చుకున్నాం. ఆనాటి మన పెళ్ళికి పునాది డబ్బే. రేపటి మీ రెండో పెళ్ళికి పునాదీ ఆ డబ్బే'' ఏడుస్తూ అన్నది భామ.

భార్య తనను ఎంతమేరకు అపార్థం చేసుకున్నదో గ్రహించి ఖిన్నుడయ్యాడు కృష్ణమూర్తి. అదే సమయంలో తన నిష్కల్మష హృదయాన్ని అర్థం చేసుకోలేని ఆలిమీద ఆగ్రహం కూడా కలిగింది. 'భామా' అంటూ ఆవేశంతో చెయ్యెత్తాడు. కానీ భామ ఆ చేతిని మధ్యలోనే ఆపేసింది. తీక్షణంగా చూసింది. చేతిని కిందికి దించాడు కృష్ణమూర్తి.

"పెళ్ళికి పునాది- నమ్మకం, గౌరవం అని చెప్పారు మీరు. నమ్మకం ఇందాకే విరిగిపోయింది. గౌరవం ఇపుడు మీరు పెళ్ళాం మీద చెయ్యెత్తినపుడు విరిగిపోయింది. ఇక మిగిలింది..?దీనికి కూడా సంజాయిషీలు ఉంటాయా'' ప్రశ్నించింది.

"ఉంటాయి. ఉన్నాయి. ఉన్నాగానీ చెప్పను. ఎందుకో తెలుసా? అది వినవలసినవాళ్ళకు వినే యోగ్యత పోయింది. నమ్మకం ఉన్న చోట బూతు కూడా నారాయణా అని వినిపిస్తుందని నేనే చెప్పాను. అనుమాన పిశాచం పూనిన వాళ్ళకు నారాయణమంత్రం కూడా బూతులాగే వినిపిస్తుంది. అది వాళ్ళ ఖర్మ'' అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి మాటలు భామ మీద ఏ ప్రభావమూ చూపించలేదు. గారడీ చేసే వారు పొరబాటున గొంతు కోసుకున్నా అది గారడీయే అనుకుంటారు. వ్యక్తి మీద విశ్వాసం సడలిన తరువాత ఎంత చెప్పినా చెవి కెక్కదు కదా!



కృష్ణమూర్తిని అసహ్యంగా చూసింది భామ. "మొగుడు కొడితేపడి, కాళ్ళమీద పడి, కొట్టినా, చంపినా, దగా చేసినా 'మీరే నా దైవం' అనే పతివ్రతను కాను. అంతే కాదు. నాలాగే ఇంకో బుద్ధితక్కువపిల్ల మీ లాంటి వాళ్ళు పన్నే వలలో పడిపోతుంటే 'నాకేం' అని ఊరుకునే ఆడదాన్నీ కాదు. ఊరుకోను కూడా. రేపే మన బండారం బద్దలు కొట్టేస్తాను. నా ఉద్యోగం పీకేసి నన్ను ఉరేసినా సరే''... విసురుగా లోపలకెళ్ళి తలుపేసుకుంది.

* * *

తెల్లవారింది. అపార్థాల విషవలయంలో చిక్కుకుని తన బ్రతుకును కూడా తెల్లవార్చుకోవడానికి సిద్ధపడింది భామ. ఆలోచన స్థానంలో ఆవేశం మెదడులో ప్రవేశించినపుడు అనుబంధాలకు అతీతంగా అంతరాలు పెరిగినపుడు ఎంత ఉత్తములైనా పామరుల్లానే ప్రవర్తిస్తారు అనడానికి సత్యభామే ఉదాహరణ. తన ప్రమేయం లేకుండానే పరస్త్రీతో చనువుగా ప్రవర్తించవలసిన అవసరం వచ్చిన భర్తను తూలనాడి భర్తతో తెగతెంపులు చేసుకోవడానికి తెగించిందామె.

**(ఇంకావుంది)**

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 15



- ఇంద్రగంటి జానకీబాల

తానే మారెనా - గుణమ్మే మారెనా! దారీ తెన్ను లేనే లేక -ఈ తీరాయెనా!

తెలుగు సినిమా గురించి ఏ కొంచెం తెలిసిన వారికైనా "దేవదాసు" గురించి తెలీక మానదు. అందులో వున్న మూడు ముఖ్యపాత్రలు దేవదాసు, పార్వతి, చంద్రముఖి! నాయికానాయకులనలా వదిలేస్తే, అందరినీ ఆకర్షించిన పాత్ర చంద్రముఖి. -ఆమె పాడిన ముచ్చటైన మూడు పాటలు. ఆ మూడు పాటలూ పాడిన ఆర్. బాల సరస్వతీదేవి సినిమా పాట చరిత్రలో సుస్థిరకీర్తి నార్జించుకున్నారు.

తెలుగు సినిమా పసిగుడ్డుగా కళ్ళుతెరుస్తున్న సమయంలోనే అత్యంత ప్రతిభతో ఏడేళ్ళ పిన్న వయసులో బాలనటిగా 1935లో 'సతీ అనసూయ' సినిమాద్వారా పరిశ్రమలోకి అడుగుపెట్టిన శ్రీమతి రావు బాలసరస్వతీదేవి, ఆ సినిమాలో 'గంగ' పాత్ర పోషించి, తన పాట తనే పాడుకుని అందర్నీ మెప్పించి శభాష్ అనిపించుకున్నారు. ఆ వయసులో ఆమె పాట విన్నవారంతా ముగ్ధులై ఆ బాలికలో వున్న ప్రతిభను ఎంతగానో మెచ్చుకున్నారు. అప్పట్నించి ఆమె 'బాలయోగిని' -'భక్తతుకారం' మొదలైన చిత్రాలలో నటించి,పాడి పేరుప్రఖ్యాతులు తెచ్చుకున్నారు. ఆమె 'భక్త - కుచేల'లో కృష్ణుడిగా చాలా పేరు, పెద్దల మన్ననలు పొందారు.

అప్పట్లో క్రమంగా సాలూరి రాజేశ్వరరావుగారితో కలిసి 'ఇల్లాలు' చిత్రంలో (1940) పాడుతూ నటించారు. అయితే ఆ తర్వాత నటనకి స్వస్తిచెప్పి కేవలం ప్లేబ్యాక్ పాడటానికే అంకితమైపోయారు. తెలుగు సినిమా పాట చరిత్రలో మొట్టమొదటిగా మరొకరికి ప్లేబ్యాక్ పాడిన గాయని రావు బాలసరస్వతీదేవి.

భీమవరపు నరసింహారావు(బి.ఎన్.ఆర్) సంగీత దర్శకత్వంలో 'భాగ్యలక్ష్మి'(1943) అనే సినిమాలో కమలా కొట్నీస్‌కి 'తిన్నెమీద చిన్నోడా! వన్నెకాడా' అనే పాట మొదటగా ఆమె పాడారు. ఇదే సినీనేపథ్య గానానికి మహిళలు శ్రీకారం చుట్టిన పాట.

మరొక ముఖ్యమైన సంగతేమంటే బాలసరస్వతీదేవి మొట్టమొదటి నేపథ్యగాయనే కాదు, మహాకవి శ్రీశ్రీ రాసిన మొదటి సినిమాపాటను పాడిన గాయని కూడా. ఆ కీర్తి ఆమెకే దక్కుతుంది.

'నీరా ఔర్ నందా' అనే హిందీ సినిమాను తెలుగులోకి 'ఆహుతి' అనే పేరుతో డబ్ చేయాలని సంకల్పించినప్పుడు, మొట్టమొదటి




సారిగా ఆ సినిమాకి మాటలు - పాటలు రాసేందుకు శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు) సినీరంగ ప్రవేశం చేశారు. ఈ తెలుగు చిత్రానికి తెలుగు సంగీత దర్శకులు శ్రీసాలూరి రాజేశ్వరరావు. ఇందులో పాటలు ఘంటసాల వెంకటేశ్వరరావు, బాలసరస్వతీదేవి, టి. కనకం పాడారు.

"ఈ చిత్రం డబ్బింగ్ సమయంలో రాజేశ్వరరావు గొప్ప సాహసం చేశారు. ఆ హిందీ పాటల ట్యూన్లు ఆయనకి నచ్చలేదు. ఆ ట్యూన్‌లకి యథాతథంగా పాటలు రాశారు శ్రీశ్రీ. ఆ పాటల్ని అదే రిథమ్‌తో వేరే ట్యూన్స్ చేసి, మాచేత పాడించి, అతికారు. అంటే పాటలో ఎక్కడ ఎలాంటి మలుపు వచ్చినా, అదేవిధంగా కొత్తగా మార్చిన ట్యూన్‌లోకూడా రావాలన్నమాట. అలాంటి ఒక అద్భుతమైన ప్రక్రియ చూపిన డబ్బింగ్ సినిమా అది. అలాంటి ప్రయత్నం అంతకు పూర్వం ఎవ్వరూ చెయ్యలేదు. తర్వాత కూడా ఎవ్వరూ చెయ్యలేదు'' అంటూ బాలసరస్వతి తన జ్ఞాపకాల్ని తల్చుకుంటూ చెప్పారు.

బాలసరస్వతి 28 ఆగస్టు 1928న మద్రాసు నగరంలో పుట్టారు. అయితే బాల్యమంతా గుంటూరులో గడిచింది. కొంచెం చదువుకున్నారు.

"నాకు మొదట్నించీ చదువంటే ఇష్టం వుండేది కాదు. పాటలంటేనే ప్రాణం'' అంటారామె చిరునవ్వుతో.

''మా తండ్రిగారు పార్థసారథిగారికి సంగీతమంటే ఎంతో యిష్టం. కానీ మా తల్లిగారైన విశాలాక్షి గారికి చదువు మీదనే మోజు. సంగీతమంటే ఇష్టం లేదని కాదు గానీ పాటలూ అవీ ఎందుకూ అనే భావం ఆమెకుండేది".

మద్రాసులో ఒక నాటక ప్రదర్శనకి వెళ్ళి తండ్రి ఒళ్ళో కూర్చుని వేదిక మీద నటిస్తూ పాడుతున్న వారిని చూసి తనూ పాడుతానని మారాం చేశారు చిన్నారి బాలసరస్వతి. ఆ పాపకప్పుడు వయసు కేవలం నాలుగేళ్ళు. అదే వరుసలో కూర్చుని వున్న కపిలవాయి రామనాథశాస్త్రి ఆ చిన్నారిలో వున్న వుత్సాహం చూసి ముచ్చటపడి ఆయనే ఎత్తుకుని స్టేజీమీదకి తీసుకెళ్ళి పాట పాడించారు. నదురు బెదురు లేకుండా 'నమస్తే మత్ప్రాణనాథా' అనే పాట గొంతెత్తి పాడటం చూసి, విని అందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

కేవలం నాలుగేళ్ళ వయసుకే స్టేజి ఎక్కి పాడిన బాలసరస్వతి తన ఆరవ ఏట గ్రామఫోను

రికార్డు యిచ్చారు. పదిహేనేళ్ళ వయసు వచ్చేసరికి ఆమె తనే పాడుకుంటూ పదమూడు సినిమాల్లో నటించారు.

ఇక్కడ బాలసరస్వతీదేవిలోని మరో కోణం గురించి చెప్పుకోవాలి. అది ఏమంటే - లలిత సంగీతం పాడటం అనే ప్రక్రియలో ఎవ్వరూ కనీవినీ ఎరుగని రీతిలో పాడి శ్రోతలనుర్రూత లూగించిన మొదటి గాయనే కాదు ఏకైక గాయని ఆమె. సినిమాల్లో పాటలు పాడిన వారెవ్వరూ ఇంతగా లలితసంగీతం రేడియో ద్వారా, గ్రామఫోను రికార్డులపైనా పాడిన వారు లేరు. శ్రీ రాజేశ్వరరావుతో కలిసి ఆమె అమోఘమైన పాటలు పాడి, సినిమా పాటకి దీటుగా లలిత గీతాన్ని నిలబెట్టారు. అప్పట్లో ప్రయివేట్ పాటలు విస్తృతంగా పాడి ఆదరణ పొందినవారు శ్రీసాలూరి రాజేశ్వరరావు, ఘంటసాల వెంకటేశ్వరరావు, బాలసరస్వతీదేవి. అవి లలితసంగీతానికి మంచిరోజులు.

"ఆంధ్రదేశంలో 1940-1950 మధ్య సుమారొక పదేళ్ళు లలిత సంగీత రంగంలో రాజేశ్వరరావు, బాలసరస్వతిగార్లదే రాజ్యం. అదొక స్వర్ణయుగం,స్వప్నయుగం. వారిరువురు కలిసి పాడినవి, విడివిడిగా పాడినవి కొన్ని గొప్ప పాటలు 1940లలో గ్రామఫోను రికార్డులుగా వచ్చాయి" అంటూ ఆ రోజుల్ని తల్చుకుంటారు శ్రీనండూరి రామ్మోహనరావుగారు.

'కలగంటి కలగంటి- కమల రేకుల వంటి' అనే పాట బాలసరస్వతి మొదట రేడియోలో పాడారు. కానీ తర్వాత రాజేశ్వరరావు ఆ పాట గ్రామఫోను రికార్డుగా యిచ్చారు. అదే అందరికీ బాగా తెలుసు. అదే పాప్యులర్. కానీ బాలసరస్వతి మొదటిగా పాడింది మనకి దొరకదు.

'పొదరింటిలోనుండి', 'రావె రావె కోకిలా'- 'తలుపు తీయునంతలోన', 'తుమ్మెదాఒకసారి', 'హాయమ్మ హాయి- మా పాపాయి', 'అలయమున వినబడునదిగో', 'ఆ తోటలోనొకటి ఆరాధనాలయమూ', 'ఏనాటికీ రాడు ఏలాంటి ప్రియుడే','వెల్లువూల పానువుపైన', 'సంగీత వేలనే- పొంగేటిలయలేల', 'ఒకే ఒక్కసారి -ఎగాదిగా చూసి,' 'సృష్టిలో తీయనిది- స్నేహమేనోయి', 'నిండు పున్నమి- పండు వెన్నెలలో', 'నీల మోహనుడు నా కన్నులలో', 'ఈ చల్లని రేయి -తిరిగి రానే రాదు', 'వినవే చెలి పిలుపు అల్లదిగో', 'విరహానలంపు బాధ- భరియింపలేదు రాధా', 'నల్లని వాడా! నే గొల్ల కన్నెనోయ్', 'కోపమేల రాధా! దయచూపవేల నాపై', 'నటనమాడవే మయూరి' ఇలా ఎన్నో పాటలు బాలసరస్వతి పాడి శ్రోతల్ని ముగ్ధుల్ని చేశారు. అప్పట్లో రేడియో తిప్పితే ఆమె పాట ఒకటైనా తగలక మానదనిపించేది.

రావు బాలసరస్వతీదేవి సినిమా పాటలు పాడటం ద్వారా ప్రసిద్ధులని చెప్పడానికి వీల్లేదు. ఆమె పాడిన ప్రయివేట్ పాటలకి సినిమా పాటలకన్నా ఎక్కువ గిరాకీ వుండేది, ఆదరణ వుండేది.

ఆమె రేడియో ద్వారా, గ్రామఫోను రికార్డుల ద్వారా ఎన్నో పాటలు పాడుతూ, ప్రచారం పొందుతూ, సినిమాల్లోనూ అంత మంచి పాటలు, అంత గొప్ప సంగీత దర్శకుల దగ్గర పాడారు. అది సినిమా పాటైనా, ప్రయివేట్ పాటయినా అది ప్రత్యేకంగా వుండేది. బాలసరస్వతిదేవి పాటగా వుండేది.

ఆమె మొదటి తరం సంగీత దర్శకులతో పనిచేశారు. వారు ఫ్రెష్‌గా కంపోజ్ చేసిన పాటలు పాడారు. 1. సి.ఆర్. సుబ్బురామన్, 2. బి.ఎన్. ఆర్. 3. అద్దేపల్లి రామారావు 4. రజనిలాంటి ప్రతిభావంతులైన సంగీతదర్శకుల దగ్గర పాడారు.

1947లో ఛత్రపతి వారు 'రాధిక' అనే చిత్రం నిర్మించారు. నిర్మాత బాలసరస్వతి తండ్రిగారు. అందులో సదాశివబ్రహ్మం రాసిన 'గోపాలకృష్ణుడు నల్లన' అనే పాట ఎంత జనాదరణ పొందిందో చెప్పనలవికాదు. ఈనాటికీ ఆ పాట రేడియో ద్వారా తరుచు వినిపిస్తూ వుంటుంది. ఈ పాటకి సంగీతం కూర్చినవారు శ్రీ సాలూరి హనుమంతరావు.

బాలసరస్వతి గొంతు మృదువుగా సాగి హృదయతంత్రులను మీటుతుంది. మంద్రంగా, మెత్తగా, లలితంగా, లాలిత్యంగా, సొగగా, సొయగంగా, భక్తిగా, అనురక్తిగా పలికే ఆ గొంతు శ్రోతలకు సమ్మోహనం కలిగిస్తుంది.

1949లో 'లైలా మజ్ను' చిత్రంలో శ్రీరంజనికి ఒక పాట పాడారు. సి.ఆర్. సుబ్బురామన్ సంగీత దర్శకత్వంలో రూపొందిన "ఏల పగాయే " ఎంత బాగుంటుందో చెప్పలేము. అది ఒక చిన్న పాటే అయినా మిగిలిన పాటలతో సమానంగా ప్రఖ్యాతిపొంది, ఒక గుర్తింపును పొందింది.

అలాగే ఆమె సినిమాలో ఏ ఒక్క పాట పాడినా దానికదే సాటిగా నిలబడిపోతూ వుంటూ వచ్చింది. అదే సన్నివేశమైనా, అక్కడ నటించినదెవరైనా, కథ ఏదైనా అంతా బాలసరస్వతీ మయంగా ఆమె పాటగానే అది ప్రచారం పొందేది. 'భాగ్యలక్ష్మి' 'రాధిక', 'తెనాలి రామకృష్ణ', 'పెళ్ళిసందడి', 'మానవతి', 'స్వప్నసుందరి', 'జయసింహ', 'షావుకారు', 'దేవదాసు', 'మంచి మనసుకు మంచి రోజులు', 'నా యిల్లు ' లాంటి ఎన్నో చిత్రాల్లో ఆమె పాడారు. ఒక పక్క ప్రయివేట్ గ్రామఫోను రికార్డులు, మరోపక్క సినిమా పాటలు ఎంతో ఆదరణ పొందాయి. సంగీత ప్రియులకు బాలసరస్వతి అభిమాన గాయకురాలు.

"నేను పాడిన ఎన్నో పాటలు, సినిమాలు మధ్యలో ఆగిపోవడం వల్ల, రికార్డులు రాకపోవడం వల్ల, వెలుగుచూడనివి వున్నాయి. వాటి గురించి తెలుసుకునేందుకు కూడా అవకాశం లేదు" అన్నారామె.

'ముగ్గురు కొడుకులు', 'గాంధారి గర్వభంగం', 'భక్తమార్కండేయ', 'మా గోపి', 'లేడీ డాక్టర్, 'సాహసం', 'భూలోకరంభ', 'రాజీ నా ప్రాణం', ఇలా ఎన్నో సినిమాల్లో పాడినప్పటికీ అన్నీ బయటకి రాలేదు.

'చిలుకా నన్నే మరిచేవా' అనే కె.వి. మహదేవన్‌గారి పాట 'ఏ దారి చనినావో చందమామా' అనే పెండ్యాలగారి పాట పాడి రికార్డు చేసినా, అవి అసలు ఏ సినిమాలో వున్నాయో తెలీకుండా పోయాయి.

చాలామందికి తెలియని విషయం- రేలంగి, శివరావులతో కలిసి సుబ్బురామన్ కోరికపై 'ముంత పెరుగండోయ్' అన్న కామిక్ పాట 'ప్రేమ'లో పాడారు.

రిపబ్లిక్ వారి 'పెళ్ళిసందడి'లో ఘంటసాలతో డ్యూయట్ -

అ : రావే ! ప్రేమలతా<br>
నీవే నా కవితా<br>
కిన్నెర మీటుల కిలకిలవే -పలు<br>
వన్నెల మెరుపుల మిలమిలవే<br>
ఆ: ఓహో కవిరాజా నేడే నెలరాజా<br>
ఎందులకోయి పరవశము నీ<br>
కెందులకోయి కలవరము -<br>
అనే పాటలో...<br>
..అందవతీ కనుపించినచో కవు<br>
లందరి చందమిదేలే -

అనే మాటలు బాలసరస్వతి చాలా సులువుగా, చిన్న హేళనతో , మంచి స్ఫూర్తితో అనేస్తారు.

విక్రమ్ ప్రొడక్షన్ వారి 'తెనాలి రామకృష్ణ' చిత్రంలో సభలో చేసే నృత్యానికి

"ఝుణ్ ఝుణ్ కంకణములూగ<br>
ఘల్ ఘల్ కింకిణులు మ్రోగ<br>
కోరికలీడేర - కూడేనురా..."

అనే పాట విశ్వనాథన్, రామ్మూర్తి సంగీతంలో చాలా బాగుంటుంది. దీనికి సురభి బాలసరస్వతి నాట్యం చేసింది. నిజానికి ఎక్కువ ప్రాముఖ్యం వున్న సన్నివేశం కాదు. కానీ పాట చాలా చక్కగా వుంటుంది. విడిగా విన్నప్పటికీ దీనికో గొప్పతనం వుంది. ఇది చాలా పాప్యులరైంది. కారణం పాటకి అమరిన ట్యూన్, దాన్ని అందంగా పాడిన బాలసరస్వతి కంఠంలోని ఒదుగు. అంతే.

సి.ఆర్. సుబ్బురామన్ సంగీతంలో 'స్వప్నసుందరి'లో, - రజని చేసిన 'మానవతి'లో బి.ఎన్.ఆర్.'మాయామచ్ఛీంద్ర' లో ఆదినారాయణరావు సంగీతం కూర్చిన 'మాయలమారి' లో మంచి పాటలున్నాయి.

'మానవతి' సినిమాకి సంగీతం చేయడంలో బాలాంత్రపు రజనీకాంతరావుకి కూడా భాగముంది. అందులో ఆయన 'ఓ మలయ పవనమా -నిలు నిలు నిలుమా', 'తన పంతమే తా విడువడు - తననే వలచిన నను తలపడూ' బాగుంటాయి. ఈ రెండు పాటల రచనా, సంగీతం కూడా రజనియే. (అంటే బాలాంత్రపు

రజనీకాంతరావు) వింజమూరి సీతా అనసూయలతో కలిసి పాడిన విలక్షణ గేయం 'అందుకోండిదే పూలదండిదే' (గౌరిమనోహరి) యిందులోనిదే.

స్వప్నసుందరిలో 'నటనలు తెలుసునులే - ఓ సొగసరి గడసరి వాడా!' -అనే సముద్రాల రాఘవాచార్య రచన మహా చమక్కుగా గొప్పగా వుంటుంది. అలాగే ఘంటసాలతో కలిసి పాడిన 'కానగ నైతినిగా' విరహగీతమూ చాలా బాగుంటుంది.

బాలసరస్వతీదేవి తానే సొంతంగా కంపోజ్ చేసుకుని పాడే అవకాశాన్ని టి.వి.రాజు అత్యంత భక్తిభావంతో కొన్నిసార్లు యిచ్చేవారుట. 'జయసింహ' చిత్రంలో సముద్రాల రచించిన 'మదిలోని మధురభావం-పలికేను మోహనరాగం' అనే యుగళ గీతం మోహన రాగంలో టి.వి.రాజు కంపోజ్ చేసి ఘంటసాల బాలసరస్వతిలచే పాడించారు. చాలా సున్నితంగా వుండే పాట యిది.

విజయా వారి 'షావుకారు'లో 'దీపావళి దీపావళీ'అనే పాట సంతోషం, విషాదం కూడా ఎంతో బాగా పాడారు.

నాగయ్య చిత్రం 'నా యిల్లు' లో కృష్ణశాస్త్రి రచన 'అదిగదిగో గగనసీమ' (సారంగ రాగం) పాట నాగయ్య సంగీత సారథ్యంలో జిక్కితో కలిసి పాడారు. (చిన్న పిల్లలు పాడింది)

'ధరణికి గిరిభారమా -
గిరికి తరువు భారమా
తరువుకు కాయభారమా -
కని పెంచే తల్లికి పిల్ల భారమా'

అనే 'మంచి మనసుకు మంచి రోజులు'లో పాట అనునిత్యం తెలుగువారి పెదవులపై తారట్లాడేదన్నమాట నిజం.

'దేవదాసు' చిత్రంలో ఆమె పాడిన మూడు పాటలూ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడినవి.

మొదటిపాట

'అందాల ఆనందం ఇంతేనయ్యా
అందం చూడవయా ఆనందించవయ్యా'

రెండోపాట 'ఇంత తెలిసి యుండి - ఈ గుణమేలరా' అనే మువ్వ గోపాల పదం- ఇది మూడు రాగాల రాగమాలిక. ఇది పాడటంలో తనకున్న ప్రతిభనంతా ప్రదర్శించారు బాలసరస్వతిదేవి. క్షేత్రయ్య పదం రాగమాలికగా రావడం యిదే మొదలు.

ఇంక మూడోపాట

'తానే మారెనా - గుణమ్మే మారెనా
దారీ తెన్నులేనే లేక - ఈ తీరాయెనా'

దేవదాసు చిత్రంలో పాటలన్నీ సంగీతపరంగా, సాహిత్యపరంగా ఉన్నతస్థాయికి చెందినవి. ఆ చిత్రానికందరూ ఎంతో చిత్తశుద్ధితో పనిచేశారు. అందులో చంద్రముఖి పాత్రకున్న మూడు పాటలనూ రావు బాలసరస్వతి పాడటం గొప్ప విశేషం. ఈమె గళంలో పలికిన ఆ పాటలు, (లలిత నటించారు) చంద్రముఖి పాత్రకు ఒక ఉదాత్తతను చేకూర్చిపెట్టాయి. ఆ పాటల క్రమం ఆ పాత్ర జీవనపరిణామ క్రమంలో వుండటం. ప్రేక్షకులు, శ్రోతల మనసుల మీద తెలీకుండానే గాఢమైన ముద్ర వేసింది.

ఈ మూడు పాటలతో బాలసరస్వతి పేరు సినీసంగీత ప్రపంచంలో చిరస్థాయిగా నిలిచిపోతుందని చెప్పవచ్చు.

''మీరు పాటలు పాడటంలో కొన్ని నియమాలు పెట్టుకుంటారనుకుంటాను" అంటే "అవును . నిజమే. సాహిత్యం బాగుండకపోతే నేను పాడను. నాకిష్టముండదు. హాస్యం పాటలు కూడా నేనెక్కువ పాడలేదు. శ్రుతి విషయంలో కూడా నాకు అనువైన శ్రుతినే ఎంచుకుంటాను" అంటూ ఖచ్చితంగా చెప్తారామె.

''పాట-మాధుర్యంగా, వినసొంపుగా వుండాలి" అంటారామె. "సినిమా పరిశ్రమలో మనుషులు స్వార్థంతో నిర్దయగా వుంటా రంటారు. మీ అనుభవం ఏమిటి?'' అని అడిగితే.....

"నేను బొంబాయిలో శ్రీవసంత్ దేశాయ్‌గారి దగ్గర కొన్నాళ్ళు సంగీతం నేర్చుకున్నాను. అప్పట్లో నేను కొన్ని పాటలు పాడే అవకాశం వచ్చినట్టే వచ్చి ఆగిపోయింది. దానికి కారణాలు ఏమైవుంటాయో మీరూహించలేరా? నేను నౌషద్ గారి దగ్గర రెండు పాటలు పాడాను" అన్నారామె.

ఆమె చిరాకుపడిన సందర్భాలు కూడా కొన్ని వున్నాయి. ఆమె ఒకసారి ఒక పాట రిహార్సిల్‌కి వెళ్ళారు. అంటే ఒక సినిమాలో ఒక పాట కోసం, పాట నేర్చుకోవడానికెళ్ళినప్పుడు - ఆ సంగీతదర్శకులు పాట ఒకసారి వినిపించి 'ఏదమ్మా ఓసారి పాడండి' అంటూ టేపురికార్డరు ముందు పెట్టారు.

'ఇదేమిటిది' అని అడిగారామె.

'మీ గొంతు ఎలా వుందో చూద్దామనీ... ' అంటూ ఆయన జవాబు చెప్పారు.

'నా గొంతెలా వుంటుందో తెలీకుండానే నన్ను పిల్చారా' అన్నారామె.

''అబ్బే అదికాదు ఈపాట మీరెలా పాడుతారోననీ"...

ఆయన పద్ధతికి ఆమెకి చిరాకేసింది. అప్పుడేకాదు ఆ తర్వాత కూడా ఆమె ఆ సంగీతదర్శకుని దగ్గర పాడలేదు. ఏలాగోలాగ గడుపుకుని పాట దక్కించుకుని పాడేద్దామను కునే స్వభావం బాలసరస్వతీదేవిది కాదు. అందువలన కూడా ఆమెకు రావలసినన్ని పాటలు రాలేదేమో!

ఇంత విశిష్టమైన సంగీత చరిత్ర, గుర్తింపు గల రావు బాలసరస్వతీదేవి సినీ సంగీత జీవితం చాల కొద్దికాలమే అని చెప్పాలి. ఆమె ఆరవ ఏటనే గ్రామఫోను రికార్డు యిచ్చినా, 16వ యేటనే వివాహం కావడం వల్ల ఆమె పాటకి అడ్డుకట్ట వడింది. ఆమెని వివాహం చేసుకున్నవారు ఎవరో సామాన్యులు కాకపోవడం, కోలంకరాజాలైన రావు ప్రద్యుమ్నకృష్ణ మహీమతి సూర్యారావు బహద్దరు కావడం వల్ల ఆమెలోని సంగీతం తెర వెనక్కి తప్పుకోవాల్సి వచ్చింది.

రాజావారు గుర్రప్పందాలకెళ్ళినప్పుడు అక్కడొక్కసారి ఆమెను చూశారు. వారింటికెళ్ళి ఆమె చేత పాట పాడించుకుని విన్నారు.

'కలగంటీ కలగంటీ కమల రేకుల వంటి
కన్నులు గల స్వామి కనిపించెనే'

అంటూ ఆమె తియ్యగా హాయిగా పాడారు. అందులో ఆమె తన విశాలనేత్రాల గురించి పాడినట్లు ఆయన ఆనందపడిపోయారు. వారి వివాహం జరిగిపోయింది.

పదహారేళ్ళ బాలసరస్వతి సంగీతానికీ, తన పాటకీ దూరంగా అంతఃపురవాసంలో వుండే జీవితాన్ని వూహించుకోలేక పోయింది. స్త్రీకి కళకన్నా, భర్త, పిల్లలు, ఇల్లు, రక్షణ ఇవే ముఖ్యం అని చెప్పే మాటల్ని మన్నించింది. రాజావారిని మనువాడి పరదాల వెనక్కి వెళ్ళిపోయింది.

అయితే అప్పటికే సాలూరి రాజేశ్వరరావు గారితో నటించి పాడి వుండటమే కాకుండా ఎన్నో ప్రయివేట్ రికార్డులిచ్చి పేరు ప్రఖ్యాతులు గడించి వుండటంవల్ల చాలామంది సినీ ప్రముఖులు ఆమెచేత పాడించాలని ప్రయత్నించారు. ఆ విధంగా రాజాగారి అనుమతితో అప్పుడొక పాట, ఇప్పుడొక పాట 1956 వరకు అంటే సుమారు పదేళ్ళు పాడుతూ వచ్చారు. ఆ సమయంలో పాడిన పాటలే దేవదాసు పాట.

"మీ వారికి సంగీతం యిష్టం లేకపోవడం వల్ల చాలా అవకాశాలు పోగొట్టుకున్నారు కదా" అని అడిగినప్పుడు, "అవును, సంగీతమే కాదు సినిమాలన్నా, పబ్లిక్‌లోకి వెళ్ళడమన్నా కూడా ఆయనకి ఇష్టం వుండేది కాదు. అప్పట్లో ప్లేబ్యాక్ ఆర్టిస్టులకి ఇప్పుడునన్ని సౌకర్యాలు లేవు. రిహార్సిల్‌కి ఎక్కువసార్లు కూచోవాల్సి వచ్చేది. ఒకే మైకులో దగ్గిర దగ్గిరగా నిలబడి పాడాల్సి వచ్చేది - అవన్నీ ఆయనకిష్టం వుండేది కాదు".

"ఒకసారి మావారు నాకోసం స్టూడియో వారిని అడిగితే వాల్మీకి శ్లోకం రికార్డింగ్‌లో వున్నానని చెప్పార్ట. మావారికి చాలా కోపమొచ్చింది. వెంటనే కారేసుకుని వచ్చి, నన్ను తీసుకెళ్ళిపోయారు. ఆ ప్రొడక్షన్ మేనేజర్ ప్రాధేయపడ్డారు. వినలేదు. రికార్డింగులన్నీ యిలా మధ్యలో ఆపేస్తే చాలా నష్టం వస్తుంది అన్నాడు. మావారు వెంటనే పదివేలకు చెక్కు పంపేశారు" అంటారామె ఆనాటి విషయాలు చెప్తూ.

"మరి మీకు పాట పాడద్దూ అంటే నిరాశగా వుండేది కాదా"

"నిరాశగా, అసంతృప్తిగా వుండేది కానీ స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకునే వయసు లేదు. రాజావారు నా మంచి కోసమే చెప్తున్నారు కదా అనుకునేదాన్ని. అంతకుమించి ఆలోచనా, తెగువ లేవు. నాలో వుండే సంగీతం కంటే పిల్లలు,సంసారమే ముఖ్యమని నమ్మేశాను. 'స్వప్నసుందరి' తీసినపుడు ఘంటసాల

బలరామయ్య గారు, దుక్కిపాటి మధుసూధనరావు, అక్కినేని నాగేశ్వరరావుగారు ముగ్గురూ వచ్చి మా వారికి నచ్చ చెప్పి వప్పిస్తే మొహమాటపడి ఆ ఒక్క సినిమాకి పాడటానికి అనుమతించారు" అన్నారామె.

సినిమా పరిశ్రమలో స్త్రీ పురుషులు కలిసి మెలిసి పనిచేయవలసిన పరిస్థితులే ఎక్కువగా వుంటాయి. వారు గాయనీ గాయకులైనా, నటీనటులైనా సరే - అలాంటి సమయంలో అది కేవలం వృత్తి మాత్రమేనని అనుక్షణం గుర్తుంచుకొని, ఏవిధమైన మానసిక అనుబంధాలకీ లొంగకుండా వుండటం అసాధ్యమవుతుంది. ఒక ఆర్టిస్టుని చూసి మరొక ఆర్టిస్టు వ్యామోహపడటం, ప్రేమలో పడటం చాలా సాధారణ విషయం. అయితే ఇలాంటి పరిస్థితిని పురుషుడి విషయంలో ఈ సమాజం ఆమోదిస్తుంది కానీ, స్త్రీ విషయంలో ఆమోదించదు. ఆమె ఎంతటి కళాకారిణి అయినా, సమాజంలో వున్న కట్టుబాట్లకు లొంగే వుండాలనుకుంటుంది. అక్కడే ఘర్షణ మొదలవుతుంది.

ఏవిధమైన ఆకర్షణలకూ లొంగకుండా , తనలోని ఎంతటి కళాత్మకభావాలనైనా, వివాహజీవితంలో ముడిపెట్టుకుని మాత్రమే జీవించాలని శాసిస్తుంది. అది కళాకారిణికి నరకప్రాయమవుతుంది. ఒడిదుడుకులు వచ్చినప్పుడు భయపెట్టి లొంగదీసుకుంటుంది.

తన పెద్దలు తన క్షేమం కోరి మాత్రమే చెప్తున్నారని నమ్మిన బాలసరస్వతికి, పాడగలిగే గళం మౌనముద్ర దాల్చినప్పుడు గానీ గుండెలోని సెగలు అర్థం కాలేదు.

రావు బాలసరస్వతీదేవి గాయనిగా మొదటినుంచి కొనసాగి సినీ పరిశ్రమలోనే వుండి వుంటే ఇంకా ఎన్నో మంచి పాటలు పాడి వుండేవారు. విలక్షణమైన ఆ గొంతు, చక్కని మెత్తని ఉచ్చారణ, అలవోకగా పలికే భావం సంగీతదర్శకుల్ని ఆకట్టుకుంటూ వచ్చేది. ఆమెకు చాలా పాటలు పాడే అవకాశం వచ్చేది. బాలసరస్వతీదేవికి కృష్ణుని ఆరాధించటమంటే ఎంతో యిష్టం. కృష్ణుడికి సంబంధించిన పాటలు పాడేటప్పుడు ఆమె అలౌకికానందాన్ని అనుభవిస్తారని చెప్తారు. రాధాకృష్ణుల ప్రణయం గురించి, కృష్ణలీలల గురించి, కృష్ణభక్తి గురించి పాడాలంటే ఆమెకి చాలా యిష్టమని చెప్తారు.

బాలసరస్వతీదేవి తెలుగులో కంటె తమిళంలో ఎక్కువ పాడానంటారు. కన్నడంలో కూడా పాడారు. మలయాళంలో ఒకటో, రెండో పాడారు.

"కర్ణాటక సంగీతం నేర్చుకునేందుకు ఎక్కువ ఇష్టంగా వుండేది కాదు. వంకర ముఖం చేసుకుని, చాలా అవస్థపడిపోతూ ఏంపాట అనుకునేదాన్ని. అయినా శాస్త్రీయసంగీత పునాది వుండాలని త్యాగరాజ భాగవతార్ నన్ను గొప్ప సంగీత గురువు అలత్తూర్ సుబ్బయ్యగారి దగ్గర సంగీతం నేర్చుకునేందుకు పెట్టారు. కొద్ది కాలమే సాగిందది. తర్వాత మనక్కల్ రంగరాజన్ దగ్గర కొద్దిగా నేర్చుకున్నాను" అంటారామె.

బాలసరస్వతీదేవి కపిలవాయి రామనాథశాస్త్రి రికార్డులు ఎంత ఇష్టంగా వినేవారో అంత ఆసక్తితోనూ జె.ఎల్.రనడే, బాలగంధర్వ, కె.ఎల్.సైగల్ రికార్డులను విని, పాడుకుంటూ వుండేవారు. పాడే విధానం,శ్రుతిలో లీనమవడం లాంటి గుణాలను ఆమె ఆలాంటి గొప్ప గాయకుల నుంచి గ్రహించుకున్నారు అనిపిస్తుంది.

"ఆ రోజుల్లో నాటకాలు వేసేవాళ్ళు, ఆర్టిస్టులు గౌరవనీయులు కారనే భావం సామాన్యులలో వుండేది. అందువల్ల నేను స్టేజి ఎక్కిపాటలు పాడటం, నటించటం చేయడం కన్నా, బాగా చదువుకుని, హాయిగా పెళ్ళి చేసుకుని, సుఖంగా వుండాలనీ మా అమ్మగారు కోరుకునేవారు. నా గురించి కొంచెం భయపడేవారు. ఆమె భయపడినట్లుగానే నాకు తరుచూ అవకాశాలు వస్తూండేవి" అంటారు నవ్వుతూ.

నౌషాద్ సంగీతం చేసిన హిందీ చిత్రం 'ఉరన్-ఖటోలా' తమిళంలో తయారవుతుండగా అందులో పాడేందుకు ఎన్నో కంఠాలను చూసి, బాలసరస్వతిని ఎంపిక చేసుకున్నారు. ఆ పాటలు హిందీలో లతా మంగేష్కర్ పాడగా, వాటిని తమిళంలో బాలసరస్వతి పాడటం సంచలనం సృష్టించింది. ఆమె పాడిన పాటలు అంతా మెచ్చుకున్నారు.

"గీతా ప్రొడక్షన్స్ వారు 'ఋష్యశృంగ' అనే సినిమా కోసం పాటలు రికార్డు చేద్దామని, పాతతరంలో 'వసుంధర' పాడిన పాటల్ని యథాతథంగా బాలసరస్వతి చేత పాడించుదామని ప్రయత్నించారు. కానీ ఒకరు పాడిన పాటలు తను పాడనని నిరాకరించారు" అని చెప్తుంటారు వి.ఏ.కె.రంగారావు. అది ఆమె స్వభావానికి నిదర్శనం.

1974లో భర్త మరణించాక మళ్ళీ బాహ్య ప్రపంచంలోకి అడుగుపెట్టారు బాలసరస్వతీదేవి. సుమారు పాతికేళ్ళు గడిచిపోయాయి. సినిమా పరిశ్రమ,తెలుగు పాటా పూర్తిగా మారిపోయాయి. ఆమె చిత్రపరిశ్రమవైపు దృష్టి సారించలేదు. అప్పటికే పరుగెట్టే పాటతో పరుగెట్టడం ఆమె కిష్టంలేదు.

ఆతర్వాత 'సంఘం చెక్కిన శిల్పాలు' చిత్రంలో ఆమె చేత ఒక అంపకాల పాట ఆమె బంధువు విజయనిర్మల, రమేష్‌నాయుడు సంగీత దర్శకత్వంలో పాడించారు. ఆమె మీరా భజన్లు (సి.నారాయణరెడ్డి అనువాదం) రమేష్ నాయుడు సంగీతం చేయగా పాడారు.

బాలసరస్వతి గొంతులో కొన్ని హద్దులున్నాయి. అందులో ముఖ్యమైంది శ్రుతి. సాధారణంగా సినిమా సంగీతానికి కావలసిన శ్రుతికంటె ఆమె శ్రుతి తక్కువ. అయినా ఆమె తనదైన అయిదున్నర శ్రుతిలోనే అద్భుతంగా, అత్యంత ప్రతిభావంతంగా పాడి నిరూపించుకున్నారు. ఆమెతో ఘంటసాల గానీ, ఏ.ఎమ్.రాజా గానీ, ఎమ్.ఎస్.రామారావు గానీ ఎంతో హాయిగా సులువుగా పాడారు. బాలసరస్వతి తరం దాటుతుండగా ఎక్కువ శ్రుతిలో బాగా పాడగలిగే గాయనులు సినీరంగ ప్రవేశం చేశారు.

సి.ఆర్.సుబ్బురామన్ బాలసరస్వతీ దేవిని ఎంతగానో అభిమానించేవారు. ఆమె పాటంటే ఆయనకి ప్రాణం - నిజానికి సుబ్బురామన్ చేసిన చాలా మంచిపాటలు బాలసరస్వతి పాడారు. ఒకసారి కృష్ణా పిక్చర్స్ వారి కోసం బాలసరస్వతి చేత పాడించి ఒక పాట రికార్డు చేశారు. కానీ తర్వాత ఈమె పాడిన పాటను తీసేసి, ఆ స్థానంలో నటి, గాయని అయిన పెరియనాయకి చేత పాడించి ఆ పాట సినిమాలో పెట్టాలని నిర్మాతలు పట్టుబట్టారు. ఆ సమయంలో బాలసరస్వతిపాట తీసేస్తే తాను అసలు ఆ సినిమాకి సంగీతమే కూర్చనని సుబ్బురామన్ తెగేసి చెప్పారట. చివరికి సినీప్రముఖులు ఒప్పందాలు చేయగా, బాలసరస్వతి కూడా సంగీత దర్శకత్వం వదులుకోవద్దని చెప్పగా మళ్ళీ కొనసాగారట.రావు బాలసరస్వతీదేవి మీద అయనకున్న అభిమానం అంతటిది!

అలాగే రమేష్‌నాయుడు గారికి ఆమె పాటంటే పంచప్రాణాలు -ఆయనకి సంగీత దర్శకత్వం వహించే అవకాశం మొట్టమొదటిసారి 'దాంపత్యం' (1957) సినిమా ద్వారా లభించినపుడు ఆ సినిమాలో అయిదు పాటలూ బాలసరస్వతే పాడారు. 'తానేమి తలంచేనో' అనేపాట ఆ సినిమాలోనిదే. మిగిలిన పాటలు కూడా ఎంతో పాప్యులర్ అయ్యాయి. ఒకసారి విజయవాడలో ఆమె వేదిక మీద పాడబోతుండగా, రమేష్‌నాయుడు ఆమెకి హార్మోనియమ్ మీద సహకారం అందించారు.

ఆమె కంఠంలో, పాడే విధానంలో గొప్ప గొప్ప సంగీత దర్శకుల్ని ఆకట్టుకునే అమోఘశక్తి వుంది. ఆమె పాట ఆమె పాటలాగే వుంటుంది. మరొకరు దాన్ని భర్తీ చేయలేరు. అదే ఆమెకున్న ప్రత్యేక గుణం.

ఆర్. బాలసరస్వతీదేవి అనుకోనివిధంగా సినిమా పరిశ్రమలోంచి నిష్క్రమించకుండా వుండి వుంటే ఆమె కంఠానికి అనువైన పాటలు ఆనాటి సంగీత దర్శకులు యిచ్చి వుండేవారు. లలిత సంగీతం సుసంపన్నమై వుండేది.

రాజావారు లేరు, వారితోపాటు ఆస్తుల్ని, అంతఃపురాన్ని కూడా పోగొట్టుకున్న ఆమెకు ఇద్దరు కుమారులు, ఆమె పాట మిగిలివున్నాయి.

"మీ సంగీతం మీ ఇంట్లో ఎవరికైనా అబ్బిందా? మీకు వారసులు సంగీతంలో ఎవరైనా వున్నారా?"

"లేదు. నా పిల్లలకి, మనవలకి ఎవరికీ పాట రాలేదు. ఏవో పాటలూ అవీ వింటూ వుంటారు గానీ, పాట పాడే ఆసక్తి, అవీ లేవు" అంటారామె.

రావు బాలసర్వతీదేవి తెలుగు సినిమా 'పాట' చరిత్రలో అరుదైన గాయని. ఆమెకామే సాటి. ■



# ఆర్.బాలసరస్వతిదేవి హిట్స్

**చిత్రం : మంచిమనసుకు మంచి రోజులు**
**రచన: సముద్రాల సంగీతం : ఘంటసాల**

ధరణికి గిరి భారమా
గిరికి తరువు భారమా
తరువుకు కాయ భారమా
కనిపెంచే తల్లికి పిల్ల భారమా
మును నే నోచిన నా నోముపండగా
నా వొడిలో వెలిగే నా చిన్ని నాయనా
పూయని తీవెననీ అపవాదు రానీక
తల్లిననే దీవెన తనియించినావయ్య ॥తరువుకు॥
ఆపద వేళల అమ్మమనసు చెదరునా
పాపల రోదనకే ఆ తల్లి విసుగునా
పిల్లల కనగానే తీరేనా స్త్రీవిధి
ప్రేమతో పాపలను పెంచని దొక తల్లియా ॥తరువుకు॥

**చిత్రం: తెనాలిరామకృష్ణ**
**రచన: సముద్రాల సంగీతం : విశ్వనాథన్-రామ్మూర్తి**

ఝణ్ ఝణ్ కంకణములూగ
ఘల్ ఘల్ కింకిణులు మ్రోగ
కోరిక లీడేర కూడేనురా - ॥
రూపున కెనయైనదాన - జాణ - నెరజాణ నీ
నెనరుకు తగుదాన
కూరిమి మీరా నీతో కులికే
వరము లభించెను - బతుకే ఫలించెను
వలపుల వలరాజ నన్నేలరా...
కనుసన్నల మెలగేను రారా
సుకుమార
పరువము మనదేర రాధా మనోహర
వెన్నెల వేళా విరుల లీల
విరిసి సుఖింతము పరవశింతము
సొంపుగ సంపెంగ గొంపాలలోన
వలపుల వలరాజ నన్నేలరా ॥ఝణ్॥

**రచన : సాలూరి సన్యాసిరాజు**
**సంగీతం : సాలూరి రాజేశ్వరరావు ప్రయివేటు రికార్డు**

ఆ తోటలో నొకటి ఆరాధనాలయము
ఆలయములోని అందగాడెవడో - అందగాడెవడే - అందగాడెవడే
మన్మధుండని తెలియ - మనసు ఘోషించెనె
మరలివచ్చెద మన్న - మనసు రాకున్నాదే.. ॥ఆ తోటలో ॥
చంద్ర బింబపు ముఖము - గండు కోకిల స్వరము
పండు వెన్నెలలోన - పవళించేనమ్మా - చెలియా
చుక్కల్లరేడమ్మ సకియా....॥
మరుని శరములచేత - మనసు నిలువక నేను
మల్లె మొల్ల మొగలి మాలతీ మందార
మాలికలు వాని మెడలోన వేసినానే
మధురమూర్తి మేల్కొని - మందహాసముచేయ
మకర కర్ణిక మెరిసెనే - చెలియా
మది వెన్న చిల్కినదే - సకియా
మెరుపులోనా నేను మైమరచి వెంటనే
పేరేమిటని వాని ప్రశ్నించినానే..
మాయాదేవి సుతునని మధురమూర్తి పలికె
సిద్ధార్థుడే నాకు సిద్ధించెనమ్మా - చెలియా
మది కోర్కె నెరవేరె - సకియా ॥ఆ తోటలో॥

**రచన: బసవరాజు అప్పారావు**
**సంగీతం: సి.ఆర్.సుబ్బరామన్ ప్రయివేటు రికార్డు**

తలుపు తీయునంతలోన - తత్తరమది ఏలనోయి
తలుపు తీతు వీలుచూసి - తాళుము కృష్ణా
కొంతసేపు తాళుము కృష్ణా.... ॥తలుపు॥

1. పతినిద్దుర పోవలేదు -మతి సందియ మొందెనెమొ
పతికి కునుకు పట్టగ - లోపలకు వత్తువుగానీ... తాళు
తాళుము కృష్ణా.. కాస్త సేపు తాళుము కృష్ణా.. ॥తలుపు॥
2. ఏలనంత తత్తరము - ఏలనంత భయము స్వామి
నిన్నుగాక వేరొక్కని ఎట్లు వలువగలను కృష్ణా
తాళుము కృష్ణా.. కొంతసేపు తాళుము కృష్ణా ॥తలుపు॥



ఆరేళ్ళ వయసప్పుడు (1934లో)
హెచ్.ఎమ్.వి. కంపెనీ వారికి తొలిసారిగా
పాడిన రోజున తీసిన ఫోటో



# శ్రీమతి రావుబాలసరస్వతి

## ఆల్బమ్ నుండి కొన్ని ఫోటోలు...



'కుచేల' (1935) చిత్రంలో...



1938లో ఇంట్లో ఓ రోజు



భర్త శ్రీ రాజారావు ప్రద్యుమ్నకృష్ణ మహీపతి సూర్యారావు గారితో (1944)